# ఒకే వ్యక్తి - అనేక జీవితాలు
# రాహుల్ సాంకృత్యాయన్
## (వ్యాస సంకలనం)

సంకలనం & సంపాదకత్వం
**గౌరవ్**

**ప్రత్యామ్నాయ సాంస్కృతిక సమాఖ్య**
ఆంధ్రప్రదేశ్ - తెలంగాణ

# ఒకే వ్యక్తి - అనేక జీవితాలు
# రాహుల్ సాంకృత్యాయన్

సంకలనం & సంపాదకత్వం
**గౌరవ్**

సౌజన్యం
**చెలికాని రామారావు స్మారక సమితి**

ముద్రణాకాలం : **ఏప్రిల్, 2022**

వెల : **అమూల్యం**

డిటిపి : **వి.ఎస్. గ్రాఫిక్స్**

టైటిల్ పేజి : **కవిత,** కోల్‌కతా

విజ్ఞప్తి
**ఇందులోని వ్యాసకర్తల భావాలన్నింటితోనూ**
**సంపాదకుడు తప్పనిసరిగా ఏకీభవించనవసరం లేదు.**



వివరాలకు : 9032094492
gouravmeka@gmail.com

# విషయ సూచిక

"A Progressive writer does not belong to any cult or narrow group. The aim of progressivism is to open the closed paths and broaden them. Progressivism is not the enemy of the freedom of an artist, but of his enslavement and bondage.

A progressive writer, was a people's writer. He used people's language and wrote about peoples cause. A writer is the strongest fellow and comrade-in-arms of the masses. He is also their leader. He is a soldier as well as a general. So, he has to consider himself always as one with the common man."

**– Rahul Sankrityayan**

P-48, Makers of Indian Literature
by Prabhakar Machwe
Published by Sahitya Akademi - 1978



## కృతజ్ఞతలు


**రావెల సోమయ్య,** లోహియా విజ్ఞాన సమితి, హైదరాబాద్

**డా.చెలికాని స్టాలిన్,** చెలికాని రామారావు స్మారక సమితి, రామచంద్రపురం

**కట్టా కృష్ణారావు,** జాహ్నవి సాంస్కృతిక వేదిక, అనపర్తి

**కె. శాంతారావు,** ప్రజా సాంస్కృతిక కేంద్రం, పెడన

**భానుప్రసాద్,** సైన్స్–హేతువాద సంఘం, భద్రాచలం

**ఐకా బాలాజీ,** ముందడుగు సాహిత్య వేదిక, కోల్‌కతా

**జయప్రకాష్,** డిస్కర్డ్ వేదిక, సిమ్లా

**డా॥ జి.సి. పట్టాభిరామయ్య,** దుళ్ళ

**వై.ఎస్.వి.వి. సత్యనారాయణ (కొండ)** జగన్నాథగిరి

**కె. రామచంద్రమూర్తి,** సకలం, హైదరాబాద్

**పెద్దింశెట్టి సోదరులు,** పుస్తకం గ్రూప్, రాజమండ్రి

**పెండ్యాల మల్లేశ్వరరావు,** రాహుల్జీ అభిమాని, కాకినాడ

# అంకితం



**"బాంబు ఓ భాస్వరం, ఒక ధిక్కార స్వరం**
**ఓ మేలుకొలుపు, ఒక ఆత్మీయ సాంత్వన చరుపు"**

ఆయన జనం కోసమే జర్నలిజం అని నమ్మినవాడు. ప్రజల కోసమే పత్రికలనే పాత్రికేయుడు. ఎన్ని అడ్డంకులు ఎదురైనా, జీవితాంతం తాను నమ్మిన విలువలకు కట్టుబడిన ధీరోదాత్తుడు. ఎన్నో సంచలన పత్రికలకి అప్రకటిత వ్యవస్థాపకుడు. ఏకంగా 'ఎన్కౌంటర్' పత్రిక పైనే కలాన్ని ఎక్కుపెట్టిన పోరాట యోధుడు. నిలదీతంటూ మెదలెడితే తన పర భేదాలు చూడకుండా నిగ్గదీసే నిఖార్సైన వ్యక్తి. అసమానతలతో నిండిన లోకంలో అందర్నీ సరిసమానంగా ప్రేమించగలిగిన ధీశాలి. ఎక్కడా కనీసం సెంటు భూమి కూడా లేదని నిజాయితీగా గుండెల మీద చెయ్యేసి చెప్పగలిగిన అరుదైన అభ్యుదయ శక్తి, ఆయనే మన,

## మేకా సత్యనారాయణ శాస్త్రి @ బాంబు

2022, ఫిబ్రవరి 28 సోమవారం తెల్లవారు జామున అకస్మాత్తుగా పిఠాపురంలో మరణించారు. హుందాతనానికి ప్రతిరూపంగా, సంతోషం సైతం అచ్చెరువొందేలా, నిష్కల్మషమైన వదనంతో ఎప్పుడూ  నవ్వుతూ  చివరివరకూ తనకి ఉన్నదాంతో సంతృప్తిగా జీవించిన "బాంబు" నిజంగానే మన కాలపు మానవతకి మారు పేరు, మాయమైపోతున్న నిండుతనానికి ఎడతెగని హుషారు. అరమరికలు లేకుండా అందర్నీ ప్రేమించే అద్వితీయ సెలయేరు.

మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలుగా మారిపోతున్న ఈ రోజుల్లో మమతానురాగాల చిరునామా ఆయన ఆత్మీయ ప్రేమ. మనుషులంతా యాంత్రికంగా మారిపోతున్న రోజుల్లో విలువలతో కూడినది ఆయన విధానం, ఎప్పటికీ అది నిరుపమానం. అందుకే తన కళ్ళనీ, దేహాన్ని దానం చేసి ఇద్దరు అంధులకు చూపునూ, ఎందరో భావి వైద్యులకు విద్యని అందించి మరణానంతరం కూడా జీవించే ధైర్యం కలిగిన అరుదైన వ్యక్తాయన. తండ్రిగా నా అస్తిత్వానికి కారకుడైన అలాంటి వ్యక్తికి ఆత్మీయతతో... ఈ కృతినిలా...

రాహుల్ సాంకృత్యాయన్

# సోదరుడు సిద్ధూ స్మృతిలో




"నేను గాని నా కుటుంబంలో ఇంకెవరయినా గాని చనిపోతే దయచేసి కాల్చడం, పూడ్చడం వంటివి చేయకండి. పోయిన వారి అవయవాలు బతికి ఉన్న వారికి ఉపయోగ పడేలా చూడండి. వాటిని అవసరం ఉన్న వారికి అమర్చి ప్రాణాలు నిలపండి."

పదమూడేళ్ళ సిద్ధూ ఎంతటి చురుకైన పిల్లవాడంటే, చిరు ప్రాయంలో ఆ అబ్బాయిని చూసిన ఎవ్వరయినా చిరుతపులిలాంటి చురుకుతనానికి అబ్బురపడేవారు. మిరుమిట్లు గొలిపే ఆ బుడతడి ప్రవాహ వేగానికి తనతో కచ్చితంగా ప్రేమలో పడిపోయేవారు. పైనున్న మాటలు అతడివే.

భద్రాచలంలోని డా॥ భానుప్రసాద్, సీతారమణుల ఇంటికి వెళ్ళిన ప్రతీ ఒక్కరికీ సిద్ధూ పరిచయం. తెలుగు రాష్ట్రాల్లో భావోద్యమాలకి భాను కేరాఫ్ అడ్రస్. తనకి చాతనైన ఎన్నో సామాజిక కార్యక్రమాల్లో భాగస్వామి. అనేకమంది వ్యక్తులకి, సంస్థలకి, పత్రికలకి నిత్యం చేయూతనందించే స్నేహశీలి.

అలాంటి భావోద్యమాల కూడలిలో పెరిగిన సిద్ధూ సహజంగానే ఉత్సాహాన్ని అందిపుచ్చుకున్నాడు. చదువులో, ఆలోచనల్లో ఆచరణలో కూడా ముందుండేవాడు. అల్లరిలో ఆటపాటల్లో అయితే సరేసరి. అన్నలు ప్రవీణ్, బన్నీ, తమ్ముడు అంబేద్కర్ (చిన్న సిద్ధూ) అక్కలు సన్నీ, డాక్టర్ భారతి, చెల్లి మన భారతిల ముద్దుల చెలికాడు.

అంతటి ప్రేమాస్పదుడు గతేడాది హఠాత్తుగా కొద్దిపాటి జ్వరంతో అనారోగ్యం బారినపడ్డాడు. అది ప్రమాదకరంగా మారడంతో ఖమ్మం, హైద్రాబాద్ హాస్పత్రుల్లో చేర్చారు. కోమాలోకి చేరిన తమ్ముడు సిద్ధూ

మమ్మల్నందర్నీ దుఃఖ సాగరంలోకి నెడుతూ రెండ్రోజులు మృత్యువుతో పోరాడి మరణించాడు.

ప్రజలకి వుపయోగపడే మంచి వైద్యుడిని అవుతాననే సిద్ధూ మనసు ఎంత మెత్తనిదంటే వీధికుక్కకి దెబ్బతగిలినా తట్టుకోలేకపోయేవాడు. అంత చిన్న వయసులోనే డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ పట్ల అభిమానంతో మాట్లాడుతుండేవాడు.

డా॥ భానుప్రసాద్ గారి భావజాల వారసుడు, రాష్ట్రవ్యాప్తంగా మా లాంటి ఎంతోమందికి ప్రేమాస్పదుడూ అయిన సిద్ధూ మరణం ఎంతోమందిని కృంగదీసింది. అంతటి బాధాకరమయిన సమయంలో కూడా బ్రెయిన్ డెడ్ ఐన సిద్ధూ అవయవాల్ని దానంచేసి దేహాన్ని ఆస్పత్రికి అప్పగించడం ఆ కుటుంబ ఆశయస్ఫూర్తికి నిదర్శనం.

మరణాన్ని సైతం మానవాళికి ఉపయోగపడేలా మలుచుకున్న మహోన్నత మార్గం సిద్ధూది. కుదిరినంతలో ఆ దారిలో భాగమవ్వడం ఆలోచనాపరులందరికి కర్తవ్యం. మనిషి పక్షాన నిలిచిన మానవీయ భావోద్యమాలదే ఇకపై భవితవ్యం.

అకాల మరణం చెందిన తమ్ముడు సిద్ధూ మరియు నాన్న బాంబులపై ప్రేమని వ్యక్తీకరించడానికి మాటలు, రాతలు చాలవు. ఎన్ని కన్నీళ్ళయినా ఆగవు. కోవిడ్ – 19 కారణంగా సాఫ్ట్ కాపీలకే పరిమితం అయిన ఈ కాలంలో తదనంతరం పుస్తక రూపంలో ప్రచురిస్తున్న ఈ గ్రంథం అందుకే బాంబు, సిద్ధూల స్మృతిలో తీసుకువస్తున్నాం. బాంబు, సిద్ధూ అమర్ రహే.



# ప్రస్తావన

ఆయన జీవితం ఒక మహాసముద్రం
అందులో లెక్కలేనన్ని నదులు
అన్నే ఉపనదులు
వాటికెన్నో పాయలు, హోయలు, లయలు
ఎన్నెన్నో అలల కలలు
అలుపెరుగని కెరటాలు
అలజడుల ఉప్పెనలు
అంతుచిక్కని అగాధాలు
విభ్రాంతిగొలిపే విస్ఫోటాలు
వాటితో ఆయన చేసిన పోరాటాలు.

ఆ పోరాటశీలి జీవనం వినీలాకాశం
దాంట్లో ఎన్నో మేఘ గర్జనలు
ఉరుములు, మెరుపులు, పిడుగులు
మైమరపించే నక్షత్ర మండలాలు
పరవశింపజేసే పాలపుంతలు
విస్మయపరిచే కాంతిపుంజపు వింతలు
కళ్ళు చెదిరే అంతరిక్ష కాంతులు
జీవిత పర్యంతం చేసిన కవాతులు
వెనుదీయని సంకల్పపు శక్తి సామర్థ్యాలు
అవే ఆయన అస్తిత్వపు ఉల్కాపాతాలు.

**భారతీయ తాత్విక చింతనకి రాహుల్జీ ఒక చుక్కాని. భాషా, సాహిత్యాల్ని సుసంపన్నం చేసిన మేధావి. వైజ్ఞానిక భౌతికవాద దృష్టి కలిగిన స్వతంత్ర పరిశోధకుడు. సామాజిక దార్శనిక దృక్పథం గల అరుదైన చరిత్రకారుడు. ప్రత్యామ్నాయ సాంస్కృతిక వికాసోద్యమానికి తిరుగులేని సేనాని. బహుముఖ ప్రజ్ఞాశాలి అనే పదానికి నిలువెత్తు ప్రతిరూపం రాహుల్జీ.**

వైష్ణవ సన్యాసిగా, ఆధ్యాత్మిక గురువుగా, ఆర్య సామాజికుడిగా, అర్థవంతమైన హేతువాదిగా, బహుభాషావేత్తగా, బహుజన పక్షపాతిగా, స్వాతంత్ర్య యోధుడిగా, సోషలిస్టు నాయకుడిగా, రైతు ఉద్యమనేతగా, కమ్యూనిస్టు కార్యకర్తగా, క్రియాశీల బౌద్ధుడిగా, విస్తృత రచయితగా, ప్రచండమయిన పర్యాటకుడిగా పరిణితి చెందిన విశ్వనరుడు రాహుల్జీ.

రాహుల్జీని స్మరించుకోవడం పతనమైపోతున్న వ్యవస్థ స్వరూపాన్ని విమర్శించుకోవడం. ధ్వంసమైపోతున్న సమాజ విలువల్ని సంరక్షించుకోవడం. భారతీయ సంస్కృతిలోని అవిచ్ఛిన్నమయిన భిన్నత్వాన్ని కాపాడుకోవడం. నిత్య సత్యాన్వేషిగా బతికిన ఒక అద్వితీయ జ్ఞానశిఖరాన్ని ఆవాహన చేసుకోవడం. మాయమైపోతున్న మానవత్వానికి మనవంతు తోడుగా నిలబడటం.

అందులో భాగమే ఈ సంకలనం. తప్పకుండా చదవండి. మీతోపాటూ కనీసం మరొక్కరిచేతనైనా చదివించండి. మరుగునపడ్డ ఒక మహామనిషి కోసం తెలుసుకోనివ్వండి. మానవాళి ఉన్నతికోసం పాటుపడిన మహనీయుడ్ని మనసారా తలుచుకోనివ్వండి. అజరామరమయిన ఆయన జీవన స్ఫూర్తిని పూర్తిగా గుండెల్లో నింపుకుని ఆర్తితో పుస్తకం పూర్తి చేద్దాం రండి. అందులో కొంతయినా మన జీవితాల్లో ఆచరించగలమేమో నిజాయితీగా ప్రయత్నం చేసి చూద్దాం. పదండి.

**రాహుల్జీ గురించి తెలుసుకుందాం!**

**మనల్ని మనం చైతన్య పరుచుకుందాం!!**

# సంపాదకుని మాట

రెండేళ్ళ క్రితం సంగతి. 2020లో 'భారతదేశంలో బౌద్ధ పతనం' అనువాదం చేసాక లాక్డౌన్ కారణంగా సాఫ్ట్‌కాపీ రూపంలో ముద్రించి పంచాం. అప్పుడే తూ.గో.జిల్లా రామచంద్రపురంలో రాహుల్జీపై రాష్ట్రస్థాయి సదస్సు జరగాల్సి ఉంది. కానీ కరోనా వల్ల వాయిదా పడింది. అయితే, సరిగ్గా అదే ఏడాది గుంటూరు జిల్లా తెనాలిలో కూడా 'ప్రజ్వలిత; సామాజిక – సాంస్కృతిక – సాహిత్య సంస్థ' ఆధ్వర్యంలో రాహుల్జీ గురించి ఒక సదస్సు జరగాల్సి వుండగా, అది కూడా వాయిదా పడింది. ఆ సంస్థ బాధ్యులు నాగళ్ళ వెంకట దుర్గాప్రసాద్ కరోనా కాలంలో మరణించారు.

ఈ లోపల తెలుగులో ప్రగతిశీల భావాల మొదటి అంతర్జాల సమావేశ ఛానల్ డిస్కర్డ్ వేదిక నిర్వాహకులు, మిత్రులు జయప్రకాష్‌గారి కారణంగా రాహుల్ సాంకృత్యాయన్ జీవితం గురించి గంటసేపు ప్రసంగించాను. అది విన్న తెలంగాణ పిడిఎస్‌యు విద్యార్థి సంఘం వారు బ్లూజీన్స్ యాప్‌లో రాహుల్‌జీ గురించి ప్రసంగించమని అడగడంతో సుమారు రెండు గంటలపాటు ప్రసంగించాను.

తదనంతరం ప్రసంగంలోని విషయాలు చాలా కొత్తగా ఉన్నాయని, వాటిని రాత రూపంలో పెట్టమని మిత్రులు బలవంత పెట్టడంతో 'ఒకే వ్యక్తి – అనేక జీవితాలు' పేరుతో సంక్షిప్తంగా వ్యాసం రాసాను. వివిధ పత్రికలు దానిని ముద్రించాయ్. నేను ప్రస్తావించిన మెటీరియల్‌ని చూసి అప్పట్లోనే రాహుల్జీ గురించి ఒక సమగ్రమైన పుస్తకం రాయమని ఒత్తిడి చేసిన స్నేహితులున్నారు కానీ అనేక అశక్తతలు అడ్డు వచ్చాయి. గతంలోలాగా అవాంతరాలన్నింటిని అధిగమించడం సాధ్యపడట్లేదు.

ఈ క్రమంలో రాహుల్జీ గురించిన వివరాలకోసం అడపాదడపా ఇతర రాష్ట్రాల మిత్రులతో కూడా చర్చించడం జరుగుతుండేది. రాహుల్జీ జన్మభూమి ఉత్తర భారతదేశంలోని పందహ్, కనైలీ గ్రామాలు మొదలుకుని అంతిమంగా విశ్రమించిన డార్జిలింగ్ వరకూ సాగిన అన్వేషణ అంతర్లీనంగా విశ్రమించనిచ్చేది కాదు.

ప్రత్యామ్నాయ సాంస్కృతికోద్యమాలకి రాహుల్జీ ఒక తిరుగులేని ప్రతినిధి. మార్క్సిస్టు దార్శనికుడిగా బౌద్ధమత ప్రాధాన్యత, అంబేద్కర్ ప్రాముఖ్యత, గాంధీజీ త్యాగ నిరతిని గుర్తించి గౌరవించిన వ్యక్తి. అంతేకాదు, భారతీయ సంస్కృతి స్రవంతిని సాధికారికంగా అధ్యయనం చేసినవాడు.

ఈ కారణాలన్నింటివల్లా రాహుల్జీ గురించి తెలుగులో సమాలోచనాత్మకంగా ఒక సంకలనం తీసుకొద్దామనే తలంపు వచ్చింది. ఆలోచన విన్న అత్యధిక శాతం మంది అదొక దుస్సాహసమంటూ పెదవి విరిచారు. 'అమ్మో రాహుల్జీ గురించే! మా వల్ల కాదు, వొదిలేయండం'టూ ఆయన పేరు వింటూనే హడలిపోయిన వాళ్ళు పదుల సంఖ్యలో ఉన్నారు.

తెనాలిలో ప్రజ్వలిత సంస్థ చేసిన చివరియత్నం కాబట్టి ఆ సంఘ సభ్యులెవరయినా స్పందిస్తారేమోనని వాకబు చేస్తే ఒక్కరంటే ఒక్కరు కూడా ముందుకు వచ్చినవారు లేరు. ఢిల్లీలో రాహుల్జీ సాహిత్య ప్రతిష్టాన్ బాధ్యులు మరణించారనీ, ఆయన తర్వాత, సంస్థ నిర్వీర్యం ఐందనీ ఫోన్‌లో సంప్రదించగా వచ్చిన సమాచారం. ఇక కుటుంబ సభ్యులు కనుక కొడుకుల్ని, కూతుర్లనీ అడగదల్చుకోలేదు. భావజాల వారసత్వంపైనే కాని బంధాల వారసత్వంపై నాకంతగా సదభిప్రాయం లేదు.

భారతీయ సాంస్కృతికోద్యమంలో తాత్వికస్థాయిలో అరుదయిన కృషి చేసిన బుద్ధిజీవిగా రాహుల్ సాంకృత్యాయన్ గురించి విస్తృతమయిన అధ్యయనాలు, విశ్లేషణలు వీలైనంత ఎక్కువగా జరగాల్సిన అవసరం ఎప్పటికంటే ఈరోజు మరింత ఉందనేది నా అభిప్రాయం. ఎవరో కొద్దిమందికి తప్ప ఈరోజు ఆయన గురించి తెలిసినవాళ్ళు అరుదు.

భావజాల రంగంలో వాటిల్లిన ముప్పు భవిష్యత్తు తరాల ముందు పెద్ద ఖాళీని ఉంచింది. ఎంత కష్టమయినా దానిని మానవీయ భావాలతో నింపే పని చేపట్టక తప్పదు; ఎందుకంటే, ఈసరికే ఉన్మాదం దానిని ఆక్రమించుకోవడంలో ముందుంది కనుక. కాబట్టి, అన్ని రోగాలకీ ఒకటే మందని వాదించే మార్క్సిస్ట్ మిత్రులు ఇకనైనా మారడం మంచిది.

వ్యక్తిగతంగా అనేక పరిమితులతో చేసిన ఒక స్వచ్ఛంద ప్రయత్నం ఈ వ్యాస సంకలనం. చదివి విమర్శనాత్మకంగా స్పందిస్తే సంతోషం. జీవితంలో హఠాత్తుగా తలెత్తే వివిధ ఒడిదుడుకుల వల్ల అనుకున్న విధంగా కాకపోయినా ఏదో మేరకు ఈ సంకలనానికి సంకల్పించి న్యాయం చేసాననే తృప్తి ఉన్నది. అందుకు సహకరించిన వారందరికీ పేరుపేరునా ధన్యవాదాలు.

కష్టమని తెలిసి కూడా నా వంటి వాడితో ఇష్టంగా జీవించడానికి సిద్ధపడ్డ సహచరి కళ్యాణి కనుక లేకుంటే ఈ మాత్రం పనులయినా చేయగలిగేవాడ్నని నమ్మకం నాకైతే లేదు. అందుకు ఆమెకి నా కృతజ్ఞతలు. విమర్శలకి ఆహ్వానం.



# ముందుమాట

**డా. చెలికాని స్టాలిన్**
చెలికాని రామారావు స్మారక సమితి,
రామచంద్రాపురం

రాహుల్ సాంకృత్యాయన్ గురించి ఒక విశిష్టమైన సదస్సు జరుగుతున్న సమయంలో ఈ వ్యాస సంకలనాన్ని తీసుకురావడం ముదావహం. వివిధ రచయితల దగ్గర్నుంచి ఓర్పుగా వ్యాసాలను సేకరించి ఇలా సంకలనంగా కూర్చి పుస్తక రూపంలో మన ముందుకు తీసుకువచ్చిన మిత్రుడు గౌరవ్‌కు అభినందనలు.

తెలుగు పాఠకులకు రాహుల్జీ సుపరిచితులే. గత శతాబ్దంలోని ఆరంభ దశాబ్దాల్లో అప్పుడప్పుడే అభ్యుదయ ఉద్యమం నిలదొక్కుకుంటున్న కాలంలో, రాహుల్జీ సాహిత్యం ఆనాటి యువతరం మీద ఎనలేని ప్రభావాన్ని కలుగజేసింది. చారిత్రక భౌతికవాద దృక్పథంతో తన అనుభవాలను, పరిశీలనలను విశ్లేషించిన రాహుల్జీ వాటిని అక్షరాల రూపంలో పాఠకుల ముందు  ఆవిష్కరించారు.

నాటి తరానికి దిక్సూచిలుగా నిలిచిన ఆయన రచనల్ని చదివిన ఎంతోమంది రాహుల్జీ అభిమానులుగా మారిన వారున్నారు. రాహుల్జీ ఎన్నో రచనల్ని తెలుగువారికి పరిచయం చేసిన కీ. శే. ఆలూరి భుజంగరావుగారు ఎంతైనా అభినందనీయులు.

యాత్రికుడిగా అనేక దేశాలను, ప్రాంతాలను దర్శించి అక్కడి మానవ సమాజాలను పరిశీలించిన వ్యక్తిగా రాహుల్జీ గురించి అందరికీ తెలుసు. కానీ, తాత్విక రంగంలో కూడా అనేక భావజాలాలను అధ్యయనం చేసి, వాటితో మమేకమౌతూ జీవనయానం సాగించిన మేధో యాత్రికుడు రాహుల్జీ.

సనాతన బ్రాహ్మణుడిగా మొదలై వైష్ణవ సాధువుగా, ఆర్య సమాజ కార్యకర్తగా, బౌద్ధ సన్యాసిగా, స్వాతంత్ర్య పోరాట యోధుడిగా, రైతాంగ

ఉద్యమకారుడుగా, కమ్యూనిస్టుగా ఆయన జీవన యాత్ర సాగింది. “ఈ దేశం నా మాతృదేశం అని చెప్పుకోడానికి ఎవరు గర్వించరు? అలా చెప్పుకోవడానికి వేలాది కారణాలు ఉన్నాయి” అని గర్వంగా చాటుకున్న సాంస్కృతిక జాతీయవాది రాహుల్జీ.

అదే సమయంలో అంతర్జాతీయతను ప్రభోదించే మార్క్సిజాన్ని తన ఆలోచనా క్రమంగా అందుకున్న శ్రామిక జన పక్షపాతి రాహుల్జీ, ఈ దేశం కుల మత రహిత లౌకిక దేశంగా ఎదగాలనీ, దేశ సమైక్యతకు మతం ప్రధాన విరోధి అని ప్రకటించిన సామ్యవాది.

ఈనాడు భారతీయ సంస్కృతి పేరిట మెజారిటీ మత సంస్కృతే చెలామణీ అవుతోంది. మిగతావారంతా ద్వితీయ శ్రేణి పౌరులుగానే ఉండాలనే భావన రాజ్యమేలుతోంది. మతమౌఢ్యం, కులతత్వం ప్రభలిపోయి సాంస్కృతిక నియంతృత్వాన్ని పెంచిపోషిస్తున్నాయి. దీనివల్ల ప్రశ్నించేతత్వం నశిస్తోంది. ఆలోచనాపరులందర్నీ ఈ స్థితి ఆందోళన పరుస్తోంది.

ఇటువంటి కాలంలో రాహుల్జీని అధ్యయనం చేయడం, ఆయన స్ఫూర్తిని అందుకోవడం ఎంతైనా అవసరం. అందులో భాగంగా జరుగుతున్న ఒక ప్రయత్నమే ఈ సమాలోచనా సమావేశం, అలాగే ఈ సంకలన పుస్తకం, ఇది సార్థకమవ్వాలని కోరుకుంటూ, సెలవు.



# 1

# మనకాలపు మహాద్భుతం రాహుల్ సాంకృత్యాయన్

– **కల్లూరి భాస్కరం,** సీనియర్ జర్నలిస్టు, అనువాదకులు,
బెంగుళూరు, 9703445985

చాలామంది దేవుడూ, మతవిశ్వాసాల దగ్గరే ఆగిపోతారు. జీవితాంతం అక్కడే ఉండిపోతారు. కొద్దిమంది మాత్రమే విశ్వాసాన్ని జయించి హేతుబద్ధమైన విజ్ఞానంవైపు ప్రయాణిస్తారు. ఆ కొద్దిమందిలో ఒకడు రాహుల్ సాంకృత్యాయన్!

చాలామంది పుట్టిన ప్రాంతంలోనే ఆగిపోతారు జీవితాంతం అక్కడే ఉండి పోతారు. కొద్దిమంది మాత్రమే ఉన్నచోట ఉండిపోయి నాచుపట్టి పోకుండా నిత్యసంచారం చేస్తూ దేశదిమ్మరి జీవితం గడుపుతారు. ఆ కొద్దిమందిలో ఒకడు రాహుల్ సాంకృత్యాయన్!

చాలామంది నూరేళ్ళ జీవితరూపంలో తమకు లభించిన అమూల్యమైన కాలంలో ఎక్కువ సమయాన్ని వృథాగా గడిపేస్తూ సొంతానికీ, ఇతరులకూ కూడా ఏమాత్రం ఉపయోగపడకుండా అనామకంగా మట్టిలో కలిసిపోతారు. కొద్దిమంది మాత్రమే ప్రతిక్షణాన్నీ సార్థకం చేసుకుంటారు, ప్రతి నిముషాన్నీ జీవిస్తారు. ప్రతి గంటా గణగణమని మోగుతూ తమ ఉనికిని చాటుకుంటారు. పది జీవితకాలాలకు సరిపోయే జ్ఞానాన్ని, అనుభవాన్ని తమ వారసత్వంగా మానవాళికి ఇచ్చి పోతారు. ఆ కొద్దిమందిలో ఒకడు రాహుల్ సాంకృత్యాయన్!

రాహుల్ సాంకృత్యాయన్ అంటే నడిచే విజ్ఞాన సర్వస్వం, నిరంతర క్రియాశీలం, నిత్యప్రాపంచిక శోధనం, అలుపెరుగని చైతన్యం. ఆయన జీవిత గమనాన్ని, అది తిరిగిన మలుపుల్ని గమనిస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఇంత సంచారం, ఇన్ని గ్రంథాల సేకరణం, ఇన్ని పుస్తకాల రచన, ఇన్ని రంగాలలో ప్రవేశం ఒక మనిషికి సాధ్యమా అనిపిస్తుంది. ఇంత వైవిధ్యం ఎవరి జీవితంలోనైనా ఉంటుందా అనిపిస్తుంది. తను పుట్టింది నేటి ఉత్తర

ప్రదేశ్‌లో ఆజంగఢ్ జిల్లాలోని పందహా అనే కుగ్రామంలోనే అయినా యావద్దేశ ప్రమాణానికి విస్తరించాడు ఏ ప్రాంతానికి వెళ్ళినా ఆ ప్రాంత జనంలో కలిసిపోయాడు, వారి భాషనే తన భాష చేసుకోవడానికి ప్రయత్నించాడు స్వదేశాన్నే కాదు, ప్రపంచాన్నే స్వస్థానం చేసుకున్నాడు, తను అడుగుపెట్టిన ప్రతి కొత్త చోటునూ విప్పారిన చారిత్రక నేత్రంతో దర్శించాడు, కుతూహలంతో పులకించాడు, మానవశాస్త్ర కోణంలో ఆ ప్రాంత జనుల మూలాలను అన్వేషించే ప్రయత్నం చేశాడు.

రాహుల్‌పై మాతామహుని ప్రభావం పడినట్టు కనిపిస్తుంది. 1893లో పుట్టిన ఆయన అమ్మమ్మ ఇంట్లోనే పెరిగాడు. అతని తొలి పేరు కేదార్‌నాథ్. తాత రామ్ శరణ్ పాఠక్‌కు ఇంట్లోంచి పారిపోయి హైదరాబాద్ సైన్యంలో చేరిన అనుభవం ఉంది. ఆ లక్షణం రాహుల్‌కు వచ్చింది. అతను కూడా ఇంట్లో చెప్పకుండా ఎన్నోసార్లు కొత్త కొత్త ప్రదేశాలు చుట్టి వచ్చాడు. తాత చెప్పే కథల్లో దొర్లిపోయే అనేక ప్రదేశాల పేర్లు బాల్యంలోనే అతనిలో ఉత్సుకతను నింపి పర్యాటక జీవితానికి తొలి ప్రేరణలైనట్టున్నాయి. అజంతా, ఎల్లోరా గుహల గురించిన కథ వాటిలో ఒకటి. రాముడు అరణ్యవాసానికి వెడతాడని ముందే తెలిసిన దేవతల శిల్పి విశ్వకర్మ, అడవిలో అతని సుఖజీవనం కోసం కొండలు తొలచి అక్కడ భవనాలు నిర్మించాడట. వాటిని రాక్షసులు ఆక్రమించుకున్నారట. విశ్వకర్మకు కోపమొచ్చి వారిని శిలలైపోమని శపించాడట! బహుశా బౌద్ధ సంబంధమైన అవైదిక నిర్మాణాల పట్ల వైదిక మతస్థుల్లో ఉన్న తిరస్కార భావం ఇలాంటి కథల రూపంలో వ్యక్తమయ్యేది కాబోలు.

తాత చెప్పిన కథల్లో దొర్లే ప్రదేశాలపై రాహుల్ ఆసక్తి ఎంతవరకూ వెళ్ళిందంటే, రంగుల్లోనూ, అందమైన అక్షరాలతోనూ దేశ పటాలను గీసి వాటిపై ఆ ప్రదేశాలను గుర్తించి మురిసిపోయేవాడు. ఆ పటాలు ఉపాధ్యాయుల మెప్పు పొందేవి. చదువు, మధ్య మధ్య ఇంట్లో చెప్పకుండా ఊళ్ళు తిరిగి రావడం జమిలిగా సాగిపోతూ వచ్చాయి. ఆ క్రమంలో అనేక పరిచయాలూ, అనుభవాలూ రాహుల్ జ్ఞానవైశాల్యపు హద్దులను నిరంతరాయంగా పొడిగిస్తూనూ వచ్చాయి. ఒక పరమహంసను దర్శించి చివరికి వైరాగ్యంలోనూ,

వేదాంతంలోనూ కూడా పడ్డాడు. అవి హిమాలయాలవైపు, సాధు సందర్శన వైపూ, కాశీవైపూ, సంస్క ృతాభ్యాసం వైపూ నడిపించాయి. ఆపైన మంత్రతంత్రాలలోకి కూడా ప్రవేశించాడు. ఎవరో చెబితే కొన్ని రోజులపాటు దేవీదర్శనం కోసం మంత్రజపం చేశాడు, అయినా దర్శనం కాకపోవడంతో ఆత్మహత్యా ప్రయత్నం కూడా చేసి, ఆరోగ్యాన్ని చెడగొట్టుకున్నాడు. అతనిపై ఇష్టం ఏర్పడిన ఒక మహంతి ఛప్రాజిల్లాలోని తన పర్సా మఠానికి అధిపతిని చేశాడు. ఆ రోజుల్లో సాలీనా పన్నెండు వేల రూపాయల నగదు, అంతే విలువైన ధాన్యం రాబడి ఉన్న మఠం అది. దాని అధిపతిగా రాహుల్‌కు రాకుమార సేవలు లభించేవి. కానీ అతనిలోని జ్ఞానదాహమే పై చేయిని సాధించడంతో క్రమంగా ఆ అధిపత్యపు సంకెళ్ల నుంచి అతను బయటపడ్డాడు.

కుటుంబ నేపథ్యమూ, సమాజమూ, సంప్రదాయమూ – రకరకాల విశ్వాసాలు, ఆనవాయితీల రూపంలో పుట్టుకతోనే కల్పించే బంధనాలను తెంచుకోవడం అంత సులభం కాదు. దానికి ఎంతో పెనుగులాడవలసివస్తుంది. అది రాహుల్ వంటి వ్యక్తులకూ తప్పలేదు. ఆయనలో వైరాగ్యం, వేదాంతధోరణి తగ్గి వాటి స్థానాన్ని పర్యటనాసక్తి, జ్ఞానతృష్ణ మరింతగా ఆక్రమించుకున్నాయి కానీ, దైవభక్తి అలాగే ఉంది. వైష్ణవ మతం వైపు, రామానుజ తాత్వికతవైపు పయనించాడు. ఆ తర్వాత ఆర్య సమాజం ప్రభావంలోకి వచ్చి కులభేదాలను నిరసించడం ప్రారంభించాడు. ఇంకోవైపు రష్యన్ విప్లవం గురించి పత్రికల్లో చదివి దానివైపు ఆకర్షితుడయ్యాడు. అంతలో, చదువు కొనసాగిస్తూనే రాజకీయ కార్యక్షేత్రంలోకీ అడుగుపెట్టాడు. సంస్కృతంలోనే మాట్లాడాలన్న తన సంకల్పాన్ని అప్పటినుంచీ వదలుకున్నాడు. గాంధీజీ ప్రారంభించిన సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొనీ, ఆ తర్వాత అఖిలభారత రైతు మహాసభ అధ్యక్షుడిగానూ దాదాపు మూడేళ్లపాటు జైలుశిక్షనూ అనుభవించాడు. ఛప్రాజిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా ఎన్నికయ్యాడు. కాంగ్రెస్ తన వ్యూహాన్ని మార్చుకుని చట్టసభల్లోకి అడుగుపెట్టాలని మోతీలాల్ నెహ్రూ, విఠల్ భాయ్ పటేల్ తదితరులు వాదిస్తూ, గాంధీ వైఖరికి వ్యతిరేకంగా మార్పు అనుకూలుర (ప్రో–ఛేంజర్స్) శిబిరంగా ఏర్పడినప్పుడు రాహుల్ ఆ శిబిరంవైపు మొగ్గుచూపి జిల్లా కాంగ్రెస్ పదవికి రాజీనామా చేశాడు.

రష్యన్ విప్లవం ప్రభావంతో మార్క్సిజంవైపు బలమైన అడుగులు వేస్తూ మతానికి గల పరిమితులను, ప్రగతి నిరోధక లక్షణాలను గుర్తిస్తూనే బౌద్ధంవైపు పయనించడం రాహుల్ స్వభావంలోని విలక్షణతను సూచిస్తుంది. బౌద్ధంవైపు ఆకర్షితుడు కావడమే కాదు, ఏళ్లతరబడి బౌద్ధ సంబంధమైన కృషిలో జీవించాడు. అనేకసార్లు శ్రీలంక, టిబెట్ వంటి బౌద్ధ ప్రభావిత దేశాలకు వెళ్ళి విలువైన బౌద్ధ గ్రంథాలను సేకరించాడు, కొన్నింటిని అనువదించాడు, ప్రచురింపజేశాడు. బౌద్ధం కూడా ఒక మతమే అయినప్పటికీ, మిగిలిన మతాలకు భిన్నంగా అది సమానత్వాన్ని ప్రతిపాదించి, ప్రగతిశీల స్వభావాన్ని తెచ్చుకుందని భావించాడు. 'తెప్పలా ఒడ్డు చేర్చడానికి నీకు ధర్మోపదేశం చేశాను కానీ, నెత్తిమీద మోసుకు తిరగడానికి కాదు' అన్న బుద్ధుని బోధ అతన్ని ప్రత్యేకించి ఆకట్టుకుంది. భగవంతుడు కల్పన అనీ, బుద్ధుడు యథార్థమనీ, ఉభయుల మధ్యా ఇలాంటి మౌలికమైన తేడా ఉందన్న అవగాహన కలిగాక భగవంతుని వదిలేసి నాస్తికుడయ్యాడు. చిన్నతనం నుంచీ తనను వెంటాడుతూనే ఉన్న దైవభావనను వదలుకోవడం అతనికి సైతం అంత సులభం కాలేదు, ఎంతో పెనుగులాడవలసివచ్చింది, మొదట్లో అశాంతికి లోనయ్యాడు. క్రమంగా కుదుటపడి హేతుబద్ధ విచికిత్సకు మూలమైన బుద్ధినే అనుసరించాలనుకున్నాడు. డార్విన్ పరిణామవాదంతో సహా శాస్త్రవిజ్ఞాన ఆవిష్కారాలవైపు మొగ్గుచూపుతూ వచ్చాడు.

చరిత్ర, పురాచరిత్ర, మానవశాస్త్ర విషయాలలో రాహుల్ ఆసక్తీ, దోహదమూ కూడా అమూల్యమైనవి స్ఫూర్తిదాయకమైనవి. నిత్య సంచారిగా ప్రపంచంలోని అనేక ప్రదేశాలను దర్శించడంవల్ల ఆ ప్రదేశాల చరిత్ర, పురాచరిత్రలను తడమడమే కాక అక్కడి మనుషుల జీవనసరళిని, వారి ఆచార వ్యవహారాలను, వారి మూలాలను ఆయా దేశాలు, ప్రాంతాల జనాల మధ్య గల రకరకాల తేడాలను పరిశీలనగా చూసే వెసులుబాటు ఆయనకు లభించింది. ఉదాహరణకు, కట్టు బొట్టులోనే కాక చారిత్రకంగా సిద్ధించిన స్వభావంలోనూ ఉత్తర, దక్షిణ భారత జనాల మధ్య ఉన్న తేడాలను ఆయన గమనించాడు. ఆంధ్రదేశం మీదుగా మద్రాసు వెడుతున్నప్పుడు ఆంధ్రస్త్రీల

వేషభాషలు అతనికి విచిత్రంగా తోచాయి. మద్రాసులో స్త్రీలు ఘోషా పాటించకపోవడం కూడా వింత గొలిపింది. తిరుపతికి కాలి నడకన వెళ్ళాడు. కానీ అక్కడి వాతావరణం అతనికి నచ్చలేదు. తను ఉత్తర భారతాన్నే కానీ, దక్షిణ భారతాన్ని కార్యక్షేత్రం చేసుకోకూడదనుకున్నాడు. ఉత్తరభారత, దక్షిణ భారత బ్రాహ్మణుల మధ్య అతనికి ఎంతో తేడా కనిపించింది. ఉత్తర భారతంలో బ్రాహ్మణేతరులందరినీ శూద్రులుగా చూడరనీ సమానంగానే చూస్తారనీ కానీ మద్రాసులో శూద్రులను చాలా నీచంగా చూస్తున్నారనీ అనుకున్నాడు. దక్షిణాది బ్రాహ్మణులు సుఖజీవనం చేస్తుండగా, ఉత్తరాది బ్రాహ్మణులు కాయకష్టం చేస్తుండడం విద్యలోనూ ఉభయుల మధ్యా తేడా ఉండడం గమనించాడు. ఉత్తర భారతం మహమ్మదీయుల పాలనలో ఉండడం, దక్షిణభారతం హిందూ రాజుల పాలనలో ఉండడం ఈ తేడాకు కారణమనుకున్నాడు. ధాన్య కటకాన్ని దర్శించి గుంటూరు వచ్చి పల్నాటిసీమలోని లంబాడీలతో కాసేపు మాట్లాడినప్పుడు, వారిది రాజస్థాన్‌లోని మేవాడ్ దక్షిణ సరిహద్దు భాష అనీ, చాలాకాలం క్రితం మేవాడ్ నుంచి ఇక్కడికి వచ్చి స్థిరపడ్డారనీ అనుకున్నాడు. వారు నృత్యం చేస్తున్నప్పుడు గంగానదిని ఉద్దేశించిన గేయాలను పాడడం, దక్షిణాదిన అంతగా కనిపించని హోలీ పండుగ జరుపుకోవడం కూడా గమనించాడు. టిబెట్ లో పర్యటిస్తున్నప్పుడు ఒక లామా నల్లని యాక్‌పై, అంటే చమరీ మృగంపై ఎక్కి వస్తూ కనిపించాడు. దీనిని బట్టి శంకరుని వాహనం తెల్లని నంది కాదని, నల్లని చమరీ మృగమని (ఇది కూడా గోజాతికి చెందినదే) రాహుల్ అనుకున్నాడు.

కేరళకు వెడుతున్నప్పుడు 'తోడా'లు ఆయన దృష్టిని ఆకర్షించారు. వారు అప్పుడప్పుడే దుస్తులు ధరించడం ప్రారంభించారని అనుకున్నాడు. తోడా స్త్రీలే కాక, విద్యావంతులు మినహా మలబారు స్త్రీలందరూ నడుముకు పైభాగంలో దుస్తులు ధరించకపోవడం, మహమ్మదీయ స్త్రీలు మాత్రం నడుముకు పైభాగాన్ని కప్పుకోవడం గమనించాడు. కేరళలో శంకరాచార్యుల శాఖ అయిన నంబూదిరి బ్రాహ్మణుల గురించి రాస్తూ, వీరిది మొదట్లో భూదేవవంశమనీ, రెండువేల ఏళ్ల క్రితం మలబారుకు వచ్చారనీ, అప్పటినుంచీ

అది వారికి ఏ పనీ చేయనవసరంలేని దేవలోకమే అయిందన్నారు. ధర్మశాస్త్రాన్ని తయారు చేయడం, మార్చడం తమ చేతుల్లో ఉంచుకున్నారనీ, వారి స్వార్థమే అక్కడ మాతృస్వామ్యం వర్ధిల్లడానికి కారణమైందనీ వ్యాఖ్యానించాడు.

ఇవలా ఉండగా, ఇండో-యూరోపియన్ జనాలతోనూ, భాషలతోనూ ముడిపడిన ఋగ్వేద ఆర్యులపై ఆయన చేసిన పరిశోధనా, నిర్ధారణలూ మరింత విశేషమైనవీ, అమూల్యమైనవీ. పురాచరిత్ర, మానవశాస్త్ర దృక్కోణం నుంచి ఋగ్వేదాన్ని పరిశీలించి, వ్యాఖ్యానించిన భారతీయ పండితులలో రాహుల్ సాంకృత్యాయన్ అగ్రగణ్యుడనడంలో ఎలాంటి సందేహం లేదు. 'ఋగ్వేద ఆర్యులు' పేరుతో ఆయన రచించిన పుస్తకం ఎంతో ప్రసిద్ధం. ఋగ్వేదంలో ఆర్యుల రంగు గురించి స్పష్టంగా చెప్పకపోయినా, వారు స్తుతించిన దేవతల రంగును బట్టి యోగసూత్రాల కర్త, పాణినికి భాష్యకారుడు అయిన పతంజలి చిత్రించిన దానిని బట్టి వారు ఎరుపు, తెలుపు రంగువారని, వారి గడ్డాలు, మీసాలూ బంగారు రంగులో ఉండేవనీ తేల్చాడు. వారి ఆహార్యమూ, అలంకరణలు, ఆహారపు అలవాట్లతో సహా అన్ని విషయాలనూ అందులో పొందుపరిచాడు. ఆర్యులు ఉన్ని వస్త్రాలు ధరించేవారనీ, అందువల్లనే ఉన్ని పవిత్రమనీ, నూలు వస్త్రం అపవిత్రమనే భావన కలిగిందనీ అన్నాడు. ఎద్దుచర్మాన్ని ఒకప్పుడు పవిత్రంగా భావించారనీ, తర్వాత జింకచర్మం పవిత్రతను తెచ్చుకుందనీ రాశాడు. ఆర్యగణాలతోపాటు, ద్రావిడుల వంటి అనార్య తెగల గురించి విస్తారంగా సమాచారం ఇచ్చాడు. పారశీకుల తర్వాత ఋగ్వేద ఆర్యులకు స్లావులైన రష్యన్లు, తూర్పు యూరప్ దేశాలవారు దగ్గర అన్నాడు. భారతదేశంలోని కొన్ని ప్రాంతాలను ఏలిన శకులు స్లావులేనని అన్నాడు. ఆయన ప్రకారం, బుద్ధుని కాలానికి వేదాలు మూడే. ఋగ్వేదకాలంనాటి చారిత్రక సమాచారాన్ని తారుమారు చేయడం యజుర్వేదంతోనే మొదలైంది. రామాయణ, భారతాలు, పురాణాలు దీనిని మరింత ముందుకు తీసుకెళ్ళాయి. ఋగ్వేదానికీ, మిగతా వేదాలకూ అసలు పోలికే లేదు. బ్రాహ్మణ-క్షత్రియుల మధ్య ఆనాడు తేడాలేదన్నది రాహుల్ చేసిన మరో ఆసక్తికరమైన ప్రతిపాదన. ఆయన ప్రకారం, బ్రాహ్మణ, క్షత్రియులు

ఒకే ఇంట పుట్టిన అన్నదమ్ముల వంటివారు. వారిలో ఒకరు బ్రాహ్మణత్వం స్వీకరిస్తే, రెండవవారు క్షత్రియత్వం స్వీకరించారు. ఆవిధంగా అది వృత్తిభేదం మాత్రమే, 'వోల్గా సే గంగ'తో మొదలుపెట్టి ఆయన రచించిన అనేక ప్రసిద్ధ నవలలు ప్రధానంగా ఇండో–యూరోపియన్ లేదా ఆర్యులు భారత్‌కు వలసవచ్చిన క్రమాన్ని, వారి జీవనపరిణామ వికాసాలను చిత్రించినవే. ఋగ్వేద ఆర్యుల గురించిన ఆయన పరిశోధనలు, ప్రతిపాదనలు గత దశాబ్ద కాలంలో ఇండో–యూరోపియన్ జనాలకు సంబంధించి జన్యు పరిశోధనలు ఆవిష్కరించిన ఫలితాలకు చాలా దగ్గరగా ఉండడం ఈరోజున ప్రత్యేకంగా ప్రస్తావించుకోవలసిన విశేషం.

బండ్లపల్లె ఓబులరెడ్డి రచించిన 'మహోన్నత మానవుడు రాహుల్ సాంకృత్యాయన్' చదువుతున్నప్పుడు రాహుల్ సమకాలీన పరిస్థితులు, పరిణామాలు అనేకం మన దృష్టికి వస్తాయి. వాటిలో గ్రంథకర్తృత్వం విషయంలో నిజాయితీ రాహిత్యాన్ని చాటేవితో మొదలుపెట్టి ఇతరత్రా విచారం కలిగించేవి ఎన్నో ఉన్నాయి. ఒక సాధువు ఒక రాతపుస్తకం రాహుల్‌కు ఇచ్చి, దానిని ఉన్నదున్నట్టు రాసి ఇవ్వమనీ, రామానంద భాష్యం పేరుతో దానిని ప్రచురించుకుంటామనీ చెప్పాడట. తీరాచూస్తే, అది అద్వైతాన్ని ఖండిస్తూ, ద్వైతాన్ని ప్రతిపాదిస్తూ తులసీదాసు రాసిన వేదాంత భాష్యమని రాహుల్ కు అర్థమైంది. అప్పటికాయన శంకరాద్వైతాన్ని విడిచిపెట్టి ద్వైతవాది అయ్యాడు కనుక ఆ పుస్తకం నచ్చిందట కానీ, దానిని రామానందుని పేరిట ప్రచురించడానికి ఇష్టపడక కాపీ చేసి ఇవ్వడానికి నిరాకరించాడు. ఇంకెవరో ఆ పని చేసిపెట్టారు. వెనకటి రోజుల్లో ఇలాంటివి జరగడం సర్వసాధారణ మైనట్టు కనిపిస్తుంది. తాళపత్ర గ్రంథాలను కడిగి ఆ నీటిని తాగిస్తే జబ్బులు నయమవుతాయని, పాపాలు నశిస్తాయన్న విశ్వాసం టిబెట్ జనంలో ఉండేదట. దాంతో వాటిని ముక్కలు చేసి ప్రసాదంలా పంచేవారట. ఇందువల్ల ఎన్ని విలువైన రచనలను కోల్పోయామోననుకుని రాహుల్ బాధపడ్డాడు. లుంబినిలో పురావస్తు తవ్వకాలు జరిపినప్పుడు ఎన్నో విగ్రహాలు, ఇతర చారిత్రక సామగ్రి ధ్వంసమవడం ఆయనకు తీవ్ర మనస్తాపం కలిగించింది. బుద్ధుడు పుట్టిన

లుంబినివనం పరిసరాల్లోనే పెద్ద ఎత్తున జంతుబలులు జరగడం చూసి ఆవేదన చెందాడు. ఆయన నేపాల్‌లో మహాబౌద్ధలో లామా ఆశ్రయంలో ఉన్నప్పుడు లామా సోదరి ఆయనను ప్రేమ కలాపాలలోకి లాగడానికి ప్రయత్నించింది. అక్కడ స్త్రీపురుష శిష్యులు ఒకేచోట నిద్రపోయేవారు, వారి మధ్య స్వేచ్ఛా సంబంధాలు ఏర్పడేవి. ఇవి ఆయనను కలత పెట్టాయి.

మన సమీపకాలపు మహాద్భుతవ్యక్తి అయిన రాహుల్ సాంకృత్యాయన్ బహుముఖీన విద్వత్తును, సువిశాలయాత్రా జీవితాన్ని, గ్రంథ సేకరణ, గ్రంథకర్తృత్వ దోహదాలను ఈ చిన్న వ్యాసంలో సమగ్రంగా వివరించి ఆయనకు సంపూర్ణ న్యాయం చేయడం అసాధ్యమన్న సంగతి ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. సాహిత్యం గురించి కానీ, భారతదేశపు స్థితిగతుల గురించి కానీ, ఇతర అనేక విషయాల గురించి కానీ ఆయన చేసిన వ్యాఖ్యలు ఇప్పటికీ ప్రాసంగికతను చాటుకుంటూ ఆలోచింపజేస్తాయి. కాళిదాసు, భవభూతి వంటి కవులు రాచరిక వ్యవస్థకు కొమ్ము కాసిన మాట నిజమే కానీ ఆ కారణంగా వారి సాహిత్య గుణాన్ని తక్కువ చేయకూడదని ఆయన అంటాడు. “శతాబ్దాలుగా మనదేశవాసులు అనుసరిస్తున్న శాంతియుత జీవనం నిర్జీవమైనదనీ, దీనికంటె అశాంతియుత జీవనమే మేల”ని అభిప్రాయపడతాడు. “భారతదేశం తాను స్వతంత్రంగా సజీవంగా ఉన్న కాలంలో ప్రపంచానికి ఎంతో భిక్షపెట్టింది. దానితోపాటు ఇతరుల నుండి కూడా నిస్సంకోచంగా ఎంతో స్వీకరించింది. గ్రీకులు తమ కళ, జ్యోతిష్యం, తత్వశాస్త్రం ద్వారా మనకు ఎన్నో విషయాలు నేర్పార”న్న ఆయన వ్యాఖ్య, సరిహద్దులకు అతీతమైన ఆయన విశాల చింతనను చాటుతూ ప్రత్యేకించి నేటి మన దేశీయ స్థితిగతుల రీత్యా దారిదీపంగా భాసిస్తుంది.



# 2

# భారతీయ చింతన నుండి ప్రభవించిన తొలి మార్క్సిస్టు రాహుల్

**– డి.వి.వి.ఎస్. వర్మ,** జాతీయ స్ఫూర్తి పత్రిక, తణుకు, 8500678977

రాహుల్ సాంకృత్యాయన్ మీద ఇప్పటికే అనేకానేక రచనలు వచ్చాయి. ఆయన జీవితంలోని వివిధ కోణాలను విశ్లేషించిన వ్యాసాలు, అధ్యయనాలు ఉన్నాయి. అయినా ఆయన జీవన గమనాన్ని తరచి చూసేకొద్దీ మరిన్ని కొత్తకోణాలు ఆవిష్కృతం అవుతూనే వుంటాయి. ఎందుకంటే ఆయన జీవితం అంతటి విశాలమైనది. ఎంతో లోతైనది.

రాహుల్‌జీ చదువు పాఠశాల మధ్యలోనే ఆగిపోయింది. కాని పలు భాషల్ని స్వంతం చేసుకున్నాడు. ఆయన సంస్కృతం, హిందీ, పాళీ, టిబెటన్, భోజ్‌పురి భాషల్లో అత్యధిక రచనలు చేశారు. దాదాపు 30 భాషలు ఆయనకు తెలుసు. ఆయన స్వయంకృషీవలుడు.

రాహుల్‌జీ జీవితంలో చాలా భాగం దేశదేశాల సంచారంతోనే గడిచింది. ఆయన కేవలం దేశదిమ్మరి కాదు. జ్ఞాన సముపార్జనకు నిరంతరం వెతుకులాడిన లోక సంచారి. ఆయన నిత్య సత్యాన్వేషకుడు. సత్యాన్వేషణే ఆయన జీవన గమనానికి దిక్సూచి. అదొక జ్ఞాన శిఖరారోహణ క్రమం.

వైష్ణ సాధువుగా ప్రారంభమైన ప్రయాణం అనేక మలుపులు తిరిగింది. అనేక మజిలీలను దాటింది. స్వేచ్ఛా చింతన, హేతువాద దృష్టి, జనజీవనం పట్ల మమకారం అంతిమంగా ఆయనను మార్క్సిజం మజిలీకి చేర్చింది. ఈ సత్యాన్వేషణ క్రమంలో ఆయన వివిధ మజిలీలను రేఖామాత్రంగా దర్శించడమే ఈ వ్యాసం ఉద్దేశం, అదే దీనికున్న పరిమితి కూడా.

రాహుల్‌జీకి తల్లిదండ్రులు పెట్టిన పేరు కేధార్‌నాథ్ పాండే. పాఠశాలలో చదివింది నాలుగవ తరగతి వరకే. చిన్నతనంలోనే కేదార్‌నాథ్ మీద కొన్ని ప్రభావాలు పడ్డాయి.

మొదటిది ఉర్దూ పాఠశాలలో వుండగా చదివిన కవిత.

**"ఓ నరుడా! ఈ విశాల ప్రపంచాన్ని సందర్శించి రా!**
**లభించదు మరో జీవితం దానికోసం**
**కలకాలం జీవించినా తిరిగిరాదు**
**నవయవ్వన మధుహాసం"**

ఈ కవిత ఆ బాలుని జీవిత లక్ష్యం అయింది. లోక సంచారిని చేసింది. మరొకటి అదే కాలంలో తన గ్రామంలో కలరా వచ్చింది. దుర్గామాతను ప్రసన్నం చేసుకునే క్రతువు జరిగింది. తన మేనమామ సంస్కృత పండితుడు. ఆయనతో ఆ క్రతువును నిర్వహింపజేశారు. ఇది సంస్కృతం మీద మక్కువను కలిగించింది. ఇలా అంకురించిన భాషాభిమానం అంతిమంగా బహుభాషా కోవిదుణ్ణి చేసింది.

మరొకటి తన తాతగారు చెప్పే జానపద కథలూ పౌరాణిక గాథలు మంత్ర, తంత్ర కథలు ఆకర్షించాయి. వైష్ణవ మతాచారాలతోపాటు మూఢ విశ్వాసాలు వంటబట్టాయి. ఇవి జీవితంలో ఒకసారైనా దైవ దర్శనం చేసుకోవాలన్న కోరికకు బలమైన బీజాలు వేశాయి.

కేదార్‌నాథ్ తన 10వ ఏట ఇల్లు విడిచి లోకసంచారం మొదలు పెట్టాడు. కలకత్తాలోని సాధువుల బృందంలో చేరాడు. సంస్కృతం నేర్చుకోవడం మొదలుపెట్టారు. మరోపక్క లోక సంచారం సాగించాడు. 1910లో కాశీకి వెళ్ళాడు. సంస్కృతంతోపాటు ఆయుర్వేదం, జ్యోతిష్యం మీద పుస్తక పఠనం చేశాడు. దేవతల అనుగ్రహం పొందడానికి కష్టతరమైన సిద్ధులను, నామజపాన్ని నేర్చుకున్నాడు.

ఒకసారి దేవతా దర్శనం కోసం 8 రోజులపాటు కఠోర తపస్సు చేశాడు. 9వ రోజు కూడ దేవదర్శనం కాలేదు. దీంతో చాలా నిరుత్సాహ పడ్డాడు. ఆత్మహత్య చేసుకోవాలని ఉమ్మెత్త గింజలు తిన్నాడు. అతికష్టం మీద బతికి బైట పడ్డాడు. ఇలాంటి మూఢ నమ్మకాల మీద నమ్మకం సడలింది. సత్యాన్వేషణకు, హేతు చింతనకు అంకురార్పణ జరిగింది.

ఈ కాలంలోనే పర్సా పీఠాధిపతి కాశీకి వచ్చాడు. తన పీఠానికి వారసుని కోసం ఆయన అన్వేషిస్తున్నాడు. కేదార్‌నాథ్‌ని వారసునిగా ఎంపిక చేసుకుని తనతో పీఠానికి రమ్మని ఆహ్వానించారు. అలా కేదార్‌నాథ్ పర్సా పీఠానికి వెళ్లాడు. అక్కడ మంత్రోపదేశం తీసుకున్నాడు. తిరునామాలు వేయించుకున్నాడు. తన పేరును రామ్ ఉదార్‌దాస్‌గా మార్చుకున్నాడు. వైష్ణవ సన్యాసిగా మారాడు. ఆ మఠంలో భోజనానికి విశ్రాంతికి లోటులేదు. ప్రాచీన సంస్కృత బ్రాహ్మణీయ సాహిత్యాన్ని అధ్యయనం చేసి వాటిపై మంచి పట్టు సంపాదించాడు. స్వేచ్ఛాచింతన, హేతుతత్వం, సత్యాన్వేషణ గల రామ్ ఉదార్‌దాస్‌కి మఠాలలోని డొల్లతనం స్పష్టపడింది. ఇక్కడ బోధించే విలువలు నైతిక సూత్రాలు తరానికి నిలబడేవి కావని అర్థం అయింది. పైగా లోక సంచారికి ఈ మఠం ఒక కూపస్థ మండూకంగా కనిపించింది. తన సత్యాన్వేషణకు ఇది సరిపడదని నిర్ణయించుకుని ఆశ్రమాన్ని వదిలిపెట్టి లోకసంచారం చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. దీంతో వైష్ణవ సన్యాస మజిలీ ముగిసిపోయింది.

తర్వాత అయోధ్యకు చేరిన రామ్‌ఉదార్‌దాస్‌కి ఆర్య సమాజ్ ప్రచారకులతో సంపర్కం కలిగింది. వారి రచనలను చదివారు. ఆర్య సమాజ్‌కు రెండు ముఖాలున్నాయి. ఆర్య సమాజ్ హిందూ సనాతన ధర్మం పరమ పవిత్రమైనదని, స్వచ్ఛమైనదని పాశ్చాత్యుల మత విశ్వాసాలకు, ఇస్లాం మత విశ్వాసాలకంటే ఉన్నతమైనదని, హేతుబద్ధమైనదని భావిస్తారు. సనాతన ధర్మంలో ఇతరేతర కారణాల వల్ల దాని ఆచార వ్యవహారాలలో క్రతువులలో

చోటు చేసుకున్న హేతుబద్ధం కాని విసర్జనీయ అంశాలపై అది విమర్శలు చేస్తుంది. దాన్ని సంస్కరించాలని వాదిస్తుంది. అందువల్ల దానిలో స్వేచ్ఛా చింతన హేతుతత్వం కనిపిస్తుంది. ఆర్య సమాజ్ ఒక పక్క సనాతన ధర్మాన్ని సమర్థిస్తూనే, వితంతు వివాహాలు సమర్థించింది. సంప్రదాయాల పేరుతో సాగే మూఢ విశ్వాసాలను వ్యతిరేకించింది. ఇది కేదార్‌నాథ్‌ని ఆకర్షించింది. ఆర్య సమాజ్ ప్రచారకుడయ్యాడు. ఇస్లాం, క్రైస్తవ మిషనరీలు సాగిస్తున్న మత ప్రచారాన్ని వారి గోదాలోనే తిప్పికొట్టడానికి అరబిక్, పర్షియన్ భాషలు నేర్చుకున్నాడు. సనాతన ధర్మం అనేది ప్రపంచంలోనే అత్యంత హేతుతత్వం గల శాస్త్రీయమైన మతంగా దానిని నెత్తికెత్తుకున్నాడు. అయితే తన లోక సంచారంలో మరో కోణం కనిపించింది. 1919లో ఆయన లాహోర్‌లో వున్నాడు. అక్కడ సాగుతున్న మిలటరీ పాలన రుచి చూశాడు. ఇది రాజకీయాలలో ఆయనకు కలిగిన ప్రత్యక్ష అనుభవం. ఈ సవాలుని ఎదుర్కొనడానికి సంస్కృతంలోని ఆధ్యాత్మిక పరిజ్ఞానం గాని, ఆర్య సమాజ్ సిద్ధాంతాలు ఎందుకూ కొరగానివిగా కనిపించాయి.

జలియన్ వాలాబాగ్ ఉదంతం ఆయనను తీవ్రంగా కలచివేసింది. దాంతో ఆయన స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనాలని భావించాడు. 1921లో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నాడు. 1922లో అరెస్టయి 6 నెలల శిక్ష అనుభవించాడు. 1924లో మరోసారి 2 ఏళ్ళు జైలుపాలయ్యాడు. స్వరాజ్య ఉద్యమాన్ని రైతులు – కూలీల రాజ్యం కోసం సాగుతున్న ఉద్యమంగా భావించాడు. రైతు ఉద్యమంలో పాత్రధారి అయ్యాడు.

ఈ ప్రయాణంలో ప్రాచీన ఆధ్యాత్మిక చింతన, ఆర్యసమాజ్ సిద్ధాంతాల పట్ల నమ్మకం పూర్తిగా సడలిపోయింది. మరోపక్క రైతుల ఉద్యమం వలన ఆయన సత్యాన్వేషణకు తాత్విక చింతనతోపాటు కార్యాచరణ అవసరమన్న మరో కొత్తకోణం వచ్చి చేరింది.

1920లో ఆయనకు బౌద్ధంతో పరిచయం కలిగింది. బౌద్ధంమీద దొరికిన ప్రతి పుస్తకాన్ని చదివాడు. బుద్ధుడు పుట్టిన లుంబినితోపాటు ఆయన సంచరించిన బుద్ధగయ, సారనాథ్, కుశలతో పాటు నలంద, రాజగిరి ప్రాంతాలను సందర్శించాడు.

1926లో జైలు నుండి విడుదలై వచ్చిన తర్వాత 1927లో శ్రీలంకలో విద్యాలంకార పరివేణి సంస్థలో సంస్కృత అధ్యాపకునిగా చేరాడు. సాధు వేషాన్ని వదిలివేశాడు. శ్రీలంకలో ఆయన బౌద్ధ గ్రంథాల అధ్యయనం మీద సమయం కేంద్రీకరించాడు. విశ్వవ్యాపితమైన బౌద్ధం మీద పరిశోధన కోసం దుర్గమమైన దారులలో టిబెట్‌కు వెళ్లాడు. బౌద్ధగ్రంథాల అధ్యయనానికి, వాటి ప్రతుల సేకరణకు ఆయన సాగించిన కృషిని, సాహసకృత్యాలను వివరించడం ఈ వ్యాసం ఉద్దేశ్యం కాదు. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రాచీన బౌద్ధ గ్రంథాలు గర్భంలో కలిసిపోకుండా కాపాడింది ఆయనే, 20వ శతాబ్దంలో తిరిగి బౌద్ధాన్ని మన దేశంలో, ప్రపంచంలో ప్రచారంలోకి తెచ్చింది కూడా ఆయనే.

బౌద్ధంలోని హేతుతత్వం, చలన శీలత, ఆరామాలలో దాని ఆచరణ ఆయనను అమితంగా ఆకర్షించాయి. భారతీయ తాత్విక చింతనలో బౌద్ధం ఒక అత్యున్నత దశగా ఆయన భావించాడు.

1930లో టిబెట్ నుండి తిరిగి రాగానే శ్రీలంకలో ఉపసంపద సంస్కారం చేసుకుని బౌద్ధభిక్షువుగా కాషాయ వస్త్రాన్ని ధరించాడు. తన పేరును రాహుల్ సాంకృత్యాయన్‌గా మార్చుకున్నాడు. ఆ తర్వాత ఆయన తన పేరు మార్చుకోలేదు. బౌద్ధం పట్ల తన అనురక్తిని వదులుకోలేదు. పాట్నా మ్యూజియంకు తన కాషాయి వస్త్రాలను అప్పగించి సాధారణ దుస్తులతో రైతు ఉద్యమానికి నాయకత్వం వహించడం కొనసాగించాడు.

1917లో రష్యన్ విప్లవం తర్వాత కమ్యూనిస్టు భావజాలం ప్రపంచ వ్యాపితంగా విస్తరించింది. రష్యాలో కార్మిక, కర్షక రాజ్యం సాధిస్తున్న విజయాల వార్తలు ప్రచారంలోకి వచ్చాయి. పత్రికలలో వస్తున్న వార్తలు, వ్యాసాలు రాహుల్‌జీని ఆకర్షించాయి. తాను ఆశించిన కార్మికకర్షక రాజ్యం అక్కడ ఏర్పడుతుందన్న భావన కలిగింది. బౌద్ధ ఆచార్యుడుగా ఆయన సోవియట్

రష్యాను రెండుసార్లు సందర్శించారు. 1932లో లండన్‌లో వున్నపుడు మార్క్స్ సమాధికి నివాళులు అర్పించాడు.

భారతదేశంలో కమ్యూనిస్టులతో పరిచయం జరిగిన తీరును బొమ్మారెడ్డిగారు రాసిన పుస్తకంలో చాలా వివరాలు ఇచ్చారు. వృద్ధ కమ్యూనిస్టు మహాదేవసాహెూ కలకత్తాలో రాహుల్‌జీని కలుసుకోవడం, కమ్యూనిస్టు సాహిత్యాన్ని, రహస్య పత్రికలను ఆయనకు అందించడం, కమ్యూనిస్టు నాయకులతో సమావేశం, అప్పుడు కమ్యూనిస్టు పార్టీపై నిషేధం వున్నందున వారు పనిచేస్తున్న కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరవలసిందిగా రాహుల్‌జీని కోరడం, దానికి ఆయన అంగీకరించడం, అంతిమంగా 1939 అక్టోబరులో మాంఘీర్‌లో ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీ బీహారు శాఖలో పార్టీ వ్యవస్థాపక సభ్యుడుగా ఎన్నిక కావడం వరకు అనేక వివరాలను బొమ్మారెడ్డిగారు తన పుస్తకంలో వివరించారు.

భారతదేశంలోని తొలితరం కమ్యూనిస్టులందరూ రష్యన్ విప్లవం ప్రచారంతోనే రూపుదిద్దుకున్నారు. వారికి అందుబాటులో వున్న రచనల ఆధారంగానే మార్క్సిస్టు భావజాలాన్ని అర్థం చేసుకున్నారు. ఆ తర్వాత గతితార్కిక భౌతికవాదం, చారిత్రక భౌతికవాదం ఆధారంగా భారతీయ తాత్విక చింతనను అధ్యయనం చేశారు. భారతీయ తాత్విక చింతన, చరిత్రపై గొప్ప రచనలు కూడా చేశారు.

రాహుల్‌జీ ప్రయాణం దీనికి పూర్తిగా భిన్నమైంది. ఆయన మార్గం భారతీయ తాత్విక చింతన సంస్కృత గ్రంథాలతో, ప్రాచీన సాహిత్యంతో ప్రారంభమై, ఆర్య సమాజ్ సంస్కరణల వైపు సాగి తర్వాత బౌద్ధానికి చేరింది. ఈ ప్రయాణంలో ఆయనకు చారిత్రక భౌతికవాదం, గతితార్కిక వాదాల ప్రమేయం లేదు. ఆయన స్వంతంగా రూపొందించుకున్న ప్రమాణాలే ఆయనను నడిపించాయి. "తన జీవితానుభవం, దాని నుండి నేర్చుకున్న గుణపాఠాలు క్రమక్రమంగా తనను హేతువాదంవైపు, కారణాల అన్వేషణవైపు నడిపించాయని" చెప్పుకున్నాడు.

మార్క్సిస్టు సాహిత్యంతో పరిచయం ఏర్పడిన తర్వాత బౌద్ధాన్ని దానితో తులనాత్మక పరిశీలన చేశాడు. ఈ సత్యాన్వేషణలో బౌద్ధానికి వున్న పరిమితులను, మార్క్సిజం దానిని మరింత సమగ్రం చేసిన క్రమాన్ని ఆవిష్కరించుకున్నాడు. బౌద్ధం గతితార్కికం అన్న వ్యాసంలో దీనిని విశదీకరించాడు.

“పెక్కు రంగాలకు బౌద్ధం మౌలికమైన భావనలను సమకూర్చింది. బౌద్ధ తత్వశాస్త్రంలో పరిచయం వున్నవారికి మార్క్సిస్టు తత్వశాస్త్రం అవగాహన చేసుకోవడం తేలిక” అన్నాడు.

“మార్క్సిస్టు తత్వశాస్త్ర పరిణామంలో హెగెల్ తత్వశాస్త్రం ప్రముఖ పాత్ర వహించిన విషయం మనకు తెలుసు. హెగెలియన్ తత్వశాస్త్రంలోని అసందర్భాలను మార్క్సిస్టు తత్వశాస్త్రం తొలగించిన విషయమూ తెలిసిందే. బౌద్ధం, అత్యున్నత పరాకాష్ట చెందిన రూపంలో హెగెల్ భావసారాన్ని పోలి వుంటుంది” అని రాశాడు. అంటే 20వ శతాబ్దపు హెగెల్ భావజాలం 2 వేల సంవత్సరాల క్రితమే భారతీయ తాత్విక చింతనలో బౌద్ధం రూపంలో చోటు చేసుకుంది. నిజానికి బ్రాహ్మణీయ మతం భారతీయ తాత్విక చింతన నుండి బౌద్ధాన్ని తరిమివేయకుండా, రూపు మాపకుండా వుండి వుంటే ఒక హెగెల్, ఒక మార్క్స్ భారతదేశంలోనే క్రీస్తుశకం ఆరంభంలోనే ఆవిర్భవించి వుండేవారు అనిపిస్తుంది.

ఇలా బౌద్ధాన్ని మరింత సమగ్రం చేసిన మార్క్సిజానికి చేరిన రాహుల్ సాంకృత్యాయన్ భారతీయ చింతనలో ప్రభవించిన తొలి మార్క్సిస్టు, ఏకైక మార్క్సిస్టు.



# 3

# మహాపండిత దేశదిమ్మరి!

**– మందలపర్తి కిషోర్,** జర్నలిస్ట్, హైద్రాబాద్, 8179691822

మనతరానికి తెలిసిన ప్రగతిశీల మేధావుల్లో విశిష్టమయిన వ్యక్తిత్వం ఎవరిదని ఆలోచిస్తే తట్టే మొట్టమొదటి పేరు మహా పండిత రాహుల్ సాంకృత్యాయన్ (1893–1963). భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న ఉద్యమకారుడు, రచయిత, బహుభాషా కోవిదుడు, అనేక దేశాలనూ ప్రదేశాలనూ ప్రత్యక్షంగా పర్యటించిన విస్తృత యాత్రికుడు, మతం – తత్వశాస్త్రం – చరిత్ర – కాల్పనిక సాహిత్యం – యాత్రా సాహిత్యం – సామాజిక శాస్త్ర పరిశోధన – ఆత్మకథ – జీవిత కథలు – జానపద సాహిత్యం – తదితర రంగాల్లో నిష్ణాతుడు రాహుల్జీ. హిందీ, సంస్కృతం, భోజ్‌పురీ, పాలీ, టిబెటన్ భాషల్లో రచనలు చేసిన ఏకైక వ్యక్తి రాహుల్జీయేనంటారు. ఆ భాషలే కాక మగాహీ, ఉర్దూ, పారశీకం, అరబ్బీ, తమిళం, కన్నడం, సింహళం, ఫ్రెంచ్, రష్యన్ భాషలతో సహా మొత్తం మీద 30 కి పైగా భాషల్లో లోతైన పరిజ్ఞానం కలిగినవారు రాహుల్జీ. బౌద్ధం, వైదిక సాహిత్యం, నిఘంటు నిర్మాణం, వ్యాకరణ శాస్త్రం, జానపద సాహిత్యం, వైజ్ఞానిక సాహిత్యం, రాజకీయాల్లాంటి తదితర రంగాల్లో కూడా రాహుల్జీకి అభినివేశం వుంది.

**వైవిధ్య జీవనం:**

బ్రిటీష్ వలసవాదానికి వ్యతిరేకంగా ఉద్యమించినందుకు మూడేళ్ళ కాలం జైల్లో ఉన్న రాహుల్జీ మొదట్లో కాంగ్రెస్‌తోనూ – తర్వాతి రోజుల్లో కమ్యూనిస్ట్ పార్టీతోనూ సన్నిహిత సంబంధాలు కలిగి వున్నారు. మొత్తంమీద ఆయన మూడుసార్లు అరెస్టయ్యారు. తన జైలు జీవిత కాలంలో ఆయనకు కమ్యూనిస్టులతో పరిచయాలు ఏర్పడ్డాయి. సజ్జాద్ జహీర్ (బన్నే భాయ్), పూరణ్ చంద్ జోషీ, కల్పనాదత్, జెడ్. ఏ. అహమద్, శ్రీపద్ అమృత డాంగే,

బాలచంద్ర రణదివే, శ్రీనివాస సర్దేశాయ్, పుచ్చలపల్లి సుందరయ్య, నండూరి ప్రసాదరావు తదితరుల గురించి రాహుల్జీ క్లుప్తంగా – కలం బొమ్మల్లాంటి – పరిచయ చిత్రణ చేశారు. అమెరికన్ ఆఫ్రికన్లను బానిసత్వం నుంచి విముక్తం చేసే రహస్య కృషికి జీవితాన్ని అంకితం చేసిన "హారియెట్ టబ్మన్ – గూఢచారి, ఉద్యమకారిణి" పేరిట రాహుల్జీ రాసిన పుస్తకం చదివితే, అంతర్జాతీయ పరిణామాలను ఆయన ఎంత నిశితంగా పరిశీలించేవారో అర్థమవుతుంది. 30 పైగా భాషలు తెలిసివున్న రాహుల్జీ వేలాది కిలోమీటర్లు పర్యటించారు. 150 వరకూ ప్రచురణలు వెలువరించిన రాహుల్జీ "పార్టీ ఆదేశించిందని పద్యాలు రాసే" బాపతు రచయిత మాత్రం కారు! ప్రత్యక్ష ప్రమాణం గీటురాయిపై నిగ్గు తేల్చుకున్న తర్వాతే ఏ విషయం గురించైనా రాయడం ఆయన తత్వం. అందువల్లనే, ఆయన రచనలకు అంతటి ప్రామాణికత దక్కింది. ఈ ఏప్రిల్లో రాహుల్జీ 128వ జయంతి జరుపుకున్నాం! అయినా, మరువరాని ఆ మహాపండితుణ్ణి స్మరించుకోవడానికి ప్రత్యేకంగా ఓ సందర్భం అవసరమా? కాగా, ఇప్పుడు వెలువడుతున్న ఈ సంస్మరణ సంపుటిలో చాలామంది చాలా విషయాలపై రాస్తారు; ఓల్గా సే గంగా, రుగ్వేద ఆర్యులు, సింహసేనాపతి, దివోదాసు, జయయౌధేయ, మధుర స్వప్నం, విస్మృత యాత్రికుడు లాంటి రచనల గురించి ఎలాగూ చాలామంది చర్చిస్తారు. అవే విషయాలు తిరిగి చెప్పే వుద్దేశం నాకు లేదు. అందుకే, రాహుల్జీ రచనలలోంచి అరుదైన పుస్తకాలు కొన్ని ఎంపిక చేసుకున్నాను. వాటికే పరిమితమవుతాను.

**విస్తృత యాత్రికుడు!**

> **"సైర్ కర్ దునియాకి గాఫిల్ జిందగానీ ఫిర్ కహాఁ?**
> **జిందగీ గర్ కుఛ్ రహీతో నౌజవానీ ఫిర్ కహాఁ??"**

ఈ షేర్ను పద్దెనిమిదో శతాబ్దానికి చెందిన ప్రముఖ ఉర్దూ కవి ఖ్వాజా మీర్ 'దర్ద్' రాశాడంటారు. ఇది రాహుల్జీ అభిమాన కవితగా కూడా ప్రసిద్ధం! అయితే, ఆయన ఈ కవితను ఇస్మాయిల్ మీరఠీ అనే కవి చెప్పాడని రాశారు. ఉర్దూ షేర్లను వేరే భాషలలోనికి అనువదించడం దాదాపు అసాధ్యమని ఆ

భాషతో కనీస పరిచయం వున్న వాళ్ళకు తెలుసు కదా! అయినా నేనో దుస్సాహసం చేశాను – నాకు చేతనయిన రీతిలో ఈ షేర్‌ను అనువదించి మీ ముందుంచుతున్నాను! చూడండి–

**"వివశుడా ఈ లోకమంతా మనసుతీరా తిరగరాదా?**
**మరల జీవన భాగ్యమికపై దొరకడం దుర్లభం కాదా?**
**మాటవరసకు నాల్గు నాడులు బతికినా మరి ఏమి లాభం?**
**కోడెకారది ఎక్కడ? ఆ కౌమరు ప్రాయమ్మెక్కడ?**

**జీవన విధానం:**

చాలామందికి సంచారం కేవలం ఓ హాబీ! కొంతమందికి, అది ఓ జ్ఞాన సముపార్జన మార్గం. చాలా కొద్దిమందికి మాత్రమే సంచారం ఓ జీవన విధానం. రాహుల్జీ ఈ అతికొద్దిమంది కోవలోకి వస్తారు. అందుకేనేమో ఆయన మూడు భాగాలుగా రాసిన తన ఆత్మకథకు సైతం **'నా జీవన యాత్ర'** అనే శీర్షికే ఎంపిక చేసుకున్నారు! ఉత్తరాన హిమాలయ పర్వతాల్లో విహరించినా, లదాఖ్‌లో పర్యటించినా, నేపాల్‌లో తిరిగి వచ్చినా, టిబెట్ వెళ్ళినా, చైనా వెళ్ళినా, రష్యా వెళ్లినా, జపాన్ – కొరియా – ఇరాక్ వెళ్ళినా, దక్షిణాన కడలిదాటి సింహళం వెళ్ళినా, రాహుల్జీ తన జీవన విధానంలో భాగంగానే పర్యటించారు. పన్నెండో శతాబ్దం తర్వాత ముస్లిం సైన్యాల దాడులను తప్పించుకుని బౌద్ధ సన్యాసులు టిబెట్‌కు తరలించిన పాలీ, సంస్కృత రాతప్రతులకు, వర్ణ చిత్రాలకు నకళ్ళు, 22 కంచర గాడిదలపై తీసుకువచ్చారు రాహుల్జీ. వాటిల్లో అత్యధికం విక్రమశిల, నలందా విశ్వ విద్యాలయాల నుంచే విదేశాలకు తరలిపోయాయంటారు. రాహుల్జీ తరలించుకు వచ్చిన పురాపరిజ్ఞాన సంపద అంతా పాట్నాలోని మ్యూజియంలోని – ప్రత్యేక విభాగంలో – భద్రంగా వుంది! అప్పటికే ఆయన బౌద్ధాన్ని మతంగా అనుసరించడం మానేశారన్న వాస్తవం మనసులో పెట్టుకోకపోతే రాహుల్జీ నిర్వహించిన కర్తవ్యంలోని మహత్వం సంపూర్ణంగా అవగతం కాదు!

**అరుదయిన రచనలు:**

ఆర్య సమాజం, ఇస్లాం, క్రైస్తవం, బౌద్ధం, కన్ఫ్యూషియన్ మతం, తావిజం, షింటో, ఖ్యోండోనిజం తదితర మతాలను కూలంకషంగా అధ్యయనం చేసిన మేధావికి ఒక మతం పట్ల మరింత ఎక్కువ అభిమానం వుండే అవకాశం తక్కువ. 'దర్శన్–దిగ్దర్శన్' పేరిట అచ్చులో వెలువడిన రాహుల్జీ ఉపన్యాస సంపుటి ఆయన విస్తృత పరిజ్ఞాన పరిధిని మనకు పరిచయం చేస్తుంది. అటువంటి వ్యక్తి పర్యాటక శాస్త్రం గురించి ఓ పుస్తకం రాస్తే ఎలా వుంటుంది? అద్భుతంగా వుండి తీరుతుంది! అలాగే, అదే వ్యక్తి, తనకు సమకాలికుడయిన, 19–20 శతాబ్దాల మధ్య కాలంలో, ఓ ఆధ్యాత్మిక అన్వేషి హిమాలయ పర్వత సానువుల్లో తిరిగి మూలికావైద్యంలో నిపుణుడై, సంసార జీవితంలో స్థిరపడిన కథ రాహుల్జీ రాస్తే ఎలా వుంటుంది?? పరమాద్భుతంగా వుంటుంది! ఇక, అదే రచయిత నవభారతదేశపు నవనాయకుల జీవిత కథలను క్లుప్తంగా చరిత్రీకరిస్తే ఆ ప్రయత్నం ఎలా వుంటుందో చెప్పాలా? దాదాపు నూరేళ్ళ కిందటే, 1924లోనే, రాహుల్జీ "బాయిస్వీం సదీ" (ఇరవై రెండో శతాబ్దం) అనే సైన్స్ ఫిక్షన్ నవల లాంటిది రాసిన సంగతి హిందీ సాహిత్యంలో గణిష్టమైన పరిచయం వున్న వాళ్ళకు కూడా ఎక్కువమందికి తెలియదేమో! నాకు తెలిసినంతలో, ఇలాంటి అరుదయిన రచనల గురించి రాసినవాళ్ళు తక్కువ! అందుకే వాటిని ఎంపిక చేసుకున్నాను తప్ప, ఇవే, రాహుల్జీ రచనల్లోకెల్లా అత్యుత్తమాలనే భ్రమ నాకెన్నడూ లేదు!

**అథాతో ఘుమక్కడ్ జిజ్ఞాసా...**

'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' అనే వాక్యభాగాన్ని చాలాచోట్ల విని వుంటాం మనం! శారీరకమయిన బంధనాల నుంచి బయటపడే నిమిత్తం బ్రహ్మ గురించి జిజ్ఞాసను పెంచుకోవాలన్నది ఈ భాగవత బోధనకు అర్థం. మనకు దాంతో పెద్దగా పన్లేదు. కానీ దాన్నే అనుకరిస్తూ, రాహుల్జీ 'అథాతో ఘుమక్కడ్ జిజ్ఞాసా' అంటూ ఓ పుస్తకం రాశారు. పర్యాటక జీవనం పట్ల అభిరుచి, అభినివేశం

వున్న వాళ్ళు ఈ పుస్తకాన్ని తప్పకుండా చదవాలి! బ్రహ్మజ్ఞానానికి ఆధ్యాత్మిక పండితులు, విభిన్న మతాల స్థాపకులు ఎంత ప్రాముఖ్యమిచ్చారో, అంతే ప్రాధాన్యం పర్యటనకు ఇస్తూ రాహుల్జీ ఈ పుస్తకం రాశారన్న విషయం మనసులో పెట్టుకుని, ఆ పుస్తకం చదవాలి! వ్యాసుడు బ్రహ్మాణ, జైమినీ ధర్మాన్నీ శ్రేష్ఠమైనవిగా భావించి తమతమ "శాస్త్రాలను" రాసినట్లే, తాను పర్యటనను, అంటే తిరగడాన్ని శ్రేష్ఠమయిన పనిగా భావిస్తానని రాహుల్జీ చెప్పాడు. అసలు మహావీరుడు, బుద్ధుడు, శంకరాచార్య, రామానుజుడు, కొలంబస్, నానక్, వాస్కోడగామా, డార్విన్ అంత గొప్పవాళ్ళు కావడానికి లోకసంచారం చెయ్యడమే కారణమని కూడా రాహుల్జీ రాయడం గమనార్హం. లోకసంచారం అనేది ప్రత్యక్ష ప్రమాణం గ్రహించేందుకు సాధనంగా ఉపయోగపడుతుందని ఆయనన్నారు.

**సంచారం - వెలుగు నీడలు:**

"నా దృష్టిలో ప్రపంచంలో అన్నింటికన్నా ఉత్తమమయిన పని వూరూ-వాడా పర్యటించడమే! సమాజానికి గానీ, వ్యక్తులకు గానీ సంచారాన్ని మించిన హితకరమయిన పని మరొకటి వుంటుందని నేననుకో"నని తేల్చి చెప్పారు రాహుల్జీ. సంచారం పట్ల అంత ఘనమయిన అభిప్రాయం, నిబద్ధత లేనివాళ్ళు ఇలాంటి పుస్తకం రాయలేరు! పుస్తకాల ద్వారా లోక సంచార అనుభవాన్ని పొందగలిగే మాట నిజమే కానీ అది అసమగ్రం అంటారాయన. "మంచు కిరీటాలు ధరించిన హిమాలయాల సౌందర్యం, వాటి రూపురేఖా విలాసం, అక్కడి పరిమళాలు - వాటి ఫోటోలు చూస్తే మనకు అనుభవంలోకి రావు! అలాగే, ఒక సంచారికి దక్కే యథార్థ అనుభవంలో బిందు మాత్రమయినది కూడా యాత్రా చరిత్రల ద్వారా పాఠకుడికి దక్క"దని రాహుల్జీ తేల్చి చెప్పారు. అలాగని, లోక సంచారం పట్ల రాహుల్జీకి విమర్శనాత్మక దృక్కోణం లేదనుకోడానికి వీల్లేదు సుమా! ఒకచోట కాలునిలవని మనుషుల కారణంగానే నెత్తురుటేరులు లోకంలో ప్రవహించినమాట నిజమేనని కూడా

ఆయన చెప్పారు. అయితే, దేశదేశాలకు మనుషులు తిరగకపోతే అచేతనులయిన మానవులకు పశువులకన్నా మెరుగయిన జీవనం దక్కేది కాదని కూడా ఆయన హెచ్చరించారు. ఆధునిక కాలంలో లోకసంచారం ఎంత ప్రయోజనకరమో వేరే చెప్పనవసరం లేదని అంటూ, ఇతరులు రాసిన యాత్రా చరిత్రలను, సొంత పేరుమీద అచ్చు వేసుకునే మహానుభావులెందరో వున్నారని ఓ వ్యాఖ్య జోడించారు రాహుల్జీ. చూడగా, ఇదేదో స్వానుభవం నుంచే చెప్పిన మాట అనిపిస్తుంది! ఆశ్రమాలను నిర్మించుకుని గానుగెద్దుల్లా వాటిల్లో జీవించే స్వామీజీలను రాహుల్జీ ఏకిపారేశారు. భారతదేశంలో “కూపస్థ మండూక”త్వం పెరిగిపోతోందని కూడా ఆయన ఆవేదన ప్రకటించారు. ప్రపంచాన్ని క్రీడాస్థలిగా భావించి యథేచ్ఛగా విహరించాలని సూచించారు.

**సంచారి – సంసారి:**

“ఘుమక్కడ్‌స్వామి” (దిమ్మరి సాధువు) చిన్న పుస్తకం. హిందీలో తప్ప మరే భాషలోనూ దొరకదేమో కూడా! పందొమ్మిదో శతాబ్దం చివర్లో పుట్టి ఇరవయ్యో శతాబ్ది మొదట్లో ఓ ఆధ్యాత్మిక అన్వేషి హిమాలయ పర్వతాల్లో తిరుగాడుతూ మూలికా వైద్యంలో ప్రావీణ్యం సాధించడం కథలో ఒక భాగం కాగా, అతగాడు ఏ సంసార ‘జంజాటం’ వద్దనుకుని ఆధ్యాత్మిక అన్వేషణ మొదలుపెట్టాడో అదే సంసారంలో స్థిరపడ్డం మరో భాగం. ఆయుర్వేదం మందుల తయారీని పెద్ద ఎత్తున మొదలుపెట్టి, కర్మాగారాలూ కంపెనీలూ స్థాపించడం ఇంకో మలుపు. కథకు ఇవన్నీ ఆసక్తిని జోడించే మాట నిజమే కానీ, కథనం ఆత్మకథాత్మకంగా వుందని పాఠకులకు అనిపించడం కూడా నిజమే! ఇలాంటి సాహిత్య చమత్కారాలు చేసే రచయితలందరూ, తమ పాఠకులకు ఆ చమత్కారాలు అర్థం కావాలనే కోరుకుంటారని మనం గుర్తు పెట్టుకోవాలి! కథాకాలంలో, కథ జరిగే స్థలంలో, సంసార జంజాటం పట్ల అభిప్రాయాల విషయంలోనూ, సంసారంలో స్థిరపడే విషయంలోనూ రాహుల్జీకీ కథానాయకుడైన హరిదాస్ స్వామికీ మధ్య పోలికలు కొట్టొచ్చినట్లు కనిపిస్తాయి.

హరిదాస్ స్వామి ద్వారా రాహుల్జీ మనకు హిమాలయ ప్రాంతాల్లోని అనేక ఆశ్రమాలను పరిచయం చేస్తారు; మూలికా వైద్యం గురించిన అరుదయిన సమాచారం కూడా పుష్కలంగా అందిస్తారు. విభిన్న ప్రాంతాల రూపురేఖల గురించీ, అక్కడ పెరిగే చెట్టుచేమల గురించీ, వాతావరణ పరిస్థితుల గురించీ రచయిత, కథానాయకుడి ద్వారా, తెలియజేసే విషయ పరిజ్ఞానం అపారం! దూర ప్రాంతాల్లో ఏకాంతంగా విహరించాలనే కోరిక వున్న పాఠకుల్లో ఆ వాంఛను తిరిగి రెచ్చగొట్టే శక్తి ఈ పుస్తకానికి వుంది!!

**నూతన నేతలు:**

సహాయ నిరాకరణ, రైతు ఉద్యమం, క్విట్ ఇండియా ఉద్యమాల్లో పాల్గొని రాహుల్జీ మూడుసార్లు అరెస్టయ్యారన్న సంగతి తెలిసిందే! జైల్లో ఉన్న సమయాన్ని ఆయనలా సద్వినియోగం చేసుకున్నవాళ్ళు తక్కువనే చెప్పాలి. రెండు దశాబ్దాలలో, పన్నెండేళ్ళపాటు ఒంటికొట్టు జైలుశిక్ష అనుభవించిన ఎస్.ఏ. డాంగే కనీసం చదువుకునేందుకు పుస్తకాలు దొరక్క బాధపడ్డారు. ఆ స్థితిలోనే డాంగే "ఆదిమ కమ్యూనిజం నుంచి బానిస వ్యవస్థ వరకూ భారతదేశం" అనే పుస్తకం రాశారు. రాహుల్జీ దర్శన్ దిగ్దర్శన్ కూడా జైల్లో చేసిన ఉపన్యాసాలేనని గుర్తు. ముఖ్యంగా, తనకు పరిచయమయిన కమ్యూనిస్టు నేతల్ని పాఠకులకు క్లుప్తంగా పరిచయం చేస్తూ రాహుల్జీ రెండు భాగాలుగా రాసిన "నవభారత నవనేతలు" పుస్తకం 650 పేజీలకు విస్తరించి వుండడం విశేషం. ఈ నవనేతల్లో కొందరు, – తర్వాతి కాలంలో – రాహుల్జీని పార్టీ నుండి తొలగించిన విషయమూ చరిత్రకెక్కినదే! "మానవులు తమ చరిత్రను తామే నిర్మించుకుంటా" రన్నాడట కార్ల్‌మార్క్స్. మానవులని అందరినీ కలిపే చెప్పాడు తప్ప, నాయకులే చరిత్ర నిర్మాతలనలేదు మార్క్స్. ఆ చరిత్ర నిర్మాణం ప్రజల ప్రయోజనాలతో మమేకమయిన నాయకుల ద్వారా జరుగుతుంది. నాయకులు ప్రజల ఆకాంక్షలకు ప్రతినిధులు మాత్రమే! ఆ విధంగా ప్రజా చరిత్ర నిర్మాణ క్రమంలో ప్రజా నాయకులకు సాపేక్షిక ప్రాధాన్యం ఎప్పుడూ

ఉంటుంది. రాహుల్జీకి ఈ విషయం స్పష్టంగా తెలుసు. అందుకే భవిష్యత్ నేతల గురించి అంత శ్రమకు ఓర్చారాయన. ప్రజలను ప్రేమించేవారికి ఆ మాత్రం ఆశాభావం వుండితీరాలి. అందుకే, "చారిత్రక భౌతికవాదం సారాంశం చారిత్రక ఆశావాదమే" నన్నాడట ఎంగెల్స్. ఈ పుస్తకంలోని ప్రతి పేజీలోనూ ఆ ఆశావాదం కనిపిస్తుంది.

ముగింపులో ఒక్క ముక్క చెప్పదల్చుకున్నాను. రాహుల్ సాంకృత్యాయన్‌ను మహా పండితుడిగానూ, గొప్ప జ్ఞానిగానూ, విస్తృత యాత్రికుడుగానూ, చరిత్రను మధించి సామాన్య పాఠకులకు దాన్ని ఆసక్తికరంగా మలచిన మహా రచయితగానూ శతాధిక గ్రంథకర్త గానూ చెప్తుంటారు. నా ఉద్దేశంలో రాహుల్ సాంకృత్యాయన్ మహా మానవుడు.

"నరుడు నరుడౌట దుష్కరము సుమ్మ!" అన్నాడట గాలిబ్. నూటికి నూరుపాళ్ళూ అది సత్యం!!



# 4

# ఒకే వ్యక్తి-అనేక జీవితాలు ! రాహుల్ సాంకృత్యాయన్ !!

– గౌరవ్

రాహుల్జీ అనేసరికి ఒక తెలీని ఉద్వేగం, అసాధారణ ఉత్సాహం, అంతులేని ఉత్తేజం. మొత్తంగా ఆయనో నిరంతర ప్రవాహం. ఏ మూస వాదాల్లోనూ ఇమడని స్వేచ్ఛాజీవి. ఎవరి ఆదేశాలకూ తలగ్గొని మేధావి. ఒక్క మాటలో చెప్పాలంటే విశ్వజనీనత కలిగిన సత్యాన్వేషి.

చరిత్రకారులు చాలా మంది ఉండొచ్చుకానీ చలనశీలత కలిగిన భౌతికవాద దృక్పథంతో చరిత్రని మథించినవారు అరుదు. యాత్రికులు ఎందరైనా ఉండొచ్చుకానీ వ్యవస్థ మార్పు కోసం ప్రయాణాన్ని ఒక సాధనంగా చేసుకున్న వారు తక్కువ. పరిశోధనలు ఎందరైనా చేయవచ్చుగాక, కానీ మానవకళ్యాణం కొరకు శోధననే శ్వాసగా చేసుకున్న జ్ఞాన పిపాసులు లేరు. అలా ఎవరైనా ఉన్నారంటే అందులో మొదటి వ్యక్తి రాహుల్జీ.

అలాంటి రాహుల్జీ పట్ల అపోహలెన్నో ఉన్నాయి. అపార్థాలు అన్నే ఉన్నాయి. తండ్రి మీద అలిగి యాభై ఏళ్ళు వచ్చేంతవరకూ మళ్ళీ ఇంట్లో అడుగుపెట్టనని శపథం చేసి ఆయన చనిపోయిన విషయాన్ని కూడా లేఖ ద్వారా తెల్సుకున్న ఈ రాహులేనా టిబెట్ ప్రయాణంలో తనతో ఉన్న కుక్కపిల్ల చనిపోయిందనీ వెక్కి వెక్కి ఏడ్చి దానిపై నివాళిగా 8 సంస్కృత శ్లోకాలు రాసింది..?

పెట్టుబడిదారీ వర్గాల ఏజంటంటూ గాంధీని తీవ్రంగా దుయ్యబట్టి, తిట్టని తిట్టు తిట్టకుండా తిట్టిన ఇతడేనా గాంధీ హత్య నాడు విసిరేసిన సిగరెట్ని మళ్ళీ జీవితాంతం ముట్టకుండా ఉండటమే కాక, గాంధీ నిస్సందేహంగా రెండవ తథాగతుడు..నిజంగా మహాత్ముడే అంటో బుద్ధుడితో పోల్చింది..?

అప్పటిదాకా పట్టనట్లున్న ఈ మనిషేనా అంబేద్కర్ బౌద్ధం స్వీకరించినపుడు దేశంలోని కమ్యూనిస్టులంతా నోర్మూసుకునో, అవాకులు, చెవాకులు పేలుతూనో ఉన్నప్పుడు, వాళ్ళందరి నోళ్ళు మూతపడేలా అంబేద్కర్ బౌద్ధ దీక్షకి మద్దతివ్వడమే కాక "నవదీక్షిత బౌద్ధుల" లనే వ్యాసం రాస్తూ, "ఏడు వందలేళ్ళ తర్వాత భారతదేశంలో బౌద్ధానికి లభించిన ఘన ప్రతిష్ఠలో ప్రముఖపాత్ర నిస్సందేహంగా బాబాసాహెబ్ది. చరిత్ర వారిని ఎప్పుడూ మరువజాలదు." అనగలిగిందీ…?

రష్యాలో కమ్యూనిస్టుగా మారి భారతదేశంలో తిరుగులేనంత సేవ పార్టీకి చేసి, తన భావాల కారణంగా పార్టీ నుండి బహిష్కరించబడిన ఈయనేనా తదనంతరం పదేళ్ళ తర్వాత కూడా అంతులేనంత కీర్తిప్రతిష్టలు ఉండి తీరిక లేనన్ని కార్యక్రమాలలో మునిగుండి కూడా పార్టీ ఆఫీసుకెళ్ళి సామాన్య కార్యకర్తలా దరఖాస్తు చేసుకుని సభ్యత్వం ఇమ్మనమని గద్గద స్వరంతో అడిగింది..?

అవును. ఆయన మానవీయ దృక్పథాన్ని విస్మరించిన శుద్ధ భౌతికవాది కాడు, మానవ సంబంధాలని పట్టించుకోని మూఢ విప్లవకారుడు కాడు. ఆయన ప్రపంచానికి ప్రమాణం మనిషి. ఆయన వివేకానికి మూలం వ్యవస్థ. అందుకే బౌద్ధంలోని వర్ణరాహిత్యాన్నెంతగా ప్రేమించాడో, మార్క్సిజంలోని వర్గ రాహిత్యాన్ని అంతే అభిమానించాడు. మనిషిని చైతన్య పర్చడమే సమాజ మార్పుకి దోహదం చేస్తుందనే నమ్మకమే చివరివరకూ ఆయన్ని నడిపించింది.

కేదార్‌నాథ్ పాండేగా పుట్టాడు. బాబా రామ్ ఉదార్దాస్‌గా మత దోపిడీని దగ్గరగా చూసాడు. కేదార్‌నాథ్ విద్యార్థిగా రచనా వ్యాసంగం మొదలెట్టాడు. రాహుల్ సాంకృత్యాయన్గా, ఎల్లలు లేని విశ్వనరుడిగా ఎదిగి, ఒకే వ్యక్తి – అనేక జీవితాలు గడిపాడు.

దేవుళ్ళకి బలులు వొద్దన్నాడని  సాంప్రదాయవాదులు రాళ్ళేస్తే, ఉర్దూకి దేవనాగరి లిపి ఉండొచ్చన్నాడని సామ్యవాదులనబడే వాళ్ళు ఆయన్ని విమర్శించి పార్టీ నుండి వెళ్ళగొట్టారు. ఎప్పుడైనా, ఎక్కడైనా ఆయన తాను

నమ్మిందే చెప్పాడు, చెప్పిందే చేసాడు. ముప్పైకి పైబడిన భాషల్లో పాండిత్యం, ఐదారు భాషల్లో అసామాన్య ప్రావీణ్యం ఉండి కూడా హిందీ భాషలోనే రచనలు చేసాడు. ఎన్నో దేశాలు పదులసార్లు చుట్టేసినవాడై వుండి, ప్రసంగాల కోసం అమెరికా నుండి ఆహ్వానం వస్తే అవతలకి పొమ్మని నిరాకరించాడు.

బ్రాహ్మణాధిపత్యంతో కుళ్ళి కంపుకొడుతూ కూనరిల్లుతున్న ఆనాటి పండిత సభల్ని తన స్వీయసాధనా ప్రతిభతో విభ్రాంతి చెందేలా చేసి, “మహాపండితు” డయ్యాడు. ప్రాథమిక విద్య కూడా సరిగా చదవని వ్యక్తి ప్రపంచంలోనే రెండు అత్యున్నత విశ్వవిద్యాలయాలైన లెనిన్‌గ్రాడ్ రష్యాలో, శ్రీలంకలో శ్రీవిద్యాలంకార విశ్వవిద్యాలయంలో ఆచార్యుడిగా పాఠాలు చెప్పాడు. ప్రాచీన, ఆధునిక శాస్త్రాలన్నింటినీ మథించాడు.

ఇలా చెప్పుకుంటూ పోతే ఒక్కసారిగా అయ్యేది కాదు. రాహుల్జీ జీవితాన్ని వ్యాసంలోనో, ఉపన్యాసంలోనో ఇమడ్చడమంటే పోటెత్తే సముద్రాన్ని పొట్టి సీసాలో ఎక్కించే పిచ్చి ప్రయత్నం, ఆకాశం మొత్తాన్ని అద్దంలో చూపించే దుస్సహాసం.

టిబెట్, లఢఖ్‌ల నుండి ప్రాణాలకి తెగించి ఆయన తీసుకువచ్చిన అపురూపమైన ప్రాచీన రాతప్రతులు, విలువైన గ్రంథాలు, చిత్రాలకి సంబంధించి పరిశోధన జరగాల్సిన అవసరం ఉంది. పాట్నాలో రాహుల్జీ పేరిట ఉన్న విభాగం, ఆయన జన్మస్థలంలోని లైబ్రరీలు, డార్జిలింగ్‌లోని ఆయన విశ్రమించిన స్థలం అత్యంత నిర్లక్ష్యానికి గురయ్యాయి.

2018 లో రాహుల్ 125వ జయంత్యుత్సవాలు కూడా నామ్ కే వాస్తేగా జరిగాయే కాని జీవంతో జరగలేదు. ఎమ్మెన్ రాయ్ అముద్రిత రచన The Philosophical Consequences of the Modern Science, ఆంటోనియో గ్రాంసీ Prison Notebooksతో పోల్చదగ్గ రాహుల్ జీ జైలు సాహిత్యం (ఓల్గా సే గంగా మొదలుకొని సింహసేనాపతి, జయయౌధేయ, వైజ్ఞానిక్ భౌతికవాద్, దర్శన్ – దిగ్దర్శన్ హజారీబాగ్ జైల్లోనే రాసాడు) ఇంకా అముద్రిత రచనలు, ఆయన ఆరు భాగాలుగా రాసిన ప్రపంచ సాహిత్యంలోనే

అతిపెద్ద ఆత్మకథ "మేరీ జీవన్ యాత్ర" పై కృషి జరగాల్సిన అవసరం ఉంది. ఢిల్లీ లో రాహుల్ సాహిత్య ప్రతిష్టాన్, లక్నోలో రాహుల్ ఫౌండేషన్ కొద్దో గొప్పో చేస్తున్నాయ్ కానీ చెప్పుకోదగ్గ స్థాయిలో కాదు.

ముఖ్యంగా గాంధీ, అంబేద్కర్, రాయ్, పెరియార్, భగత్‌సింగ్, వంటి వారందరి పై చలనచిత్రాలూ, డాక్యుమెంటరీ చిత్రాలు వచ్చాయి. కానీ రాహుల్జీ కృషిని ప్రస్తావిస్తూ ఏవో డి.డి. ఛానల్ చేసినవే కానీ ఈ తరానికి అందుబాటులో ఆధునికంగా జరిగిన యత్నాలు నాకు తెల్సి ఏవీ లేవు. ఇప్పటికైనా తెలుగులో చెట్టుకొకరూ, పుట్టకొకరూగా ఉన్న వామపక్ష, ప్రజాతంత్ర, అభ్యుదయ వాదులు, పార్టీలు, సంఘాలు కనీసం రాహుల్జీ విషయంలో ఒక్క తాటి మీదికొచ్చి ఈ దిశగా ఆలోచిస్తే బావుంటుందని నా భావం.

చివరగా ఎన్ని లోపాలున్నప్పటికీ రాహుల్జీ రచనల్ని తెలుగువారికి అందించిన ఆలూరి భుజంగరావు గారిని ఈ సందర్భంగా స్మరిస్తూ, మారిన వ్యక్తుల పట్ల మన భావాలు కూడా మార్చుకోవడానికి సిద్దపడగలగడం మార్క్సిజంలో ముఖ్యమైన సూత్రం. విప్లవానంతరం శిలాస్థూపం మీది అమరుల పేర్లలో బకునిన్ వంటి అనార్కిస్టులకి కూడా ఎంతో మంది విమర్శించినా లెనిన్ స్థానం కల్పించింది అందుకే.

జీవితంలో గతిశీలతని అన్వయించుకుంటూ ముందుకు సాగిపోవడానికి రాహుల్ జీవితాన్ని మించిన తార్కాణం మరోటి లేదు. ఆ దిశగా ఆయనే ఆహ్వానించినట్లు, యువత ప్రపంచాన్ని చుట్టుముట్టి సామాజిక స్పృహ కలిగిన సంచారులుగా సిద్దం కావడం, మతతత్వ శక్తులు పేట్రేగిపోతున్న ప్రస్తుత పరిస్థితుల్లో అభ్యుదయ లౌకికశక్తులన్నింటి పట్ల ఒక మిత్రపూరితమయిన సహృద్భావ వైఖరిని ఏర్పర్చుకోవడమే ఈరోజు రాహుల్జీకి మనం ఇవ్వదగ్గ నిర్మాణాత్మక నివాళనేది నా అభిప్రాయం, సెలవు.

**(రాహుల్జీ 128వ జయంతి సందర్భంగా)**



# 5

# రాహుల్‌జీ రచనలు నేటి తరానికి దిక్సూచీలు

**– కవిని ఆలూరి,** రచయిత, అనువాదకురాలు, హైద్రాబాద్, 9701605623

మరో మనిషిని సరిగా అర్థం చేసుకోవాలంటే ప్రజల సమస్యలనూ, కష్టసుఖాలనూ తెలుసుకోవాలంటే వివిధ బాషాజ్ఞానం కలగాలంటే, లోక జ్ఞానం పెంపొందాలంటే లోక సంచారం చేయాలంటారు రాహుల్జీ. ఆకాశంలో పక్షులు విహరించినట్టుగా ఆది మానవుడు ప్రపంచమనే బాహ్యాకాశంలో విహరించాడని చెప్తూ జీవ పరిణామ శాస్త్రాన్ని చెప్పిన మహా విజ్ఞాని డార్విన్, కొలంబస్, వాస్కోడిగామా, బుద్ధుడు, మహావీరుడు, క్రీస్తు వీళ్ళందరూ లోకసంచారులే అని అంటారు రాహుల్జీ... అంతే కాకుండా లోకసంచారి కావటానికి కుల, మత, జాతి వర్గ భేదాలు ఉండవు. ఆదర్శం, ఆత్మాభిమానం లోక సంచారి లక్షణాలు అని అంటారు... లోక సంచారమనేది ఒక తత్వ శాస్త్రమని అంటారు రాహుల్జీ.

మనం ఇప్పుడు లోకసంచార తత్వశాస్త్రం గురించి ఎందుకు గుర్తుచేసుకోవలసి వచ్చిందంటే నేటి తరం సమాజ వికాసం క్రమాన్ని అర్థం చేసుకోవాలంటే సంచార తత్వ జ్ఞానాన్ని గురించి తప్పని సరిగా తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అందుకే రాహుల్జీ రాసిన లోకసంచారి పుస్తకంలో ఇలాంటి అనేక విషయాలను చెప్పటం జరిగింది. ఈ క్రమంలో రాహుల్ సాంకృత్యాయన్ తెలుగు వారికి ఎలా పరిచయం అయ్యారో తెలుసుకుందాము.

హిందీ నుంచి తెలుగులోకి మొదటగా అనువదించిన పుస్తకం "ఓల్గా సే గంగా" ఈ పుస్తకాన్ని 1942 లో రాహుల్జీ హిందీలో రాస్తే 1949 లో శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు గారు "ఓల్గా నుంచి గంగాతీరము" అన్న పేరుతో అనువాదం చేశారు. ఆ తరువాత 1986 లో చాగంటి తులసి గారు

"ఓల్గా నుంచి గంగకు" అన్న పేరుతో చేసిన అనువాదాన్ని విశాలాంధ్ర వారు ప్రచురించారు. 1956 జులైలో గద్దె లింగయ్య గారు రాసిన "సింహసేనాపతి" ప్రచురితమైంది. 1965 మార్చిలో ఆలూరి భుజంగరావుగారు అనువాదం చేసిన "విస్మృత యాత్రికుడు" 1965 మేలో "జయయౌధేయ" పుస్తకాలను విశాలాంధ్ర వాళ్ళు ప్రచురించారు. ఇలా తెలుగు సాహిత్యంలో ప్రారంభమైన రాహుల్జీ గ్రంథాల అనువాద సాహిత్య పరంపర ఇప్పటికి 20 పుస్తకాల దాకా ఇంకా అనువాదం అయ్యాయి. ఇంకా ఆ ప్రక్రియ నడుస్తూనే ఉందన్నది గమనార్హం.

రాహుల్ సాంకృత్యాయన్ హిందీలో దాదాపుగా 50 కి పైగా గ్రంథాలను రాశారు. అందులో బౌద్ధ మతానికి సంబంధించినవి పది. తత్వ శాస్త్రానికి సంబంధించినవి మూడు. హిందీ, సంస్కృత, పాళీ సాహిత్య చరిత్రకు సంబంధించినవి అయిదు. సాహిత్య పరిశోధన ఒకటి. టిబెట్–సంస్కృత–హిందీ నిఘంటువులు మూడు. సంస్కృత పథమాల ఒకటి. టిబెట్ పథమాల, బాలశిక్షా, వ్యాకరణం మూడు. ఇవి కాక సంస్కృతంలో పునరుద్ధరణలు పదహారు. పాళీలోకి పునరుద్దరించినవి ఎనిమిది.

సట్లజ్ నది నుండి యమునా తీరం దాకా... దివోదాసు గ్రంథంలో ఆర్యుల గురించి, వారి సంస్కృతి, నమ్మకాలు, అలవాట్ల గురించి తెలుస్తుంది. ఆర్యులు కిరాతకులు 'అబలా సేన' (బలహీనమైన సేన) అని పిలిచేవారు. కిరాతకులు, ఫణుల గురించి చెప్పటం జరిగింది. ఋగ్వేదం ఆధారంగా రచించబడింది. క్రీస్తు పూర్వం 1197. దివోదాసు, శంబరుడి యుద్ధం. ఓల్గా గంగా నదుల మధ్యస్థ జాతులను కథా వస్తువుగా తీసుకొని 7500 సంవత్సరాలు ఆయా జాతులలో కలిగిన పరిణామ వికాసములను 18 కథలలో రాహుల్జీ ఆవిష్కరించారు. ఇందులో ఆయా కాలాలలోని ప్రముఖ వ్యక్తుల చుట్టూ ఉన్న చారిత్రక గాథల ఆధారంతో అప్పటి ప్రజల ఆచారాలు, అభిరుచులు, ఆదర్శాలు మొదలైన విశేషాలెన్నో చిత్రించబడ్డాయి. ఇవన్నీ ఇప్పటి తరానికి చరిత్ర పట్ల అవగాహన కలిగించేవే...

ఋగ్వేద ఆర్యులు, ఈ పుస్తకాన్ని మిక్కిలినేని సుబ్బారావు గారు తెలుగులో అనువదించారు. రుక్కుల ఆధారంగా రాసిన గ్రంథం ఇది. ఈ పుస్తక ఆరంభం మన దేశంలోకి ఆర్యుల రాకతో మొదలవుతుంది. ఆర్యులు రాక పూర్వము భారత దేశంలో ఆర్యుల కంటే ఎంతో ఉన్నతమైన ప్రాచీన సంస్కృతి ఉండేదని మొహంజదారో, హరప్పా నాగరిక జాతులు ద్రావిడులేననీ రాహుల్జీ అంటారు. ఆ కాలంలో వివిధ వృత్తులు ఉండేవని, ఆర్యులకు బట్టలు నేయటం, వైద్యం చేయటం, ఆయుధాలు తయారు చేయటం భారత దేశానికి రాక పూర్వమే వారికి తెలుసని చెప్పారు. ఋగ్వేద ఋషుల గురించి పరిచయం చేశారు. రుక్కుల ఆధారంగా అప్పటి రాజకీయ, సామాజిక, సాంస్కృతిక స్థితులను చెప్పటానికి చేసిన ప్రయత్నమే ఈ గ్రంథం.

రాహుల్జీ హిందీలో రాసిన "ఓల్గా సె గంగా" పుస్తకాన్ని గురించి "మన దేశ భాషలలో ఏ భాషలోనూ ఈ పుస్తకంతో సరిపోయే పుస్తకం లేదు." అని ఒక మహారాష్ట్ర పండితుడు అంటే "చాలా కథలు కథలుగా లేవు. చరిత్ర అన్నంత గొప్పగా ఉన్నాయి" అని అంటూ ఓల్గా సే గంగా పుస్తకాన్ని విప్లవాత్మక పుస్తకంగా అభివర్ణించారు ఆనంద కౌసల్యాయన్. ఐతే ఆ రోజుల్లో స్వామీజీలు ఈ పుస్తకాన్ని నిషేధించాలని అనుకున్నారు. క్రీస్తు పూర్వం 6000 సంవత్సరాల నుండి క్రీస్తు శకం 1200 దాకా ఉన్న చరిత్రను చారిత్రక ప్రమాణాలతో ఈ పుస్తకంలో పొందుపరిచారు. అంతే కాకుండా చివరి కథ 'సుమేరుడు' లో క్రీ.శ. 1941 నాటి స్థితులను చెప్పారు. మొత్తం 20 కథలుగా రాశారు రాహుల్జీ.. మొదటగా అల్లూరి సత్యనారాయణ "ఓల్గా నుంచి గంగాతీరము" అన్న పేరుతో ఈ గ్రంధాన్ని అనువదించారు. తర్వాత చాగంటి తులసి "ఓల్గా నుంచి గంగకు" అన్న పేరుతో అనువదించారు.

జయయౌధేయలో గణ వ్యవస్థను, నాటి సామాజిక స్థితులను అద్భుతంగా చిత్రించారు రాహుల్జీ. విస్మృత యాత్రికుడు పర్యాటక, చారిత్రక నవల. క్రీ.శ 518 నాటి బౌద్ధ భిక్షువు నరేంద్రుడి చరిత్ర ఈ పుస్తకంలో ఉంది. గత కాలపు సమాజాన్ని యదార్థ రూపంలో తత్కాలీన దేశ కాల పాత్రలను, చరిత్రను, భౌగోళిక సత్యాలను నిజాయితీతో చిత్రించటంలో రాహుల్జీ

కృతకృత్యులయ్యారు. మధుర స్వప్నం ఐదవ శతాబ్ది చారిత్రక నవల. ఈ నవలలో విషయం మధ్య ఆసియాలో క్రీస్తు శకం 492–529 మధ్య కాలంలో జరిగింది. క్రైస్తవ చరిత్రకారులు, ఫారసీ గ్రంథాలు, ముస్లిం చరిత్రకారులు రాసిన అరబ్బీ–ఫారసీ గ్రంథాలు ఆధారాలుగా ఈ నవల సాగింది.

గద్దె లింగయ్య గారు అనువదించిన సింహసేనాపతి బుద్ధుడి కాలానికి సంబంధించినది. ఇది క్రీ.పూ. అయిదో శతాబ్దానికి సంబంధించినది. ఈ పుస్తకంలో రాహుల్జీ పాళీ, టిబెట్, సంస్కృత సాహిత్యాలలో ముఖ్యంగా జైన్ సాహిత్యంలో ఆ కాలానికి సంబంధించిన వివరాలు తీసుకున్నారు. బౌద్ధ దర్శనం అనే పుస్తకాన్ని ఏర్పేడు ఆశ్రమం మళయాళ స్వామి మొదటగా అనువదించారు. తర్వాత ధర్మకీర్తి అనే పేరుతో తెలుగు భాషీయుడు అనువదించారు. ఆ తర్వాత బొర్రా గోవర్ధన్ గారు అనువాదం చేశారు. ప్రొ. లక్ష్మీ రెడ్డి గారు 'మహామానవ బుద్ధ' అన్న గ్రంథాన్ని అనువదించారు. అంబేద్కర్ బౌద్ధ మతాన్ని స్వీకరించటాన్ని సమర్థిస్తూ రాహుల్జీ రాసిన గ్రంథాన్ని "నవ దీక్షిత బౌద్ధులు" అని మలయశ్రీ అనువదించారు. తెలుగులో అనువదించిన 18 పుస్తకాలలో ఎనిమిది పుస్తకాలు సుప్రసిద్ధ అనువాదకులు ఆలూరి భుజంగరావు గారు అనువదించినవే. జయౌధేయ, విస్మృత యాత్రికుడు, లోక సంచారి, దివోదాసు, మధుర స్వప్నం, భారతీయ దర్శనం, ప్రాక్పశ్చిమ దర్శనాలు, వైజ్ఞానిక భౌతికవాదం ఈ ఎనిమిది పుస్తకాలు భుజంగరావు గారు అనువదించారు.

రాహుల్జీ అత్యధికముగా సాహిత్యాన్ని తన పది సంవత్సరాల జైలు జీవితంలోనే రాశారు. వాస్తవానికి సైన్స్, సమాజ శాస్త్రము, దర్శనాలకు సంబంధించిన విషయాలను ఒకే గ్రంథంగా పాఠకులకు ఇవ్వాలనుకున్నారు కానీ రాసే క్రమములో ఏ విషయానికి ఆ విషయాన్ని వేరు వేరుగా రాయటమే సరైనది అనుకున్నారు. విశ్వాకీ రూప్ రేఖా సైన్స్‌కు సంబంధించినది. మానవ సమాజ్ సమాజ శాస్త్రానికి సంబంధించినది. దర్శన్–దిగ్దర్శన్, వైజ్ఞానిక భౌతికవాదం (గతి తార్కిక భౌతికవాదం) తత్వశాస్త్రానికి సంబంధించినది.

ఇలా నాలుగు గ్రంథాలుగా రాశారు. అయితే మిగతా గ్రంథాలతో పోలిస్తే దర్శన్–దిగ్దర్శన్, వైజ్ఞానిక భౌతికవాద్ పుస్తకాలకు కొంత ప్రత్యేకత ఉంది. రాహుల్జీ దేవలీ జైలులో ఉన్నప్పుడు జైలులో ఉన్న తోటి కామ్రేడ్స్ కు తత్వశాస్త్రం పట్ల అవగాహన కలిగించటానికి ఒక నెల రోజులు మధ్యాహ్నం పూట క్లాసులు తీసుకునే వారు. ఆ క్లాసులలో చెప్పిన అంశాలనే దర్శన్–దిగ్దర్శన్ గ్రంథంలో రాశారు. ప్రపంచ తాత్త్విక జ్ఞానాన్ని ఈ పుస్తకాలలో పాఠకులకు అందించారు. రాహుల్జీ రాసిన దర్శన్–దిగ్దర్శన్ పుస్తకం 1000 పేజీలది. ఆలూరి భుజంగరావు గారు ఈ పుస్తకాన్ని పాఠకుల సౌలభ్యం కోసం భారతీయ దర్శనం, ప్రాక్పశ్చిమ దర్శనాలు అనే రెండు భాగాలుగా విభజించి ప్రచురించారు.

వేదాలలో దార్శనిక భావాల నుండీ మొదలు పెట్టి ఉపనిషత్ దార్శనికులతో పాటు స్వతంత్ర దార్శనికులైన నాగార్జునుడి శూన్యవాదం, చార్వాకుడి భౌతికవాద దర్శనం, అలాగే గౌతమ బుద్ధుని క్షణిక, అనాత్మా వాదం, కణాదుడి పరమాణువాదం, జైన దర్శనం, పతంజలి యోగాదర్శనం, ధర్మకీర్తి దర్శనం, ఇలా దార్శనికులదే కాకుండా ఆనాటి సామాజిక స్థితి గతులను చెప్తూ భారతీయ దర్శన చరమ వికాసమైన తాత్విక జ్ఞానాన్ని పాఠకులకు అందించారు రాహుల్జీ.

ప్రాచీన సింధూ నాగరికతా కాలానికి భారతదేశంలో వేదాంతం లేదు. క్రీస్తు పూర్వం 600 నుండే దార్శనిక చింతన మొదలైందని చెప్పవచ్చు. క్రీ.పూ. 1500 నుండి 1000 వరకు వేదాలను రచించారు. వాటిల్లో దార్శనిక చింతన తాలూకు ఛాయలు కనపడతాయి. భగవంతుడు లేడు. ఆత్మ లేదు. పునర్జన్మ లేదు. జీవిత భోగాలను వదులుకోవలసిన పని లేదు. సత్యాన్వేషణలకు అనుభవాన్ని, బుద్ధిని మార్గ దర్శనం చేసుకోవాలంటారు చార్వాకులు. అన్నీ క్షణికమైనవి. ఆత్మవాదం అసత్యమైనది. చెడు పనులు చేయకుండా ఉండటం, మంచి పనులు చేయటం, చిత్త వృత్తులను అదుపులో ఉంచుకోవటం, ఇదే బుద్ధుడి ఉపదేశాల సారం. బుద్ధుడు పొందిన జ్ఞానమే బౌద్ధ దర్శనం అయ్యింది. వేద గ్రంథాలను ప్రామాణికంగా భావించటం, సృష్టికర్త ఒకడు ఉన్నాడను

కోవటం, జాతి వాదాన్ని పాటించటం, ఉపవాసాల ద్వారా, ఇతర విధాలా శరీరాన్ని బాధపెట్టుకోవటం ఇవన్నీ బుద్ధి హీనులు, మూర్ఖులు చేసే పనులుగా బౌద్ధ దార్శినికుడైన ధర్మకీర్తి భావించాడు. సమాజంలోని అన్ని రకాల అసమానతలను, దోపిడీలను, అత్యాచారాలను అనంతంగా ఉంచటానికి శంకరాచార్యుని మాయావాదం దోహద పడుతుంది అంటారు. జీవిని మీద, ముక్తి మీద, ముక్తి ఫలితం మీద నమ్మకం లేని శంకరాచార్యుడిని ప్రచ్ఛన్న బౌద్ధుడంటారు. శంకరాచార్యుని దార్శనికతతో భారతీయ దర్శనం పుస్తకం ముగుస్తుంది.

ప్రాక్పశ్చిమ దర్శనాలలో సోక్రటీస్ యదార్థవాదం, ప్లేటో కాల్పనిక వాదం, అరిస్టాటిల్ వస్తువాదం, ఎపిక్యురియన్ల భౌతికవాదం, యవన దార్శనికులు, ఇస్లాం దార్శనికులు, క్రైస్తవ దర్శనం, యూరప్ దర్శనాలు, న్యూటన్, బార్కెలే, హ్యూమ్, మార్క్స్ గతితార్కిక భౌతికవాదం దాకా పాఠకుల ముందు ఉంచారు రాహుల్జీ. వైజ్ఞానిక భౌతిక వాదాన్ని సైన్స్ లేదా ప్రయోగశాస్త్రం అనవచ్చు. ప్రయోగాన్ని మార్గదర్శకంగా పెట్టుకొని ముందుకు సాగుతుంది కనుకనే సైన్స్ అధినాయకత్వాన్ని గతి తార్కిక భౌతికవాదం శిరసావహిస్తుంది. వైజ్ఞానిక భౌతికవాదం పుస్తకంలో కార్యకారణ నియమం నుండి మొదలుకొని ప్రతిషేధ ప్రతిషేధం వరకు అనేక అంశాలను చర్చించారు. ఇతర తాత్విక చింతనాలకు గతితార్కిక భౌతికవాదానికీ ఉన్న తేడాను విపులీకరించారు రాహుల్జీ. తర్కించుకుంటేనే తత్వం బోధపడుతుంది అన్నట్టుగా కొనసాగుతుంది ఈ పుస్తకం. ఐతే వైజ్ఞానిక భౌతికవాద్ పుస్తకాన్ని నాన్నగారు (ఆలూరి భుజంగరావు) 60 పేజీలు అనువాదం చేస్తే నాన్నగారి సలహాలు తీసుకుంటూ మిగతా 120 పేజీలను నేను తెలుగులోకి అనువదించాను.

రాహుల్ జీ హిందీలో రాసిన "బహురంగీ మధుపురి" పుస్తకాన్ని నేను "మధుపురి" అన్న పేరుతో తెలుగులోకి అనువదించాను. బ్రిటిష్ వారు తమ విలాసాల కోసం తమ సైనికుల విలాసాల కోసం హిమాలయ పర్వతాలలోని చల్లని, పచ్చని ప్రదేశాలను ఎంపిక చేసేవారు. ఆ ప్రాంతాలలో వెనుకబడిన జాతుల జీవనాలను ధ్వంసం చేసేవారు. విలాస ప్రియులు అక్కడి స్త్రీల

జీవితాలను నరక ప్రాయం చేసేవారు. తెల్ల దొరలు వెళ్ళి నల్ల దొరలు వచ్చినా అక్కడి పరిస్థితులలో ఎటువంటి మార్పు రాలేదు సరికదా ఇంకా దైన్యంగా మారింది. ఈ విషయాలన్నింటినీ రాహుల్జీ ఈ పుస్తకంలోని 21 కథలలో పొందుపరిచారు.

రాహుల్జీ రచనలు ఇప్పటి తరానికి ఆదర్శాలు. అంతే కాకుండా, చారిత్రక నవలలు ఎలా రాయాలో నేటి రచయితలకు తెలియచెప్పే మార్గదర్శకాలు. నేటి తరం చరిత్రను తెలుసుకోవాలంటే రాహుల్జీ రచనలు తప్పక చదవాలి. అవగాహన తెచ్చుకోవాలి. ఆ గ్రంథాలన్నీ దిక్సూచీలుగా దిశా నిర్దేశం చేస్తాయి.



# 6

# బి.ఆర్. అంబేడ్కర్ - రాహుల్ సాంకృత్యాయన్ ఇరు వ్యక్తిత్వాల దార్శనికత

- గౌరవ్



**(ఏప్రిల్ 14న డా॥ బి.ఆర్. అంబేడ్కర్ జయంతి, మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్ వర్ధంతి సందర్భంగా కోరుకొండ, 'సహవాసి స్వాభిమాన్ వేదిక' వారి సభకి నా ప్రసంగ పాఠం)**

మిత్రులారా,

ఈ రోజు దేశం ప్రమాదకర పరిస్థితుల్ని ఎదుర్కుంటోంది. కులం, మతం, వర్గం, ప్రాంతం, పార్టీ, లింగ వివక్ష పెట్రేగిపోతుంది. ఆధునిక భావజాల ప్రభావంతో ఆవిర్భవించిన రాజ్యాంగాన్ని కాదని ఫాసిజం బుసలు కొడుతోంది. మహారాష్ట్ర స్థానిక ఎన్నికల్లో శివసేన ఆధిక్యత కనపర్చడం, యు.పి. ఎన్నికలు బిజెపికి పట్టం కట్టడం ప్రజాస్వామ్యం ప్రమాదంలో ఉందనడానికి స్పష్టమయిన సంకేతాలు.

యాదృచ్ఛికంగా లాల్-నీల్ ఐక్యత అంటే, కమ్యూనిస్టు సోషలిస్టు ప్రగతిశీల శక్తులు - దళిత బహుజన మైనారిటీల మధ్య ఏకత కోసం చర్చ జరుగుతోంది. ఈ సందర్భంలో ఇరు భావజాలాల్ని తమ వ్యక్తిత్వంతో అనితర సాధ్యంగా ప్రభావితం చేసిన యిద్దరు యోధుల్ని గురించి తలుచుకొని, వారి కృషిని ప్రస్తావించుకోవడం ఉద్యమాలకి ఉపయోగకరమనే ధోరణే నా యీ ప్రసంగానికి ప్రేరణ.

మొదటి వ్యక్తి బి.ఆర్. అంబేద్కర్, రెండోవ్యక్తి రాహుల్ సాంకృత్యాయన్. ఈ దేశంలోని అట్టడుగు వర్గాల ప్రజల కోసం జీవితాంతం రాజీ లేకుండా పోరాడిన ఈ ఇరువురి జీవితాల నుండి ఈనాటి ఉద్యమకారులు నేర్చుకోవాల్సిన విషయాలు చాలా ఉన్నాయనేది నా అభిప్రాయం. అంబేద్కర్ ఒక తరహా సోషలిస్టయితే, రాహుల్ మరో తరహా కమ్యూనిస్టు.

అంబేద్కర్ జీవితం చిన్నప్పట్నుంచీ వివక్షమయం. ఆ కసే ఆయన్ని విజ్ఞానగనిగా చేసింది. రాహుల్‌జీ బాల్యం విభిన్న అనుభవాలకి ఆలవాలం. ఆ క్రమమే ఆయన్ని మహోన్నత మేధోజీవిగా మల్చింది. తన జాతిని విద్యకూ, అవకాశాలకూ దూరం చేసినందుగ్గానూ ప్రపంచంలోనే అత్యుత్తమ విద్యావంతుడిగా కష్టపడి చదివినవాడు అంబేద్కర్.

సమాజంలోని అసమానతల గురించిన బండారాల్ని అహోరాత్రులు అన్వేషిస్తూ వైష్ణవ సన్యాసిగా మొదలుకుని దేశదిమ్మరిగా అనేక అవతారాలెత్తుతూ, లెక్కలేనన్ని వొత్తిడుల్ని ఎదుర్కొంటూ బీదరికాన్ని అంతమొందించడం కోసం స్వీయ అధ్యయనంతో సాటిలేని సత్యాన్వేషిగా మారిన అరుదయిన బుద్ధిజీవి రాహుల్‌జీ.

ఈ దేశపు కుల సమస్యని ఇద్దరూ చాలా లోతుగా అధ్యయనం చేసారు. కులానికి సంబంధించీ యిద్దరూ దాదాపు ఒకే రకమయిన అవగాహన కలిగి ఉన్నారు. కులాన్ని నిర్మూలించాలంటే సమాజంలో అత్యధిక శాతం జనాల మెదళ్ళని నిర్దేశిస్తున్న శాస్త్రాల అధికారాన్ని అంతమొందించాలనేది అంబేద్కర్ భావం. రాహుల్‌జీ కూడా దాదాపు అదే అభిప్రాయంతో ఉన్నారు.

అందుకోసం ఇద్దరూ ప్రపంచ సాహిత్యం మొదలుకుని పురాణేతిహాసాల దాకా పడిపడీ చదివారు. ప్రాచీన వ్యవస్థని తమదైన రీతిలో పరిశోధించారు. ఆర్యద్రావిడులకి సంబంధించిన సైద్ధాంతిక చర్చను యిరువురూ ఆసక్తికరంగా చేసారు. అంబేడ్కర్ కులనిర్మూలనను ప్రతిపాదిస్తే, రాహుల్‌జీ ఈ సమాజ దుష్టత్వం అంతం కాక తప్పదని ఆకాంక్షించారు.

ఇద్దరిదీ సునిశితమయిన హేతువాద దృక్పథం. అందుకే మతాన్ని భౌతికవాద దృష్టితో పరిశీలించిన గుణం ఇద్దరి రచనల్లోనూ కనిపిస్తుంది. ప్రాచీన భౌతికవాద దార్శనిక రీతులు మొదలుకుని ఆధునిక తాత్విక వేదికల వరకూ అన్నింటినీ ఔపోశన పట్టి భవిష్యత్తును అంచనా వేయగల అరుదైన ప్రజ్ఞ యిద్దరికీ ఉంది.

బహుశా అందుకే ఇద్దరూ బౌద్ధులయ్యారు. బౌద్ధ సారస్వతాన్ని యిద్దరూ ఎంతలా అధ్యయనం చేసారంటే ఆధునిక భారతావనిలో బౌద్ధాన్ని ఆచరణాత్మకంగా పునరుజ్జీవింపజేసిన ఇరుసులుగా ఈ ఇద్దర్నీ పేర్కొనడం తప్పుకాదనుకుంటాను. బౌద్ధాన్ని ఒక ఆధ్యాత్మిక మతంగా కాక విముక్తి పథంగా భావించారు. కనుకనే మానవీయ దృక్పథంగా బౌద్ధాన్ని యిరువురూ ప్రతిపాదించారు.

మార్క్సిజాన్ని ఇద్దరూ లోతుగా అధ్యయనం చేసి అర్థం చేసుకున్నారు. రాహుల్‌జీ చివరిదాకా కమ్యూనిస్టు దృక్కోణంతోనే రచనలు చేస్తే, అంబేడ్కర్ మార్క్స్‌ను, బుద్ధుడ్ని సోదాహరణంగా పోలుస్తూ గ్రంథమే రచించారు. సామ్యవాద భూమికతోనే యిద్దరూ సమాజాన్ని మార్చడానికి అవిశ్రాంతంగా కృషి చేసారు.

ఇద్దరికీ వివిధ స్వదేశీ – విదేశీ భాషల్లో పరిజ్ఞానముంది. సంస్కృతం నేర్చుకోవాలనే అంబేడ్కర్ కోరిక వివక్ష కారణంగా నెరవేరక ఆంగ్ల గ్రంథాలపై ఆధారపడాల్సి వచ్చిందిగానీ ఆ లోటును పరోక్షంగా పూరించి సంస్కృతపాళీ భాషలు మొదలుకుని అనేక భాషల్ని అవలీలగా అభ్యసిస్తూ మతగ్రంథాల బండారాల్ని బయటపెట్టినవాడిగా రాహుల్‌జీని చెప్పుకోవచ్చు.

ఇద్దరికీ విజ్ఞానాన్వేషణంటే విసుగులేని పిచ్చి. అంబేద్కర్ ఎక్కడికెళ్ళినా పెట్టెల్నిండా పుస్తకాలు ఇంటికి మోసుకొస్తూ ఉండేవాడు. కొలంబియా యూనివర్శిటీ, లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్‌ల్లో చదివేటప్పట్నుంచీ వొచ్చినప్పుడల్లా వందలాది పుస్తకాల్ని మోసుకొచ్చి గ్రంథాలయంలో ఉంచుకుని చదవడం అంబేద్కర్ అలవాటు.

ఇక రాహుల్‌జీ సంగతి సరేసరి. ఉన్న గ్రంథాలు, విదేశీ సాహిత్యం కాకుండా అపూర్వమయిన బౌద్ధ సాహిత్యాన్ని అధ్యయనం చేసి టిబెట్, శ్రీలంక, నేపాల్ నుండీ గాడిదల మీద పుస్తకాల సంచుల్ని వేసి సరిహద్దులు దాటించి వాట్ని తీసుకొచ్చినవాడు. ఒకరికొకరు తీసిపోని సత్యాన్వేషకులే ఇద్దరూ.

ఇద్దరూ విపరీతమయిన అధ్యయనాపరులు, ఆలోచనాపరులు, ఉద్యమకారులు, రచయితలు. విదేశాల్లో ఉన్నత విద్యనార్జించి ఇక్కడి విద్యార్థులకు బోధించడానికి అంబేద్కర్ సిద్ధపడితే, ఈ దేశంలో సంచారిగా తిరుగుతూ అనన్యసామాన్యమయిన జ్ఞానాన్ని సముపార్జించి లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంలో బోధించడానికి వెళ్ళినవాడు రాహుల్‌జి.

చదవడం, తిరగడంలోనే కాదు, రాతలోనూ యిద్దరూ యిద్దరే. ఇద్దరూ అగణితమయిన సాహిత్యకృషి చేసారు. అద్భుతమయిన అద్వితీయమయిన రచనలెన్నింటినో సమాజానికి అందించారు. ముఖ్యంగా శాస్త్రీయ ఆలోచనా సరళితో ప్రాచీన సమాజం, బౌద్ధం గురించిన వీరి రచనలు మహత్తరమైనవి, ఎప్పటికీ నిల్చి ఉండేవి.

ఉద్యమ సారథులుగా కూడా ఇద్దరిదీ అందెవేసిన చెయ్యి. శ్రామిక, కార్మిక కర్షకులకి సంబంధించీ అంబేద్కర్ ముందుండి కృషి చేస్తే, రైతుకూలీ ఉద్యమాలకి సారథ్యం వహించి కారాగారానికి వెళ్ళినవాడు రాహుల్‌జీ. పడ్డ కష్టానికి సరిపడ ఫలం కార్మికులు పొందడం లేదనే బాధ ఇద్దరిలోనూ స్పష్టంగా గోచరిస్తుంది.

వ్యక్తిపూజను ఇద్దరూ నిరసించారు. ఆర్థిక స్థిరత్వాన్ని యిద్దరూ పట్టించుకోనట్లే తోస్తుంది. ఇరువురూ కూడా కాస్త మధ్య వయసులో ద్వితీయ

వివాహం చేసుకున్నవారే. కుటుంబ కర్తవ్యాలకంటే సామాజిక హితాన్నే మొట్టమొదట బాధ్యతగా నెత్తినెత్తుకుని ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కొంటూ కూడా చివరికంటూ నడిచినవారే.

అంబేద్కర్ బౌద్ధం స్వీకరించినప్పుడు దేశంలోని కమ్యూనిస్టులంతా వ్యతిరేకించారు. అప్పుడాయన్ని కల్సి తన మద్దతు ప్రకటించడమే కాక "నవదీక్షిత బౌద్ధులు" అనే వ్యాసాన్ని రచించినవాడు రాహుల్ సాంకృత్యాయన్. ఆధునిక భారతావనిలో నవబౌద్ధానికి ఈ ఇరువురూ రథ చక్రాలనడం అతిశయోక్తి కాబోదనే నా భావం.

ప్రగతిశీల లౌకికోద్యమాల్ని చీల్చే కుట్ర గతంలోకంటే నేడు ఎక్కువగా జరుగుతోంది. సంఘాలు, పార్టీలు, సిద్ధాంతాల ముసుగులో ఈ దేశపు అట్టడుగు వర్గాల ప్రజల్ని మోసం చేయడం జరుగుతూనే ఉంది. దోపిడీకి గురౌతున్న వారి చేత్తో వారి కంట్లోనే పొడిపించడం భారద్దేశ దోపిడీ వర్గాల ప్రత్యేక లక్షణం. ఇక్కడి సామ్రాజ్యవాదం పేరు బ్రాహ్మణిజం.

అణగారిన ప్రజలకోసం పనిచేయడానికి ముందుకొచ్చిన మిత్రులంతా సహోద్యమకారులుగా ఏకమవ్వాల్సిన సమయమొచ్చిందని గుర్తించడం అవశరం. దేశవ్యాప్తంగా దళిత, బహుజన, ఆదివాసీ, ముస్లిం, మహిళలపై జరుగుతోన్న అమానవీయమయిన దాడుల్ని భౌతికంగానే కాక బౌద్ధికంగా కూడా ఎదుర్కోడానికి అంబేద్కర్ – రాహుల్‌జీల అధ్యయనం తప్పనిసరి.

కొద్దిపాటి వైరుధ్యాలు, సైద్ధాంతిక విబేధాలు ఎన్నున్నప్పటికీ చారిత్రకంగా ఎంతో గొప్ప పాత్ర పోషించిన ఇద్దరు యోధుల్ని ఈ తరానికి పరిచయం చేయాలనే తపనే తప్ప ఎవరినీ కించపరచాలనో, ఎవరి కృషీ తక్కువ చేసి చూపాలనో నా అభిప్రాయం కాదు. లాల్–నీల్ ఐక్యతపై ఆరోగ్యకరమైన సంవాదానికి ఈ ప్రసంగం పనికిరావాలని ఆశిస్తూ ఇంతటితో ముగిస్తున్నాను.

**లాల్–నీల్ ఐక్యత వర్ధిల్లాలి.**

**(సాఫల్య జీవులు పుస్తకం నుండి తీసుకోబడింది)**



# 7

# మానవేంద్రనాథ్ రాయ్ నుండి మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్ వరకూ...!

– గౌరవ్





కొందరు మనుషులు  జీవించడం నేర్పడం కోసమే జీవించారా అన్న భావన కలిగిస్తారు. జీవితం యొక్క  విస్తృతిని విపరీతంగా సద్వినియోగం చేసుకుంటారు. వారిని గురించి తెలుసుకుంటే, "అబ్బా! ఇది కదా జీవితం!!" అని అనుకోకుండా ఉండలేం. భావితరాల పై అలాంటి అద్వితీయ ప్రభావాన్ని కలిగించిన ఇద్దరు యోధుల్ని  స్మరించుకుందాం.

మొదటి వ్యక్తి మానవేంద్రనాథ రాయ్, రెండో వ్యక్తి మహాపండిత్ రాహుల్ సాంక ృత్యాయన్. భారతీయ సాంస్కృతిక వికాసోద్యమ చరిత్రలో మహా తాత్వికులైన ఇద్దరు దార్శనిక వ్యక్తుల్ని గురించి అంచనా వేయడం అంత సులువేం కాదు. కానీ, ప్రవాహశీలతను అణువణువునా జీర్ణించుకున్న రాయ్, రాహుల్జీల జీవితం, కృషిలకి సంబంధించి తులనాత్మక మదింపు వేయడం ఒక చారిత్రక అవసరం.

మధ్యతరగతి సనాతన కుటుంబాల్లో జన్మించిన ఇరువురూ బాల్యంలోనే సాంప్రదాయిక ఆచారాల్ని చాలా దగ్గరగా చూసారు. రాయ్ బెంగాల్‌లోని కుగ్రామంలో జన్మిస్తే, రాహుల్ ఉత్తర భారతంలోని ఒక మారుమూల గ్రామంలో జన్మించాడు. ఇద్దరూ తీవ్ర జాతీయవాదులు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న వారు.

రాయ్ చిన్నతనంలోనే ఆయుధాల కోసం దేశం దాటి తీవ్రవాదిగా మొదలై సోషలిస్టుగా , తిరుగులేని కమ్యూనిస్టు నాయకునిగా ఎదిగి కాంగ్రెస్‌లో చేరి రాడికల్ డెమోక్రటిక్ పార్టీ స్థాపించి చివరగా రాడికల్ హ్యూమనిస్ట్ ఉద్యమానికి దిశానిర్దేశం చేసి నవ్యమానవవాది గా విభిన్నమైన తాత్వికునిగా ఎదిగాడు.

రాహుల్జీ వైష్ణవ సన్యాసిగా మొదలై ఆర్య సమాజంలో చేరి దేశ దిమ్మరిగా మారి కాంగ్రెస్ పార్టీ నాయకుడిగా, రైతు ఉద్యమ నేతగా సోషలిస్టుగా, బౌద్ధుడిగా, కమ్యూనిస్టు నాయకుడిగా, వైజ్ఞానిక చరిత్రకారుడిగా, క్రియాశీల తాత్వికునిగా ఎదిగాడు.

అకాడమిక్ డిగ్రీలు లేని ఇద్దరూ తిరుగులేని బహుభాషా కోవిదులు. విదేశీభాషల్లో సైతం అంతే పాండిత్యం కలవారు. ప్రపంచంలోని అత్యంత విశిష్టమైన విశ్వవిద్యాలయాల్లో ఇరువురూ ప్రముఖ పాత్ర పోషించారు. మార్క్సిజం మొదలుకుని బౌద్ధం వరకూ విపరీతంగా అధ్యయనం చేసారు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే, భారతీయ బహుళత్వానికి బౌద్ధం అందించిన హేతుబద్ధమైన వారసత్వం పట్ల రాయ్‌కి, రాహుల్‌కీ కూడా ఉన్న దృక్పథం ఒక్కటేనని వారిరువురి రచనలు చదివితే తెలుస్తుంది.

రచనా వ్యాసంగాన్ని సైతం ఇద్దరూ విస్తృతంగా ఉపయోగించారు. అనేక శైలులలో ప్రక్రియల్లో సామాన్యులకి అర్థమయ్యేలా, వారికి అనుగుణంగా రచనలు చేసారు. అంతిమంగా మానవాళి సంక్షేమానికి సైన్సు, హేతువాదాలే శరణ్యం అనే దగ్గర ఇరువురికీ ఏకాభిప్రాయం ఉంది.

వ్యక్తిగత వివాహ జీవితంలో ఉన్న పోలికల్ని కూడా పక్కనపెడితే స్వాతంత్ర్య ఉద్యమంలో భాగంగా కాంగ్రెస్ పార్టీని ఒక దశలో సమర్ధించినా,

గాంధీజీ విధానాలని తీవ్రంగా వ్యతిరేకించారు. కాంగ్రెస్ సోషలిస్టు విధానాల పట్ల కూడా ఇద్దరికీ అవగాహన ఉంది. ఇక కమ్యూనిస్టు రాజకీయాల సంగతి తెలిసిందే. రాయ్, రాహుల్ ఇద్దరూ కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని కిందనుండి గ్రహించిన వారే.

భారతీయ కమ్యునిస్ట్ పార్టీ స్థాపకుడిగా, రష్యాలోనే కాక ప్రపంచంలోనే వామపక్ష ప్రత్యామ్నాయ రాజకీయ నాయకునిగా రాయ్ చారిత్రక పాత్ర పోషించగా, ప్రపంచంలోనే అరుదైన మార్క్సిస్టు బౌద్ధ ఆచార్యుడిగా, ఎల్లలు లేని విశ్వనరుడిగా రాహుల్జీ అద్వితీయ వ్యక్తిగా ఎదిగారు.

రాహుల్జీ టిబెట్ మొదలుకొని వివిధ దేశాల నుండి బౌద్ధ సారస్వత సంపదని వెలికితీసి తీసుకురాగా, రాయ్ ఏకంగా భారతీయ సాంస్కృతిక వికాసోద్యమ కేంద్రాన్ని స్థాపించి భావితరాలకు సాంస్కృతిక దిశానిర్దేశం అందించగల ఒక ఉన్నతమైన గొప్ప సంస్థగా దానిని మలచాలని తలిచాడు.

అలా భారతీయ దార్శనిక తాత్విక సాంస్కృతిక వికాసోద్యమ వారసత్వాన్ని నిర్మాణాత్మకంగా కొనసాగించడానికి రాయ్, రాహుల్జీలు ఇద్దరూ చేసిన అద్భుతమైన కృషి అసాధారణమైనది.

దౌర్భాగ్యకరమయిన విషయం ఏమిటంటే రాయ్ కలలు కన్న ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్ ఆశయాలూ, రాహుల్జీ ఆశించిన సాంస్కృతిక శోధనా కార్యరంగ ఆకాంక్షలూ రెండూ ఈ రోజు మరుగునపడ్డాయి. కనీసం వాటి గురించి పట్టించుకోవడం మాటటుంచీ తలిచే పరిస్థితి కూడా లేని గడ్డు స్థితి నెలకొంది.

విస్తృత యాత్రికులుగా, శక్తివంతమైన తాత్వికులుగా, ప్రగతిశీల రచయితలుగా, బౌద్ధాభిమానులుగా, సోషలిస్టు యోధులుగా, సాంస్కృతిక కార్యకర్తలుగా, విశ్వనరులులైన మహామానవులుగా రాయ్, రాహుల్‌ల కృషిని ఈనాటి పరిస్థితుల్లో తులనాత్మకంగా అంచనా వేయడం ముఖ్యమనే ఉద్దేశమే ఈ వ్యాసానికి మూలం. ఈ అంశం మీద ఔత్సాహికులైన మిత్రులు మరింత పరిశోధన చేస్తే సంతోషం.



# 8

# లోకమే అతని వాకిలి!

**– పున్నా కృష్ణమూర్తి,** సీనియర్ జర్నలిస్టు, హైద్రాబాద్, 7680950863

మాచర్లలో లక్ష్మిందేవి మిద్దెలను ఆనుకుని పాత లైబ్రరీ ఉండేది. 'మేకలా, దొరికిన పుస్తకాన్నల్లా నమలండి' అన్న బీ.వీ. మాస్టారు సూక్తిని ఒకరిద్దరం యథాశక్తిగా పాటించే వాళ్లం. చెలియలికట్ట, మోబిడిక్, మహాప్రస్థానం, ఓల్గాసే గంగా! 'నయము–భయము–విస్మయం' కలుగజేసిన పుస్తకం ఓల్గాసే గంగా. అన్ని సాంప్రదాయ విశ్వాసాలను తొలచివేస్తూ కీ.పూ. ఆరువేల సంవత్సరాల నుంచీ 'క్విట్ ఇండియా' వరకూ మానవ కథా వికాసాన్ని కళ్లముందుంచిన మరపురాని కథాగుచ్ఛం. లక్షలాది యువకులు దాదాపు అన్ని భారతీయ భాషల్లో అదే సమయంలో, నా తదుపరి తరం రాహుల్ సాంకృత్యాయన్ సాహిత్యాన్ని చదివి ఉంటారు. చదువుతూ ఉంటారు. అయితే, మా ఊరి లక్ష్మిందేవి మిద్దెలకూ నాకూ సంబంధం ఉన్నట్లుగానే రాహుల్ సాంకృత్యాయన్‌కూ సంబంధం ఉంది.

1926లో నాగార్జున కొండ శిల్పాలు ప్రభుత్వం దృష్టికి వచ్చాయి. ముందుగా ఫ్రెంచ్‌వారు, ఆ తరువాత ఇంగ్లీష్‌వారు ఆ శిల్పాలను తరలించుకుపోయారు. ఈ నేపథ్యంలో లక్ష్మిందేవి మిద్దెల్లో ఒక సమావేశం జరిగింది. మల్లంపల్లి సోమశేఖరశర్మ, కోలవెన్ను రామకోటేశ్వరరావు, గుర్రం మల్లయ్య తదితరులు గ్రామస్తులను సమీకరించి ఈ తరలింపును అడ్డుకున్నారు. ఈ వార్తల ఫలితంగా నాగార్జున కొండకు వచ్చారు రాహుల్ సాంకృత్యాయన్. ఆ సందర్భంగా తెలుగు–బంజారా సమ్మిళితమైన స్థానిక గిరిజనులలో ఒకరిగా కలసిపోయారట. ఆశ్చర్యచకితులైన సంజీవదేవ్, ఏ భాషనైనా కొద్ది క్షణాలు గమనించి మాట్లాడగల భాషా సముద్రుడు రాహుల్ అన్నారు. అపర నాగార్జునుడిగా కొనియాడబడిన రాహుల్ సాంకృత్యాయన్ నాగార్జునకొండ శిల్పంలో ఉన్నారు! భారతదేశంలో ఇప్పటివరకూ వెలుగులోకి వచ్చిన శిల్పాల్లో

నాగార్జున కొండ 'లేఖకుడి' శిల్పం పురాతనమైనది. క్రీ.శ. 1–2 శతాబ్దాల నాటి ఆ శిల్పంలో శుద్ధోదనుడు మాయాదేవి స్వప్న వృత్తాంతం జ్యోతిష్యులకు వివరిస్తుంటాడు. ఆ చారిత్రక వార్తను శ్రద్ధగా రిపోర్టు చేస్తుంటాడు ఒక వ్యక్తి. ఆ వ్యక్తి రాహుల్ సాంకృత్యాయనే అని నా విశ్వాసం! కాక, 'ఇంకె'వరు?

'చరైవేతి చరైవైతి' అంటూ రెండు కాళ్లను ఒక్కచోట నిలుపకుండా నాలుగు దశాబ్దాలు నేలను కొలిచినవారెవ్వరు? ప్రాథమిక విద్యను కూడా పూర్తి చేయని ఉత్తర ప్రదేశ్‌లోని ఒక కుగ్రామంలో పుట్టిన బాలుడు, జ్ఞానాన్ని అన్వేషిస్తూ, పొందుతూ, పంచుతూ, సమన్వయం చేసుకుంటూ నిత్యచలనశీలిగా జీవించారు. తొమ్మిదేళ్ల పిల్లవాడిగా కరువును అనుభవించినవాడు, పొగాకు కొట్లల్లో మగ్గినవాడు, కాశీ చేరి హిందూమతంలోని అన్ని శాఖలను రుచి చూసినవాడు, ఆర్య సమాజీకుడు, బౌద్ధ భిక్కు, కమ్యూనిస్టు, బహిష్కృత కమ్యూనిస్టు, నిత్యచలనశీలి ఎలా అయ్యాడు? సమాజం వల్ల ప్రభావితులైన వారు ప్రతి తరంలోను కోట్లాదిమంది ఉంటారు. సమాజాన్ని ప్రభావితం చేసిన రాహుల్ ఎలా రూపొందాడు?

అలహాబాద్ విశ్వవిద్యాలయంలో 16 వేల పదాల ఇంగ్లిష్ – హిందీ నిఘంటువును అవిశ్రాంతంగా రూపొందిస్తున్న క్రమంలో ఒక పండితుడు 'ఇంత వేగం పనికిరాదు. సమగ్రంగా ఉండాలి' అన్నాడు. దానికి రాహుల్ సమాధానం 'బుద్ధుడు ఏదీ శాశ్వతం కాదన్నాడు. మార్పే శాశ్వతమన్నాడు. లెనిన్ కూడా 'ఏదీ అంతిమం కాద'న్నాడు. నేను సత్యాధికారిని కాదు. ఇది నా వంతు. తరువాతి తరాలు మరింత మెరుగుపరుస్తారు' అన్నాడు. బహుశ రాహుల్ సాంకృత్యాయన్‌ను తయారు చేసింది ఆయనలోని ఈ అలీనతే! ఆయనకు భారతరత్న రాకపోవడం వలన నష్టం లేదు. అముద్రిత సాహిత్యం మాత్రం మన ప్రయోజకత్వాన్ని ప్రశ్నిస్తూనే ఉంటుంది.

సంస్కృతంలో డైరీ రాసుకున్న సాంకృత్యాయన్ హిందీలో యాత్రా సాహిత్య పితామహుడు. భోజ్‌పురీ కథలను రాసినవాడు. విక్రమశిల, నలంద విశ్వవిద్యాలయాల నుంచి 12వ శతాబ్దంలో దండయాత్రల సందర్భంగా

టిబెట్‌కు చేరి పాలి, సంస్కృత భాషల్లోని బౌద్ధ గ్రంథాలను 22 కంచర గాడిదల బండ్లలో ఇండియాకు తెచ్చాడు. లెనిన్‌గ్రాడ్ యూనివర్శిటీలో భాషాచార్యుడిగా సేవలందించిన రాహుల్ సాంకృత్యాయన్ ఆరోగ్య సమస్యతో యు.ఎస్. ఎస్.ఆర్. వెళ్లి 'విస్మృత' స్మృతితో తిరిగి వచ్చారు. ఆ 'లోక సంచారి'ని ఎవరు మరువగలరు! 'సైర్ కర్ దునియా' (లోకాన్ని చుట్టు) అనే కవితా పాదం రాహుల్‌ని ప్రభావితం చేసింది. హిమాలయ సానువుల్లో డెహ్రాడూన్‌లో విశ్రాంతి తీసుకుంటున్నాడు రాహుల్. ప్రతి యాత్రికుడినీ ప్రభావితం చేస్తూ, అవిశ్రాంతంగా!

**(సాక్షి పత్రిక సౌజన్యంతో)**



# 9

# తెలుగు సాహిత్యంలో సాంకృత్యాయన్!

**– గౌరవ్**

రాహుల్జీ తెలుగు నేలపై అడుగిడి 110 సంవత్సరాలు. ఈ విషయంలో చిన్న గందరగోళం ఉంది. రాహుల్జీ ఆత్మకథ "మేరీ జీవన్ యాత్రా" ప్రకారం ఆయన 1913 లో దక్షిణదేశానికి మొదటిసారి వచ్చినట్లు రాసుకున్నారు. సైదాపేట నుండి తిరుపతికి కాలినడకన సాగిన ఆ ప్రయాణం, మొట్టమొదటి సారిగా ఆ మహామానవుడి పాదం తెలుగు నేలను తాకి తాదాత్మ్యం చెందిన క్షణం. తిరుపతి నుండి ఆయన తిరుమశి వెళ్ళి అక్కడ సంస్కృత కళాశాలలో కొద్ది రోజుల పాటు ఉన్నారు. ఐతే, బండ్లపల్లె ఓబులరెడ్డి 1963లో జయంతి పబ్లికేషన్స్, విజయవాడ వారు ప్రచురించగా, 2011 లో విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు ముద్రించిన "మహోన్నత మానవుడు రాహుల్ సాంకృత్యాయన్" గ్రంథంలో రచయిత పొరపాటో, ముద్రాపకుల పొరపాటో తెలియదు కానీ రాహుల్జీ దక్షిణదేశ యాత్ర కీ.శ. 1923లో చేసినట్లు ఉంది. అదే నిజమైతే రాహుల్జీ తెలుగు నేలమీద అడుగిడి సరిగ్గా శతాబ్దం కావొస్తోంది. కానీ, స్వయంగా రాహుల్జీ రాతలే మనకి ప్రమాణం కాన ఏది ఏమైనప్పటికీ నిత్య సత్యాన్వేషకుడయిన ఆ అద్వితీయ మహామానవుడు దక్షిణ దేశానికి విచ్చేసిన సందర్భం, తెలుగులో యాత్రా సాహిత్యకారులు శతవార్షికోత్సవం చేయాల్సిన శుభ సమయం. దురదృష్టవశాత్తు మహాకవులు, మహా రచయితల జీవితం – కృషికి సంబంధించీ అర్థవంతమైన సంవాదాలు, సమాలోచనల కంటే కూడా నిరర్ధకమయిన ఉత్సవాలు, ఊరేగింపులకే సమయం వెచ్చించే మూక తీర్థాలే ఈ రోజు నడుస్తున్నాయి.

రాహుల్జీ సాహిత్యం హిందీలో ఎంత ఉన్నదో అంత కాకపోయినా చాలా మట్టుకు తెలుగులో ఉన్నది. ఇతరేతర భాషలతో పోల్చుకుంటే బెంగాలీ లోనూ, తెలుగులోనూ రాహుల్జీ అనేక రచనలు తర్జుమా అయ్యాయి. ప్రపంచ వ్యాప్తంగా అనేక ప్రాంతాలలో ఉన్నట్లే తెలుగులో కూడా రాహుల్జీకి అనేకమంది

మిత్రులు ఉన్నారు. 1944లో బెజవాడలో జరిగిన అఖిల భారత రైతు మహాసభలకి ఆయన ముఖ్య అతిథిగా విచ్చేసిన విషయం మరువరాదు. ఆసక్తికరమైన విషయం ఏమిటంటే ఆ మహాసభల్లో దేశవ్యాప్తంగా అనేక రాష్ట్రాల నుండి వచ్చిన కళాకారులు వివిధ సాంస్క ృతిక కార్యక్రమాలు ప్రదర్శించారు. సహజంగానే బెంగాలీ కళా బృందం మొదట నిలుస్తుందనీ అంతా భావించారు. అయితే, అందరి ఊహల్నీ తలకిందులు చేస్తూ ఆంధ్రా కళాకారులు వారి సాంస్కృతిక చైతన్యాన్ని అత్యద్భుతంగా ప్రదర్శించారనీ, బెంగాల్ నాయకులు ముజఫర్ అహమద్, గోపాల్ హాల్దర్ మాట్లాడుతూ, "ఆంధ్రా కళాకారులు ప్రజల వద్దకు వెళ్ళి వారి కళల్ని ప్రదర్శించే బదులు, ప్రజల నుండే కళకి అవసరమైన సారాన్ని గ్రహిస్తారు, మనం బెంగాల్ లో ముందుగానే ఏర్పర్చుకున్న మధ్యతరగతి అభిప్రాయాలను బుర్రల్లో ఉంచుకుని ప్రజల వద్దకు వెళతాం..." అని బహిరంగంగా అంగీకరించారంటూ రాహుల్జీ తన ఆత్మకథలో రికార్డు చేసారనీ, ఫిబ్రవరి 20, 2019 న మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ జీవితం– కృషికి సంబంధించి 'ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, ప్రొఫెసర్ కొత్తా సచ్చిదానంద మూర్తి సెంటర్ ఫర్ స్టడీస్ ఇన్ ఆఫ్రో ఆసియన్ ఫిలాసఫీస్ (గుంటూరు)లో జరిగిన వర్క్ షాప్ అధ్యక్ష ఉపన్యాసంలో పావ్లోవ్ ఇనిస్టిట్యూట్ (కోల్‌కతా) ఆచార్యుడు రామకృష్ణ భట్టాచార్య పేర్కొన్నారు. తెలుగులో సాంస్కృతిక వికాసోద్యమ చరిత్రకు సంబంధించీ రాహుల్జీ వంటి అనితరసాధ్యమైన వ్యక్తి నమోదు చేసిన ఈ విషయం స్తబ్దత రాజ్యమేలుతున్న ప్రస్తుత కాలంలో ఎంత విలువైనదో గుర్తించాల్సిన శ్రేణులు గుర్తిస్తే బాగుంటుంది.

తెలుగులో రాహుల్జీని అధ్యయనం చేసిన వారికీ, ఆయన ప్రభావంతో రచనలు చేసిన వారికీ కొదవలేదు. అనేకమంది వారి పిల్లలకు రాహుల్జీ పేరు పెట్టుకునేంతగా ఆయన్ని ప్రేమించారు, అభిమానించారు. అనేక సంస్థలు రాహుల్జీ పై రకరకాల కార్యక్రమాలు చేసాయి. ఆలూరి భుజంగరావు గారు గుడివాడలోనే కాక షాహాబాద్, కర్నాటక లో కూడా భార్య లలితా పరమేశ్వరి వ్యవస్థాపకురాలిగా రాహుల్ సాహిత్య సదనం స్థాపించి ఎన్నో ప్రచురణలు తీసుకువచ్చారు.

"నూతన ప్రజాస్వామిక విప్లవ విజయం కోసం ప్రాణాలను ధారపోస్తున్న ప్రతి ఒక్క విప్లవకారుడూ – నా జీవితానికి ఆదర్శ మార్గదర్శకుడే!" అని తన ఆత్మకథ 'గమనాగమనం' మొదటి పేజీలోనే ప్రకటించిన ఆయన, కడుపు కోసం కష్టపడుతూనే రాహుల్జీ రాసిన అనేక విలువయిన గ్రంథాల్ని తెలుగులోకి తర్జుమా చేశారు. 150 రూపాయలు బాకీ కట్టడం కోసం వేరే దారి లేక రాహుల్జీ 'జయ ఔథేయ' తెలుగు చేసిన ఆయన, "మార్చి నెల చివరి రోజులు. విద్యార్థులకు పరీక్షలు. పేపర్లు దిద్దాలి. స్కూలు పని రోజల్లా సరిపోయేది. ఇటు నూతనంగా వివాహమాడి తెచ్చుకున్న భార్య. క్షణం తీరిక దమ్మిడీ ఆదాయం లేని ఈ జీవితాన్ని చూసి లలిత ఏమనుకుంటుందోనని బాధ! రాత్రంతా కిరసనాయిలు బుడ్డి ముందు పెట్టుకుని అనువాదం చేస్తుండేవాడ్ని. ఇంకొంచెం కాంతిని ఇవ్వగల లాంతరైనా లేదు. తెలియని శబ్దాలకు అర్థాలు చూసుకోవడానికి శబ్దకోసమైనా లేదు. రాత్రంతా రాయడం వల్ల తెల్లవారేసరికి చేతి నరాలు పోట్లు పెట్టడం మొదలయ్యేది. లలిత మనసులో ఏమనుకునేదో – చేతికి కొబ్బరి నూనె రాసి ఉపశమనాన్ని మాత్రం కలిగించేది. అలా ఓ నెల రోజుల్లో 'జయఔథేయ' అనువాదాన్ని పూర్తి చేసాను. పేగులు తెంచుకున్నంత పనయింది దాన్ని పూర్తి చేసేసరికి!..." అంటూ వాపోతారు.

అందుకే, బాబాసాహెబ్ అంబేద్కర్ బౌద్ధ ధర్మదీక్షను సమర్థిస్తూ రాహుల్జీ రాసిన అరుదైన వ్యాసం 'నవదీక్షిత బౌద్ధులు'ని ప్రజాసాహితి సంపాదకులు కె. రవిబాబుగారి సహకారంతో సంపాదించి, డా.మలయశ్రీ తెలుగు అనువాదంలో మిళింద ప్రచురణల తరపున సరిగ్గా 20 ఏళ్ళ క్రితం 2002లో సంపాదకత్వం వహించి తీసుకువచ్చిన టి. రవిచంద్ గారు ఆ పుస్తకానికి రాసిన విశ్లేషణాత్మక మున్నుడికి ఇచ్చిన రిఫరెన్స్ నోట్సులో ఆలూరి భుజంగరావు గారి కృషిని గురించి పేర్కొంటూ, "ఆయన (ఆలూరి) తెలుగు బాగాలేదని ఆత్రేయ లాంటి పండిత కవులు విమర్శించినా, హిందీ భాష తెలియని రాహుల్ సాంకృత్యాయన్ సాహిత్య అభిమానులకు ఆయన అనువాదాలు వరప్రసాదాలే!" అంటారు. ఈ సందర్భంగా గాంధీజీ మరణానంతరం ఆయన పై రాహుల్జీ రాసిన అరుదైన వ్యాసం, "ఇద్దరు మహావ్యక్తులు – బుద్ధుడు – గాంధీ" . డా.

జె. ఎల్. రెడ్డి అనువాదంలో 2005 లో మిసిమి పత్రికలో వచ్చిన ఈ వ్యాసాన్ని కూడా ఆంగ్ల మూలంతో కలిపి 2017 లో మిళింద ప్రచురణగా చిన్న బుక్ లెట్ రూపంలో రవిచంద్ తీసుకొచ్చారు. రాహుల్జీ మేధో పరిణామాన్ని (Intellectual Evolution) తెలియజేసే ఈ వ్యాసాన్ని, రాహుల్జీ రచనల్లో ఒక చారిత్రక పత్రం (Historical Document)గా పరిగణించాలంటారు రవిచంద్. రాహుల్జీ రాసిన రెండు అరుదైన వ్యాసాలని ఆ విధంగా తెలుగు సాహిత్యానికి, అంతకుమించి సాంస్కృతికోద్యమ చరిత్రకి మిళింద ప్రచురణల ద్వారా అందిన తీరు ప్రసంశనీయం.

ఇకపోతే, యాత్రా సాహిత్యం గురించి కృషి చేస్తున్న వాళ్ళలో కూడా రాహుల్జీ స్ఫూర్తితో ఆయన యాత్రల గురించి రచనలు చేసిన ఆదినారాయణ వంటి వారు ఉన్నారు. హిందీ, ఆంగ్లాలలో అయితే ఈ సంఖ్య ఇంకా ఎక్కువ. ఒక్క యాత్రా సాహిత్యం మాత్రమే కాదు, మొత్తం రాహుల్జీ జీవితం గురించి కూడా అడపాదడపా అధ్యయనాలు జరుగుతున్నాయి. ప్రభాకర్ మాచ్వే నుండి అలకా ఆత్రేయ చుడాల్ వరకూ ఎందరో రాహుల్జీ జీవితం, కృషికి సంబంధించి విలువైన గ్రంథాలు వెలువరించారు. తెలుగులో కూడా వామపక్ష ప్రగతిశీల సంస్థలు, దాదాపుగా అన్నీ ఆయన గురించి ప్రచురించాయి. ముఖ్యంగా, ప్రాచీన భారతీయ సంస్కృతికి సంబంధించి రాహుల్జీ కృషిని అర్థం చేసుకోవడం ఈనాటికి కూడా చాలా అవసరం అనే నా అభిప్రాయం. 1994, సెప్టెంబరు కమ్యూనిజం పత్రికలో "సాహిత్య – స్వాతంత్ర్య సమరాంగణంలో సవ్యసాచి – మహాపండితుడు రాహుల్ సాంకృత్యాయన్" అంటో డా. మాడభూషి భావనాచార్యులు వ్యాసం రాసారు. 2011 లో సంఘమిత్ర ప్రచురణల తరపున వచ్చిన ఆయన వ్యాసావళి, "ప్రాచీన భారతదేశ చరిత్ర, సంస్కృతి, తాత్విక చింతన"లో ఆ వ్యాసం ఉంది. రాహుల్జీ రాసిన చిన్న పొత్తాన్ని 1986లోనే యతిరాజులు అనువాదంగా "ఈ సమాజ దుష్టత్వం పతనం కాక తప్పదు' పేరిట ప్రజాశక్తి బుక్ హౌస్ ప్రచురించింది. ఇందులోనే చివర్లో వి. ఆర్. బొమ్మారెడ్డి రాసిన రాహుల్జీ జీవిత విశేషాలు అనుబంధంగా ఉన్నాయి. అసలు

తెలుగులో మొదటి సారిగా ఎప్పుడు రాహుల్జీ గురించిన రచన వచ్చిందనేది ఆసక్తి కలిగించే విషయం. తెలుగు పరిశోధన ఆ దిశగా జరిగితే బాగుంటుంది.

ఇక స్వీయచరిత్ర, ఆత్మకథల విషయానికి వస్తే ఎందరో ప్రముఖులు రాహుల్జీతో వారి అనుబంధం ప్రస్తావించి ఉన్నారు. ఎన్నో సరదా సంగతులు కూడా చెప్పిన వారు ఉన్నారు.

కళా తపస్వి సంజీవ్ దేవ్ అలాంటి ఎన్నో విషయాలు రాసారు. ఒకసారి పుట్టపర్తి నారాయణాచార్యులు గారి ఇంటి దగ్గర రాహుల్జీతో కలిసి భోజనం చేస్తుండగా, “అన్ని ప్రాంతాల భోజనాలలోకి ఏ ప్రాంతపు భోజనం బాగుంటుందని అడిగితే, ‘మాంసం కనుక ఉంటే ఏ ప్రాంతపు భోజనమైనా బాగానే ఉంటుంద’ని అన్నారట. ఇలాంటి విషయాల్ని సంజీవ్ దేవ్ ఆత్మకథ ‘తుమ్మపూడి’ లో చూడొచ్చు. తిరుమల రామచంద్ర గారి స్వీయచరిత్ర “హంపీ నుంచి హరప్పా దాక” లో కూడా రాహుల్జీ ప్రస్తావన వస్తుంది. ఇంకో ఆసక్తికరమైన విషయం ఏమిటంటే, డెయిలీ టెలిగ్రాఫ్ పత్రిక ఇంటర్వ్యూలో “నా ముఖ్యమైన అర్హత ఆకలి” అంటూ వెళ్ళి చేరిన రామచంద్ర గారికి మొదటి అసైన్మెంట్, ఆ రోజు జరిగిన సమావేశంలో రాహుల్జీ ప్రసంగాన్ని రికార్డు చేయడం. పొట్ట చేత పట్టుకుని పాత్రికేయుడి అవతారం ఎత్తిన ఆయన మాటల్లోనే, “ఆ దినం సాయంకాలం రాహుల్ సాంకృత్యాయన్ ప్రసంగించే సభ ఒకటి ఉంది. ‘రామచంద్రా మీకు హిందీ బాగా వచ్చు గనుక రాహుల్జీ ప్రసంగం కవర్ చేయండి’ అన్నారు. అది ఆంగ్లంలో నా మొదటి కవరేజ్. చాలా జాగ్రత్తగా రాసాను. రాహుల్జీ భావాలు స్పష్టంగా, వివరంగా ఇచ్చాను. ఆయన సోవియట్ యుద్ధం మీద, తక్కిన వాటిమీద ప్రకటించిన భావాలు ఎంతో అమూల్యమైనవి. వెంకట్ రామన్ నన్ను ప్రోత్సహించడానికి కాబోలు చాలా మెచ్చుకున్నారు. తక్కిన పత్రికలతో పోల్చి బెస్ట్ కవరేజ్ అన్నారు. నేను ఉబ్బిపోలేదు కానీ సంతోషం ప్రకటించి కృతజ్ఞత తెలిపాను...” అంటారు. అసాధారణ మేధో సంపత్తి ఉండి కూడా భాషా సేవకుడు అని వినమ్రంగా

రాసుకునే ఒక మహా తెలుగు రచయిత మహాపండితుడు రాహుల్జీ సభకి విలేఖరిగా వ్యవహరించి తన మొదటి ఇంగ్లీష్ కవరేజిని కూర్చిన క్రమం అది.

ఇలా చెప్పుకుంటూ పోతే చాలానే ఉంటాయి. రాహుల్జీ గురించి విస్తారమైన అధ్యయనాలు మరిన్ని జరగాల్సి ఉంది. స్వచ్ఛందంగా ఉత్తరాదిని తన కార్యక్షేత్రంగా చేసుకున్న ఆయన్ని ఈ రోజు దేశం మొత్తం విస్మరించడం విచారకర విషయం. విశ్వమానవుడిగా మసిలిన ఆయన స్ఫూర్తిని వర్తమాన సమాజం అసలు గుర్తించే పరిస్థితి లో లేకపోవడం బాధాకరం. ఇది వ్యక్తిగత ఆసక్తితో రాసిందే కానీ  సమగ్రమైన శోధనా వ్యాసం కాదు. ఆ మాటకొస్తే అసలు పరిశోధనేమీ నేను చేయలేదు. భవిష్యత్తులో రాహుల్జీ కోసం మరిన్ని ప్రయత్నాలు ఉన్నతమైనవి జరగాలని ఆశిస్తున్నాను. అవిశ్రాంతంగా ప్రజ్వరిల్లిన ఆయన పయనంలో సంచారిగా, స్వాతంత్ర్య సమర యోధుడిగా, వైష్ణవ సన్యాసిగా, ఆర్య సామాజికునిగా, దేశ దిమ్మరిగా, తిరుగుబాటుదారుగా, రైతు నాయకుడిగా, రాజకీయ నేతగా, జైలు ఖైదీగా, తార్కికుడిగా, తాత్వికుడిగా, భాషావేత్తగా, రచయితగా, సంపాదకునిగా, పత్రకారునిగా, చరిత్రకారునిగా, గాంధేయవాదిగా, సామ్యవాదిగా, సోషలిస్టుగా, కమ్యూనిస్టుగా, బౌద్ధునిగా, మానవతా వాదిగా ... ఇలా అంతులేని అనేకానేక పాత్రల్లో ఒదిగిపోయిన విశ్వమానవునిగా రాహుల్జీని స్మరించు కోవడం ప్రతీ తరానికి ఒక చారిత్రక అవసరం. కొందర్ని ఆయన సన్యాసి జీవితం మరికొందర్ని సామ్యవాద జీవితం, కొంతమందిని ఆయన యాత్రలు, ఇంకొంత మందిని ఆయన అక్షరాలు, కొద్దిమందిని ఆయన బౌద్ధం, మరి కొద్దిమందిని జీవితాంతం ఆయన చేసిన యుద్ధం... ఇలా ప్రభావితం చేస్తూనే ఉన్నాయి. వీటన్నింటిలోకి అంతిమంగా, అంతర్లీనంగా ఆయన్ని నిత్యం నడిపించినది మాత్రం ఎప్పటికీ ఎడతెగని ఒక నిరంతరమైన నిత్యనూతన నిర్మాణాత్మకమైన సత్యాన్వేషణ మాత్రమే.



# 10

# గతిశీల భౌతికవాది రాహుల్జీ!

– **వెన్నెలకంటి రామారావు,** బౌద్ధ సామాజిక వేత్త, నెల్లూరు, 9550367536

'మీ జీవితాన్ని మీరు సఫలం చేసుకోవాలంటే కేవలం కల్పనే అయిన భగవంతుడ్ని వదిలించుకోవాలి. నేను ఎన్నో దేశాలు తిరిగాను. (నవ్వుతూ) అక్కడ భూతాలను చూశామని చెప్పినవారు మాత్రం చాలామంది కనిపించారు. కానీ, భగవంతున్ని చూశామని చెప్పినవారు ఒక్కరూ కనిపించలేదు. అందువల్ల మీ అవనతికి మూలం కల్పనా సృష్టి అయిన దేవుడే. భగవంతుడు సమస్త అజ్ఞానానికి, గుడ్డి నమ్మకాలకు, కపటాచరణకు మూలం' అని రాహుల్ సాంకృత్యాయన్ తన గౌరవార్థం ఏర్పాటు చేసిన సభలో మాట్లాడారు. మతవాద దృక్పథం చరిత్ర పురోగతిలో నిర్వహించిన ప్రతికూల పాత్రను భౌతికవాద దృక్కోణం నుంచి సామాన్యులకు అర్థమయ్యే రీతిలో ఆయన చక్కగా వివరించారు. ఆధునిక భారతీయ బౌద్ధిక పునరుజ్జీవనంలో రాహుల్జీ ఒక మైలురాయిగా నిలిచాడంటే అతిశయోక్తి కాదు. భారత్లో బౌద్ధ పునరుద్ధరణ కోసం, మత మౌఢ్య ఖండనకోసం సాహిత్య సృజన ద్వారా నిరంతరమూ కృషి సల్పిన దార్శనికుడు రాహుల్జీ. బౌద్ధ సారస్వతాన్ని లోతుగా అధ్యయనం చేసిన సత్యాన్వేషి. నవల, కథ, నాటకం, ఆత్మకథ, జీవిత చరిత్ర, యాత్రా సాహిత్యం, వ్యాసం, విజ్ఞానం, సమాజశాస్త్రం, రాజనీతి శాస్త్రం, అనువాదం మొదలైన ప్రక్రియల్లో అనేక పరిశోధనాత్మక రచనలు చేసిన ప్రతిభాశాలి. మానవ జీవితాలలో భారతదేశంలోని దుఃఖార్తుల విముక్తికి కార్ల్మార్క్స్, బుద్ధుడు ఆలోచనా పద్ధతులను మేళవించాలనేది ఆయన భావన. బౌద్ధ దర్శనానికి, మార్క్సిజానికి మధ్య గతితార్కిక దృక్పథం రూపంలోని సారూప్యతను గుర్తించి, ఆ రెండింటి సమన్వయం ద్వారా భారత సమాజ విముక్తిని సుసాధ్యం చేయవచ్చుని ఆయన ప్రగాఢ విశ్వాసం.

రాహుల్ సాంకృత్యాయన్ సుప్రసిద్ధుడైన కేదార్‌నాథ్ పాండే 1893, 9వ తేదిన ఉత్తరప్రదేశ్‌లోని అజయ్‌ఘడ్ జిల్లాలో ఒక సాధారణ రైతు కుటుంబంలో జన్మించాడు. 13 ఏళ్ళ వయసు నుంచి 'దేశ సంచారం' రూపంలో ప్రారంభమై ఆయన సత్యాన్వేషణ అనేక దేశాల్లో సుదీర్ఘ యాత్రలు చేసి అపారమైన విజ్ఞానాన్ని సమీకరించాడు. దాన్ని అనేక పుస్తకాల ద్వారా ప్రజలకందించేందుకు వివిధ సాహితీ క్రియలలో రచనలు చేశాడు. 'సంచరించాలనే భావనను ఎన్నడూ విడవకు... ఇంటివద్ద ఎన్నటికీ ఆనందముండదు...' అనే కీట్స్ మాటలను అక్షరాలా అమలు పరిచాడా అని అనిపిస్తుంది ఆయన జీవితం.

'లేచి సామాను సర్దుకో, బయలుదేరు, ఈ విశాల ప్రపంచాన్ని చూడు, దాన్ని తెలుసుకో, అర్థం చేసుకో' అనే నినాదంతో జీవిత పర్యంతం సత్యాన్వేషణలో గడిపి, పలు రంగాల్లో రచనలు చేసిన అత్యంత ప్రతిభాశీలి. భారతీయ ఆధ్యాత్మిక జీవితంలోనే దేశ సంచారం ద్వారా జ్ఞాన సముపార్జన, భావజాల ప్రచారాలు అత్యంత కీలక భూమికను కలిగి ఉంది. చార్వాకులు, బుద్ధుడు, శంకరుడు, రామానుజుడు వంటి మహా దార్శనికుల కోవలోనే రాహుల్‌జీ కూడా సత్యాన్వేషణ, జ్ఞాన సముపార్జన, భావజాల ప్రచారం కోసం తనదైన శైలిలో దేశ సంచారం చేశాడు. ఆ క్రమంలో సంస్కృతం, పాళీ, టిబెటన్ తదితర అనేక భాషల్లో ప్రావీణ్యం సంపాదించాడు. ఆయన జీవితంలో ప్రధాన భాగం బౌద్ధంతో మమేకమైంది. 1930, జూలై 20వ తేదీన బౌద్ధభిక్షువుగా మారిన నాటి నుండి 1937లో రష్యా మహిళతో ప్రేమ వివాహం చేసుకుని దీక్ష విరమించినప్పటికీ ఆయన జీవితాంతం బౌద్ధ గృహస్తుగా గడిపారు. వామపక్షవాదులు ఆనాడు కాంగ్రెస్ పార్టీలో చేరి పనిచేస్తున్నట్లుగానే రాహుల్‌జీ కూడా వలసవాద వ్యతిరేక రాజకీయ కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొన్నాడు. పలుమార్లు జైలు జీవితం గడిపారు. దర్శన్-దిగ్దర్శన్ అనే బృహత్ గ్రంథాన్ని జైలులోనే రచించారు. ప్రజా ఉద్యమాలలో ప్రత్యక్ష, పరోక్ష సజీవ సంబంధాన్ని కలిగి ఉంటూనే బౌద్ధం సాహిత్య పునరుద్ధరణపైన ప్రధానంగా

దృష్టి కేంద్రీకరించారు. భాషా విషయంలో ఆయన కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వాన్ని విడిచిపెట్టినా చివరి వరకు ఆ ఆవేదనతో గడిపాడు. లోక సంచార జీవితంతో సత్యాన్వేషణను సాగిస్తూ గతిశీలమైన తాత్విక దృక్పథాన్ని, జీవిత దృక్పథాన్ని అలవర్చుకున్న రాహుల్‌జీ డార్జిలింగ్‌లో 1963 ఏప్రిల్ 14న మరణించే దాకా బౌద్ధ సాహిత్య సేకరణ, పరిష్కరణ, అనువాదం, పరిచయం చేసే ప్రక్రియలపై అనితర సాధ్యమైన రీతిలో కృషి చేశారు. రాహుల్జీ ఆ తర్వాతి మేధావులూ, ఉద్యమకారులూ బౌద్ధంలోని సామాజిక కోణాన్ని మాత్రమే పట్టించుకున్నారు గానీ, దాని దార్శనిక చారిత్రక తోడ్పాటును అర్థం చేసుకోవడంలో విఫలమయ్యారు. ప్రతీత్య సముత్పాదంలోని విచ్ఛిన్న ప్రవాహ పరంపర, మార్క్సిజంలోని అవిచ్ఛిన్న ప్రవాహ పరంపరల సంశ్లేషణ జరిగి ఉంటే భౌతికవాద గతితర్కం మరింతగా పరిపుష్టమై ఉండేది. బౌద్ధ దార్శనికత అయిన ప్రతీత్య సముత్పాదాన్ని, గతితార్కిక భౌతికవాదాన్ని సంశ్లేషించడంలో ఆయన సఫలమై ఉంటే, భారతీయ విశిష్టతగా ఉన్న కుల వ్యవస్థను సవ్యంగా అర్థం చేసుకుని, అందుకు అనువైన సమగ్ర సామాజిక ఉద్యమ నిర్మాణం సుసాధ్యమై ఉండేది. వివిధ కుల, మత, జాతి తదితర ఆధిపత్యవాదాలు, దురహంకారాలు ప్రపంచవ్యాప్తంగా రాజ్యంలోనూ, సమాజంలోనూ వ్యవస్థీకృతమై ఫాసిజం వివిధ రూపాల్లో ప్రజలపై విరుచుకుపడుతున్న సమకాలీన చారిత్రక సందర్భంలో రాహుల్‌జీ రచనలు యువతకు, పురోగామి శక్తులకు మార్గదర్శకత్వాన్ని అందించగలవు.



# 11

# రాహుల్ సాంకృత్యాయన్ నుండి రామ్ మనోహర్ లోహియా వరకూ.!

– గౌరవ్




कवि परिचय

कमला सिंह 'तरकस'

जन्म : 10 जुलाई 1965
जन्म स्थान : ग्राम-चकिया, पत्रालय-पल्थी, जनपद-आजमगढ़, उत्तर प्रदेश
माता : श्रीमती लीलावती
पिता : श्री चिन्तामणि सिंह
शैक्षिक योग्यता : एम०ए० हिन्दी
उपलब्धियाँ : 1985 शिक्षा काल में प्रो० प्रभुनाथ सिंह 'मयंक' का सान्निध्य व मार्गदर्शन प्राप्त ।
1991 सामाजिक क्रांति वाहिनी का गठन कर जन-जागृति कार्य
1992 जन सेवाश्रम स्वयं सेवी संस्था का संचालन
1993 पत्रकारिता
1996 व्यंग्य स्तंभ लेखन
2005 आकाशवाणी लखनऊ एक दूरदर्शन वाराणसी से काव्य पाठ ।
2012 श्याम नारायण पाण्डेय सम्मान 2012 प्राप्त ।
2013 आशुकविता
प्रकाशित कृतियाँ : इन्द्रधनुष, युगधर्म, लोकनायक श्रीराम, शेखर शतक, मंगल गाथा, बर्बरीक-विक्रम, जननायक लोहिया

सम्पर्क सूत्रः-
जन सेवाश्रम
ग्राम व पत्रालय-बरदह,
जिला- आजमगढ़-276301 (उ.प्र.)
मो. 9450755907

हिन्दी साहित्यिक पुस्तकों के प्रकाशक
दिल्ली उत्कर्ष प्रकाशन मेरठ
ISBN 978-81-921666-9-6

అయిదేళ్ళ క్రితం సంగతి. మహా పండిత్ రాహుల్ సాంకృత్యాయన్ జన్మస్థలం వెతుక్కుంటూ యూ.పీ.లో తిరుగుతున్న సమయంలో మిత్రుని ద్వారా ఒకాయన కాంటాక్ట్ దొరికింది. ఆయన పేరు, కమలా సిన్హ్ తర్కస్!

అజంఘర్ జిల్లోని బర్దాహ్ అనే గ్రామంలో ఒక చిన్న స్కూలు, జన సేవాశ్రమం పేరుతో ఏవో కొన్ని సామాజిక సేవా కార్యక్రమాలు చేస్తున్నారు. అనుకోకుండా ఒక రోజు వాళ్ళింట్లో ఉండాల్సి వచ్చింది. వేడి వేడి రొట్టెలు, తాజా బెల్లం ఆతిథ్యం ఇప్పటికీ గుర్తొస్తుంది!

అలా నా గురించిన సమాచారం అడిగి తెల్సుకుని రాహుల్జీ జన్మస్థలం పంథహ్, కనైలీ గ్రామాలకి దగ్గరుండి తీసుకుని వెళ్ళారాయన. ఆ విధంగా కొద్దిగా సాంప్రదాయ వాసనలు ఉన్నప్పటికీ నాకెంతో సహకరించారు!

అప్పుడప్పుడు ఏవో కొన్ని రచనలు చేస్తుంటానని చెప్పారు, ఆయన రాసిన రెండు పుస్తకాల్ని ఇవ్వడమే కాకుండా, రాహుల్జీ పై అప్పటికప్పుడు పద్యాల్ని అల్లి అద్భుతమైన ప్రాసతో ఆపకుండా చదివి వినిపించారు. అప్పుడున్న నా డొక్కు ఫోన్‌లో రికార్డు చేసాను కానీ ఇప్పుడు కనబడటం లేదు!

అది కాదు నన్ను ఆకట్టుకుంది, ఆయన ఇచ్చిన రెండు పుస్తకాల్లో ఒకటి సోషలిస్టు యోధుడు రామ్ మనోహర్ లోహియా జీవితం గురించి ఏకంగా రెండొందల పై చిలుకు పేజీలు రాసిన పద్యాల కూర్పు. 'జననాయక్ లోహియా' శీర్షిక తో కవితా ప్రకియలో భోజ్ పురి యాసలో ప్రజా భాషలో రాసిన సంపుటి అది!

లోహియా గురించి ఇతరేతర పుస్తకాలు, వ్యాసాలు, రచనలు చాలానే ఉ ండొచ్చు కానీ నాకు తెలిసీ ఆయన జీవితాన్ని ఏ కాలానికా కాలం ప్రత్యేకంగా విడదీసి నిబద్ధతతో అధ్యయనం చేసి, పద్య రూపంలో పెట్టిన ఏకైక రచన ఇదేనేమో!

రాహుల్జీ – రాం మనోహర్ లోహియా ఇద్దరూ ఉత్తర భారతావనికి చెంది విశ్వనరులుగా ఎదిగినవారే. ఒకరు మార్క్సిస్టు బౌద్దడైతే, మరొకరు సోషలిస్టు గాంధేయవాది. ఇరువురూ ఎన్నో ఉద్యమాలు, పోరాటాలు, ప్రయాణాలు, అన్వేషణల్లో ఆరితేరిన అనితరసాధ్యమైన ప్రతిభావంతులే. అయినప్పటికీ ఈరోజు ఇద్దరూ విస్మృత సామ్యవాద వీరులు!

నాకు ఆశ్చర్యం కలిగించే అంశం ఏమిటంటే, భారతీయ సాంస్కృతిక పరిణామానికి సంబంధించిన అనేక విషయాల్లో ఇద్దరూ సమాన ఆసక్తిని కనపరచడం. ఇద్దరి అధ్యయనాల్ని లోతుగా పరిశీలిస్తే తేలిగ్గా అర్దమయ్యే విషయం ఇది!

అనేక అశక్తతల వల్ల నేను వ్యక్తిగతంగా ముందడుగు వేయలేకపోతున్నా ఐనా, అత్యాసని తెలుసు కానీ ఔత్సాహికులు ఎవరైనా పూనుకుని ఈ దిశగా ఇద్దరి కృషి గురించి ప్రత్యేక మదింపు వేస్తే బావుంటుందని నా అభిప్రాయం. ప్రస్తుతం అది ప్రయోజనం అని కూడా నా ఉద్దేశం!

గతంలో భగత్ సింగ్ – లోహియా, అంబేద్కర్–రాహుల్జీల్ని పోలుస్తూ "సాఫల్య జీవుల" పేరిట అచ్చయిన రచనలో ప్రసంగ వ్యాసాలు ప్రచురించాను. కానీ, రాహుల్జీ – లోహియా కూలంకష అధ్యయనం కూడా సాంస్కృతిక రంగానికి చాలా ముఖ్యమనే భావన ఇప్పుడు కలుగుతోంది!

చివరగా, రాహుల్జీ కోసం ఏదో వెతుకుతుంటే అప్పట్లో ఈ తర్కస్‌గారు అభిమానంగా ఇచ్చిన లోహియా పుస్తకం కంటబడింది. తర్వాత ఆయన్నెప్పుడూ మళ్ళీ కలవలేదు కానీ, సందర్భం గుర్తొచ్చి ఆలోచిస్తే ఆసక్తి అనిపించి ఇద్దరి గురించి ఇలా రాయాల్సి వచ్చిందంతే!

అంగీకారాలు, విభేదాల మాట ఎలాగున్నా, భారతీయ తాత్విక మూలాల్లోని బహుళత్వాన్ని నిర్మాణాత్మకంగా నిరూపించే ప్రయత్నం చేసిన మహనీయులుగా రాహుల్జీ – లోహియాల్ని అధ్యయనం చేయడం ప్రాముఖ్యత కలిగిన కార్యాచరణ అనే నా భావం!



# 12

# నదిలాంటి మనిషి

– **పూడూరి రాజిరెడ్డి,** జర్నలిస్టు, హైదరాబాద్, 9912347926

అద్భుతం అనే విశేషణానికి గనక రూపమొస్తే, అది ఆరడుగుల రాహుల్ సాంకృత్యాయన్‌లా ఉంటుంది. ఎలాంటి మనిషాయన!

యాత్రికుడు, చరిత్రకారుడు, భాషా శాస్త్రవేత్త, అనువాదకుడు, ఆచార్యుడు, స్వాతంత్ర్య సమరయోధుడు, అపారమైన పాండిత్యం ఉన్నప్పటికీ సరళమైన హిందీలో రాసిన రచయిత!

రాహుల్జీ పేరు వినగానే, కాళ్లకు కట్టుకోవడానికి బలపాల్ని వెతికేవాళ్లు ఉంటారు. అంతటి ఉత్తేజకర పాదాచారి ఆయన. యాత్రలు వాటికవే ఇవ్వగలిగే పరమానందాన్ని అనుభవిస్తూనే, వాటి ద్వారా పరమార్థాన్ని కూడా ప్రజలకు అందించారు రాహులుడు.

ఒకసారి ఈ దృశ్యం ఊహిద్దాం! పదమూడో శతాబ్దంలో నలంద, విక్రమశిల విశ్వవిద్యాలయాలను భక్తియార్ ఖిల్జీ ధ్వంసం చేసినపుడు బౌద్ధ భిక్షువులు పవిత్రమైన గ్రంథాలతో పారిపోయారనీ, ఆ విలువైన సంస్కృత పుస్తకాల్ని టిబెట్‌లోని ఆరామాల్లో భద్రపరిచివుంచారనీ ప్రచారంలో ఉంది. అయితే, ఆరువందల ఏళ్లుగా వాటిల్లో ఏముందో చూసినవారు లేరు.

సాంకృత్యాయన్ వాటికోసం అన్వేషిస్తూ, దారి కూడా సరిగాలేని కొండల్లో నడుస్తూ, కాశ్మీర్, లడఖ్, కార్గిల్ మీదుగా టిబెట్ వెళ్ళారు. అక్కడ పుస్తకాలైతే లభించాయి గానీ అవి సంస్కృతంలో లేవు. అన్నీ భోటి భాషలో ఉన్నాయి. రాహుల్జీ కంచర గాడిదల మీద వాటిని తరలించుకొచ్చారు. మరో మూడుసార్లు టిబెట్ వెళ్లారు. టిబెటన్ నేర్చుకున్నారు. నేర్చుకోవడమే కాదు దాని వ్యాకరణ పుస్తకాలు రాశారు. టిబెటన్–హిందీ నిఘంటువు కూర్చారు. ఆ గ్రంథాలన్నీ పాట్నా మ్యూజియంలో ఉన్నాయిప్పుడు.

"ప్రపంచంలో యాత్రలు చేయడానికి మించిన ముఖ్యమైన విషయం మరోటి లేదు. సమాజం కోసం ఒక యాత్రికుడి కంటే శ్రేష్ఠంగా ఆలోచించగలవారు మరెవరూ ఉండరు," అనేవారు రాహుల్జీ. ఈ ప్రపంచం ఈ రీతిన ఉండటానికి యాత్రికుల వివేకమే కారణమంటారాయన. "యాత్రలంటూ జరగకపోయివుంటే సోమరి మానవమూకలు పశుస్థాయి నుంచి పరిణామం చెందేవే కాదు".

ఉత్తరప్రదేశ్‌లోని పల్లెటూరులో కేదార్‌నాథ్ పాండేగా జన్మించి, తొమ్మిదేళ్లప్పుడే ప్రపంచం ఏమిటో చూడాలని ఇంట్లోంచి పారిపోయాడు సాంకృత్యాయన్. వేలాది కిలోమీటర్లు కాలి నడకన చుట్టి వచ్చారు. బౌద్ధాన్ని తనలో ఇంకించుకున్నవాడుగా తన పేరును రాహుల్ సాంకృత్యాయన్‌గా మార్చుకున్నారు. మూడు బౌద్ధ వేదాలనూ జీర్ణించుకుని త్రిపిటకాచార్య అయ్యారు. టిబెట్, శ్రీలంక, ఇరాన్, చైనా, అప్పటి సోవియట్ రష్యా.... ఎక్కడ తిరిగితే అక్కడి భాష నేర్చుకున్నారు. అరబిక్, భోజ్‌పురి, ఫ్రెంచ్, హిందీ, కన్నడం, మైథిలి, నేపాలీ, పాళీ, పర్షియన్, రష్యన్, రాజస్థానీ, సింహళీస్, తమిళం, ఉర్దూలాంటి ముప్పైకి పైగా భాషలు, అందులోని యాసలు కూడా ఆయనకు తెలుసు. ఎక్కడా అధికారికంగా చదువుకోకపోయినా విశ్వ విద్యాలయాల్లో బోధించే స్థాయికి ఎదిగారు. అందుకే ఆయన్ని మహాపండిత్ అనేవారు.

చివరికి మార్క్సిజం దగ్గర తన భావాల్ని స్థిరీకరించుకున్న రాహుల్జీ... సోషియాలజీ, మతం, తత్వం, భాష, సైన్సు మీద శతాధిక పుస్తకాలు రాశారు. రుగ్వేద ఆర్యులు, లోకసంచారి, దివోదాసు, విస్మృత యాత్రికుడు, సింహ సేనాపతి, జయయౌధేయ, మధురస్వప్నం లాంటివి అందులో కొన్ని. సృష్టాది నుంచీ ఈ ప్రపంచపు నడతను మేఘాల్లో కూర్చుని వీక్షించినట్టుగా ఆయన చరిత్రను రికార్డు చేసిపెట్టారు. లేదంటే 'ఓల్గా నుంచి గంగకు' రాయడం ఎలా సాధ్యం!



రాహుల్ సాంకృత్యాయన్

చరిత్రను అర్థం చేయించడానికి ఆయన పూసిన పంచదార పూత ఒక్కోసారి అది చరిత్రేనా అన్న అనుమానాన్ని కలిగిస్తుంది. కానీ ఎన్ని చరిత్ర గ్రంథాలు చదివినా మెదడులో నమోదుకాని దృశ్యమాలిక ఆయన 'ఓల్గా నుంచి గంగకు' ద్వారా నమోదవుతుంది. రిఫరెన్సు పుస్తకాలు కూడా కంఠోపాఠంగా ఉంచుకున్న ఈ మహావిజ్ఞాని చివరి రోజుల్లో తన పేరేమిటో తనే చెప్పుకోలేని మతిమరుపులోకి జారిపోవడం సృష్టి వైచిత్రి. కానీ ఆయన్ని మనం మాత్రం మరిచిపోగలమా!

(సాక్షి పత్రిక సౌజన్యంతో)



# 13

# “కట్టిన దుస్తులు పసుపు.. పట్టిన జెండా ఎరుపు!” మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్

\- గౌరవ్






ఆస్ట్రేలియాలో సాంప్రదాయ క్రైస్తవ కుటుంబంలో పుట్టి 18 ఏళ్ళకే బౌద్ధునిగా మారిన వ్యక్తి ఎస్. దమ్మిక అనేక దేశాలు తిరిగి ప్రసిద్ధ బౌద్ధ పండితుడు అంగారక ధర్మపాల ఆఖరి శిష్యునిగా అవిశ్రాంత సంచారిగా, బౌద్ధ ప్రసంగీకుడిగా పేరొందారు. మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్ శత జయంతి సందర్భంగా 1993లో ప్రచురించేందుకు రాహుల్జీ జీవితం గురించి కృషిచేసి 1990–91 మధ్య కాలంలో “Yellow Robe - Red Flag” పేరిట చిన్న జీవిత చరిత్ర రాసారు!

ఐతే, అప్పట్లో దానినాయన ఎక్కడో పోగొట్టుకున్నాడు. మళ్ళీ అది గతేడాది అంటే, 2021 ఏప్రిల్‌లో లేటు వాళ్ళమ్మగారి పేపర్లలో దొరికింది. అప్పట్లో చేసిన ఆ రచన నకలు ఒక కాపీ వాళ్ళమ్మగారికి పంపిన విషయమే

ఆయన మర్చిపోయారు. ఈ లోపు రాహుల్జీ జీవితం గురించి కొన్ని వ్యాసాలు, రచనలు వచ్చాయి. వాటిని కూడా పరిగణలోకి తీసుకొని బంతే ఎస్. ధమ్మిక గారు రాహుల్జీ సంక్షిప్త జీవితగాథని నెట్‌లో ఉంచారు!

కేదార్‌నాథ్ పాండే @ సాధు రామ్ ఉదార్ దాస్ @ ఖున్నా చేవన్ @ దామోదరాచారి కేదార్‌నాథ్ విద్యార్థి @ రాహుల్ సాంకృత్యాయన్ అనే వివిధ పేర్లతో జీవించిన రాహుల్జీ జీవితానికి సంబంధించిన అనేక ఆసక్తికరమైన విషయాల్ని కేవలం 40 పేజీలలో పొందుపరిచి అందించిన ఈ పుస్తకం ఒక్క సిటింగ్‌లో చదవదగ్గది!

మహా మానవుడిగా, మహా సంచారిగా రాహుల్జీ ఎదిగిన క్రమాన్ని కూలంకషంగా అధ్యయనం చేసి ఇందులో ఫొటోలతో సహా ఆ వివరాలు రాసారు. ఉత్తర భారతదేశం మొదలుకొని ప్రపంచంలోని అనేక దేశాలు, ప్రాంతాల వరకూ అవిశ్రాంతంగా సాగిన ఆయన అన్వేషణకి ఒక అర్థవంతమైన అక్షర రూపం ఇచ్చారు!

ప్రాథమిక విద్య కూడా లేని రాహుల్జీ ప్రపంచంలోని రెండు అత్యుత్తమ విశ్వ విద్యాలయాల్లో ఆచార్యునిగా పనిచేసిన విషయం మనకి తెల్సిందే. ఐతే, టిబెటన్ లధాఖీ విద్యార్థులకు టీష్టన్ పున్షోంగ్ అనే వేత్తతో కల్సి వ్యాకరణ పుస్తకాల్ని, టిబెట్ బాలశిక్షని రూపొందించడం, ఈమధ్య కాలం వరకూ అక్కడి పాఠశాలలకు అవే పాఠ్య పుస్తకాలు అవడం అపురూపమైన విషయం!

ఒకసారి కొలంబోలో ఒక బౌద్ధ సంఘం రాహుల్జీని విందుకి ఆహ్వానించారట. మొత్తం అన్ని ఆహార పదార్థాలు శాకాహారానివే ఆయన ముందు ఉంచారట. వాటన్నింటినీ పరికించి చూసిన రాహుల్జీ వారితో, “సరే, ఇదంతా పశువులు తినేది. మరి మన భోజనం ఏదీ?” అన్నారట. మాంసాహారాన్ని చులకన చేసేలా మాట్లాడిన ఈనాటి సన్యాసులకి చెంపపెట్టు తిరుగులేని సన్యాసి అయిన రాహుల్జీ మాటలు!

రాహుల్జీ మొదటి రచన బైస్వీ సాదీ ( 22వ శతాబ్ది) పుస్తకాన్ని ఆయన జైల్లో ఉంటూ ఆరోగ్యం బాగాలేక హాస్పిటల్ లో రాసాడు. దాని ప్రూఫ్‌ని నేపాల్ మీదుగా వెళుతుండగా చూస్తూ జపాన్ చేరి పూర్తి చేసాడట. బొత్తిగా స్థిరత్వం లేని తీవ్రమైన సంచార జీవితం రాహుల్జీది అనడంలో సందేహం లేదు!

టిబెట్‌లో అరుదైన గ్రంథాల సేకరణ కోసం వెళ్ళిన రాహుల్జీని భారత ప్రభుత్వం అసలు పట్టించుకున్నది లేదు. నాటి బీహార్ రాష్ట్ర ప్రభుత్వమైనా కాస్తో కూస్తో స్పందించింది కానీ భారత ప్రభుత్వం మాత్రం నిమ్మకు నీరెత్తినట్లు ఉంది. ఆఖరికి ఇలాంటి శోధనలపై ఏ మాత్రం ఆసక్తి లేని ఇటలీ ఫాసిస్టు ప్రభుత్వం కూడా టిబెట్‌లోని సంస్కృత గ్రంథాల కోసం నాడు 'ప్రొఫెసర్ టుక్కీ' కి నిధులు మంజూరు చేసిందట!

రాహుల్జీ ఏకవ్యక్తి సైన్యంగా సాధించిన పురోగతి ప్రపంచంలోని బుద్ధి జీవుల్ని నివ్వెర పరిచింది. కలలో కూడా ఊహించడానికి సాహసించనన్ని అత్యంత విలువైన సారస్వత సాహిత్యాన్ని మానవాళికి అందుబాటులోకి తీసుకుని వచ్చి, సాంస్కృతిక సుసంపన్నానికి కృషి చేసిన రాహుల్జీ ఎందరికో ఆరాధ్యుడు, ప్రేమాస్పదుడు అయినట్లే కొందరికి కంటగింపు కూడా అయ్యాడట!

ప్రపంచవ్యాప్తంగా ఎంతో మందిని ప్రభావితం చేసిన రాహుల్జీపై అందుకే ఈ దేశ మేధావులు కొందరు విషం కక్కారు. విదేశీ విశ్వ విద్యాలయాలలో సైతం బోధకుడిగా ఘనత సాధించిన మహా పండితుడ్ని ఇండియాలోని ఏ ఒక్క యూనివర్సిటీ కనీసం ఆహ్వానించకపోవడం ఈ దేశంలో విద్య పేరిట అమలవుతున్న నిర్బంధ బానిసత్వానికి, అల్పత్వానికో స్వల్ప ప్రతీక మాత్రమే!

చాలాకాలం పాటు రాహుల్జీని పసుపుపచ్చ బట్టల మార్క్సిస్టని పార్టీలో పిలిచేవారట, కొన్ని సందర్భాలలో ప్రేమగా, మరికొన్ని సందర్భాల్లో

భయంతోనూ. ఎవరేమనుకున్నా రాహుల్జీ మాత్రం చిట్టచివరి వరకూ కూడా తన జీవితం మొత్తాన్ని సమాజానికే ధార పోసాడు. అణగారిన వర్గాల ప్రజల కోసమే అంకితం చేశాడు!

1956 లో 2500 వ బౌద్ధ ఉత్సవాలు నేపాల్ రాజధాని ఖాట్మాండులో జరిగినప్పుడు ఆ సమావేశంలో భారతదేశం తరపున ఇద్దరే వ్యక్తులు విశిష్ట ఉపన్యాసకులుగా నిలిచారు. ఒకరు బాబాసాహెబ్ అంబేద్కర్ కాగా, రెండో వ్యక్తి మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్. ఇరువురూ పీడిత ప్రజల పక్షాన జీవితాంతం కృషి చేసిన వారే!

"Rahul Sankrityayan was the nearest India has come this century to producing a renaissance man". అనే వాక్యంతో మొదలెట్టబడిన ఇలాంటి ఎన్నో సంగతుల చిన్నపాటి ఈ పుస్తకాన్ని తెలుగులో అనువాదం చేద్దామని అనుకున్నాను. ఐతే, budblooms కాపీరైట్ హక్కుల కొరకు శ్రావస్తి ధమ్మికగారితో సంప్రదింపులు జరపడం అవసరం అని తెలిసింది. కాన ఆ వ్యాయామం అంతా చేయలేక ఈ సంక్షిప్త పరిచయం చేస్తున్నాను!

ఆసక్తి ఉన్న మిత్రులు నెట్‌లో వెతికితే దొరుకుతుంది. లేదంటే నా వాట్సప్ నంబర్ 9032094492 కి రిక్వెస్ట్ పెడితే నేను సాఫ్ట్ కాపీ పంపగలను. రాహుల్జీ జీవితం పట్ల ఆసక్తి ఉన్న వారంతా తప్పకుండా చదవాల్సిన పుస్తకం మాత్రమే కాదు, చదివించాల్సిన పుస్తకం కూడా అని నా అభిప్రాయం. అందుకే, ఈ చిన్న రైటప్!

(సౌజన్యం : సకలం వెబ్ మేగ్‌జైన్)



# 14

# 'ఓల్గా సే గంగ' నుండి ఈనాటి వరకూ...

– **అద్దేపల్లి ప్రభు,** అభ్యుదయ రచయిత, కాకినాడ, 9848930203

ప్రపంచ దేశాల చరిత్రకీ భారత దేశ చరిత్రకీ ఒక భేదం ఉంది. భారత దేశానికి చరిత్రే లేదు అనే అభిప్రాయం నుండి భారత దేశ చరిత్రని పరిశోధించి సింధు నాగరికత వరకూ పోగా భారతదేశానికి ఆరు వేల ఏళ్ళ చరిత్ర ఉందనేది బయటపడింది. సింధు నాగరికతా కాలం నుండి ఈనాటి వరకు ఉన్న వేల ఏళ్ళ చరిత్ర భారత దేశాన్ని సాంస్కృతికంగా ఉన్నత స్థానంలో ఉంచుతోంది. అయితే యితర దేశాల చరిత్రతో పోల్చుకుంటే భారతదేశ చరిత్రకి ఒక విశిష్టత ఉంది. ఈజిప్ట్, సుమేరియా లాంటి నాగరికతలు అంతరించి పోయి ఆ చరిత్రలు ఈనాడు చరిత్ర విద్యార్థులకు పాఠాలుగా మాత్రమే మిగిలిపోయాయి. అయితే భారతదేశ చరిత్ర సంప్రదాయాలు ఒక అవిచ్ఛిన్నమైన గొలుసుని రూపొందించాయి. గతం వర్తమానంతో విడదీయలేనంతగా పెనవేసుకుపోవడం అనేది భారత చరిత్ర విశిష్టత. అయితే ఈ గొలుసు భారత ప్రజలకి ఒక సంకెలగా మారిపోయింది.

చరిత్ర పరిశోధనకు సంబంధించి రాహుల్ సాంక ృత్యాయన్ ఒక అపూర్వమైన వ్యక్తే కాక విశిష్టమైన వ్యక్తిత్వం కలవాడు కూడా. ఆసియా దేశాల ప్రాచీన సంస్కృతిని వెలికిదీసి వందల ఏళ్ళు సంపన్నం చేసిన మహామేధావి రాహుల్జీ.

భారత దేశ చరిత్ర రచనలో మొదటి నుంచి మతతత్వం పెన వేసుకొని పోయింది. బ్రిటీష్ సామ్రాజ్యవాదుల ప్రచారంతో ప్రభావితమైన భారత చరిత్రకారులు గతమంతా గొప్పదనే భావంతో చరిత్రని విశ్లేషించటంతోనూ,

విభజించి పాలించు సూత్రంతో 1857 తరువాత ఒక పథకం ప్రకారం భారత ప్రజల్లో హిందూ ముస్లిం విభేదాలను రెచ్చగొట్టి ఈనాటి వరుకూ ఆ కాష్టాన్ని మండిస్తూనే ఉన్న బ్రిటన్ కుట్ర ఫలితంగానూ భారత చరిత్రపైన ఉన్న మతతత్వ పడగ నీడ బలమైందీ, ప్రమాదకరమైంది కూడా.

అయితే భారత చరిత్రని సరైన దృక్పథంతో విశ్లేషించిన చరిత్రకారుల్లో రాహుల్జీ ప్రథముడు. చరిత్రపైన ఆయన రాసిన పుస్తకాలు ఈనాటికీ నూతన ఆలోచనల్ని రేకెత్తిస్తూనే ఉంటాయి.

క్రీ.పూ. 6000 సంవత్సరం నుంచి 1942 వరకూ మానవ సమాజ చరిత్ర గురించి చిత్రించిన 'ఓల్గా నుండి గంగ వరకూ' అనే పుస్తకం చాలా ప్రాధాన్యమైనది. మాతృస్వామిక వ్యవస్థగా గుంపులు గుంపులుగా జీవించిన నాటి నుండి సామ్రాజ్యవాద యుద్ధాల వరకూ ఉన్న చరిత్రను విశ్లేషిస్తూ ఇరవై గాథలుగా రచించిన ఈ పుస్తకం చరిత్ర విద్యార్థులకే కాక ప్రతివారికీ చరిత్రపైన ఆసక్తి కలిగిస్తుంది. చరిత్ర అంటే రాజవంశాల చరిత్రగా కాక సామాజిక పరిస్థితుల అధ్యయనంగా మనకళ్ళ ముందు చిత్రిస్తుంది. ఇదొక్కటే కాదు, మానవ సమాజం ఏ దిశగా పురోగమిస్తోందో చారిత్రకంగా వివరిస్తుంది.

ఆర్యుల నుంచి బ్రిటీష్ వారి దాకా భారత దేశానికి శతాబ్దాలుగా వివిధ జాతుల వారు పెద్ద సంఖ్యలో వస్తూనే ఉన్నారు. ఆర్యులు, శకులు, హూణులు, కుషాణులు, గ్రీకులు మొదలైన జాతుల ప్రజలు భారతదేశంలోకి ప్రవేశించి భారతీయులుగా స్థిరపడిపోయారు. ఈ విభిన్న జాతులకు చెందిన సంస్కృతీ సమ్మేళనానికి భారత ఆర్థిక సాంఘిక పరిస్థితులు కూడా అత్యంత అనువైనవి. ఈ ఏర్పడిన సంస్కృతే ఒక జీవన విధానం అనుకుంటే డా. రాధాకృష్ణ అన్నట్టు హిందూత్వం అనేది ఒక మతం కాదు ఒక జీవన సరళి అనేది యదార్థమే. అయితే వీటన్నింటినీ కలగలుపుకొని అత్యంత అసంబద్ధమైన ఒక తాత్విక దృక్పథాన్ని రూపొందించిన బ్రాహ్మణ మతం తరువాతి కాలంలో

అభివృద్ధి నిరోధకమైపోయింది. విభిన్న సంస్కృతులని బ్రాహ్మణమతం అనేది కలుపుకుంది అనే కన్నా మింగేసింది అనడం బాగుంటుంది. దీనికి కారణం ఆ మతంలోని ప్రగతిశీలత కాక భారత ఆర్థిక సామాజిక స్థితికి అది అవసరం కావటం ముఖ్యం.

ఈ పరిణామంలో బౌద్ధమతం ఒక మైలురాయి. భారతదేశంలో అత్యంత మేధోసంపత్తి, ఆచరణాత్మక దృక్పథం కల తాత్వికుల్లో బుద్ధుడు అగ్రగణ్యుడు.

మానవ జాతి వర్గాలుగా చీలిపోయి దుర్భర దారిద్ర్యంతో మగ్గిపోయే శ్రామికులూ విలాస జీవనాన్ని గడిపే ధనిక పాలక వర్గాలుగా ఏర్పడిన నాటి నుండి సామ్యవాదం అనే భావం తలెత్తుతూనే ఉంది. అది మతాల రూపంలో వ్యక్తీకరణ చెందినా పురాణాల రూపంలో అద్భుత గాథలుగా రూపొందినా ఆ సంఘర్షణ అనేది కొనసాగుతూనే ఉంది. బహుశా ఆసియా దేశాలు ఈ సంఘర్షణకి వేదికగా వృద్ధి చెందాయనుకోవచ్చు. పురూహూతుడు అనే కథలో మాద్రి తాతకి అభివృద్ధిని ఒప్పుకోక తప్పకపోయినా అది సృజించిన విభేదాలు హింసనీ జీర్ణించుకోలేక పోయాడు. ఆ సంధికాలంలో పాత సమాజమే సరైందని విశ్వసించి ఏర్పడుతూ ఉన్న వూళ్ళలోకి వెళ్ళకుండా బయటే ఉండిపోయాడు.

ఒక ప్రక్క వేగంగా జరుగుతున్న అభివృద్ధి మరో ప్రక్క అంతకన్నా వేగంగా పెరుగుతున్న హింస మహా సామ్రాజ్యాల నిర్మాణానికి భూమికని ఏర్పరుస్తున్నాయి. అజాత శత్రువు షోడశ మహా జానపదాల్ని నిర్మూలించి మహా సామ్రాజ్యాన్ని నిర్మించాలని ఆశించాడు. అతనితో మొదలైన ఆ ప్రయత్నం గుప్తుల కాలంలో పతాకస్థాయిని చేరింది. యింకో పక్క సమాజంలో బ్రాహ్మణులు కర్మకాండ పేరిట చేస్తున్న హింసాకాండని నివారించి ఏర్పడబోతున్న వ్యవసాయక సమాజానికి తాత్విక భూమికగా బౌద్ధం ఆవిర్భవించింది. దేశంలోని ప్రజానీకాన్నే కాక యితర దేశాల ప్రజల్ని కూడా ఆకర్షించింది. ఉత్తేజపర్చింది. చాతుర్వర్ణ వ్యవస్థని ఖండించి సంఘవాదం అనే దాన్ని ప్రబోధించింది. సుపర్ణ యౌధేయుడు కథలో ఈ సంఘర్షణని

వివరిస్తూ దిగ్నాగుడు యిలా అంటాడు. “కొన్ని శతాబ్దాల వరకూ భారత దేశంలోని కుల మత భేద భావాలు నశించి పోతాయనే అనిపించింది. కానీ భారతదేశపు దురదృష్టంకొద్దీ ఆ సమయంలోనే బ్రాహ్మల చేతికి గుప్తరాజుల అధికారం చిక్కింది” “బౌద్ధులు జాతి వర్ణ భేదాల్ని రూపు మాపాలని అనుకునేవారు. అంచేత బ్రాహ్మలు కులం నుంచి బహిష్కృతులైన గ్రీకులు, శకులు మొదల్కైన వారికి పెద్ద పెద్ద కులాల్లో స్థానం కల్పించడం ప్రారంభించారు. ఇది చాలా గట్టి ఎత్తు. ఈ వుచ్చులో ఎంతో మంది బౌద్ధ గృహస్తులూ చిక్కుకొని పోతున్నారు. ఈ చీలికతోటీ భేద భావాలతోటి ప్రజాశక్తిని కుంటుపర్చాలనీ, రాజు బలాన్నీ, బ్రాహ్మణ బలాన్నీ దృఢతరం చేయాలని అనుకుంటున్నారు.” కొన్ని వందల సంవత్సరాల తరువాత యిదే భావం సుమేరుడికి కలుగుతుంది.

బౌద్ధాన్ని ఓడించి బ్రాహ్మణ మతం స్థిరపడి స్వయం సమృద్ధ గ్రామాలు ఏర్పడిపోయాయి. అపారమైన ధనరాశుల సంపద పోగుబడి విలాసవంతమైన జీవనాన్ని గడిపే జయచంద్రుడు లాంటి రాజులు బయలు దేరారు. దేవాలయాలలో పట్టణాలలో సంపద అపారంగా పెరిగి అరబ్బులని ఆకర్షించింది. దేశాన్ని అసమర్థమైన, తమలో తాము కలహించుకునే రాజుల్ని వోడించి వారి రాజ్యాన్ని స్థాపించారు. అరబ్బులకు హిందూ సంస్కృతి పట్ల అభిమానం ఏర్పడి వేదాంత ప్రభావంతో సూఫీ సిద్ధాంతం బయలు దేరింది. గ్రామాల్లో పీడనకి వ్యతిరేకంగా భక్తి ఉద్యమ రూపంలో ఉద్యమాలు లేచాయి. సురైయా అనే కథలో అక్బరు పాలనని వివరిస్తూ “ముసల్మానుల్ని హిందువులుగా, హిందువుల్ని ముసల్మానుల్లా చేయాలని అనుకోలేదు. వాళ్ళు ఒకటిగా ఉండి ఒకే జాతిగా భ్రాతృభావంతో ఉండాలను కొన్నాడు” అంటాడు రాహుల్జీ. ముస్లింలు, హిందువులు వేరు వేరు మతాల్ని అనుసరించే భారతీయులైపోయారు, రాబోయే కాలంలో బ్రిటిష్ వారు వీరి మధ్య అగ్గి పుట్టించడానికి అనువుగా.

బ్రిటిష్ వారి రాకతో భారత దేశ స్వరూపమే మారిపోయింది. గ్రామ సీమల మీద వారు తీసిన చావు దెబ్బ అసామాన్యమైంది. బ్రిటిష్ వారి ప్రాపకంతో 'చన్నుల్ని పితికి పాలు తీసుకునే" వర్గం బయలు దేరింది. చితికి పోయిన రేఖాభగత్ ప్రతీకారంతో జ్వలించిపోయాడు. బ్రిటన్‌కు వ్యతిరేకంగా ప్రజల్లో తిరుగుబాటు ప్రారంభమయ్యింది.

1857 తిరుగుబాటు భారత స్వాతంత్ర్య పోరాటానికీ ప్రజాస్వామిక పోరాటానికీ ప్రారంభం అయ్యింది. మంగళ సింహుడు వోడిపోతామనే నిర్ణయించుకున్నా లొంగిపోకుండా పోరాడాడు. 1922 నాటికి ఇంగ్లీషు పద్ధతిలో జీవించే 'సఫ్దర్లలలో దేశభక్తి భావాలు వురకలు వేశాయి. చరిత్రని అధ్యయనంచేసి వారు పోరాటంలోకి దూకారు. 1942 ప్రాంతానికల్లా సమాజంలోని అట్టడుగు వర్గాల ప్రజలు రాజకీయాల్లోనికి రావడం మొదలు పెట్టారు.

గాంధీనీ, అంబేద్కర్‌నీ దాటి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి నాయకత్వం వహించే దిశగా పయనం మొదలైంది. సుమేరుడి మాటల్లో 'శ్రామికుడికి మిల్లు యజమాని ఎంత ఉపకారం చేయగలడో అంత ఉపకారం గాంధీ చేసాడు' "వేల సంవత్సరాలుగా మా జాతి పశువు కన్నా హీనంగా, ముట్టరాని జాతిగా అవమానించబడుతోంది" "అంబేద్కరు పద్ధతికీ, అస్పృశ్యతా నివారణకి పూనుకున్న కాంగ్రెస్ నాయకుల పద్ధతికీ నాకు తేడా కనిపించడం లేదు. ఇంకా చెప్పాలంటే ఆ పద్ధతి గాంధీ బిర్లా బజాజ్ పద్ధతిలో వెళ్ళి కలుస్తోంది. అంటే వాళ్ళ ప్రకారం అస్పృశ్యుల్లోనూ కొంతమంది నెలనెలా ఐదారు వేలు సంపాదించే వాళ్ళు తయారౌతారు. అస్పృశ్యుల్లో బిర్లాలు బజాజ్‌లు కాకపోయినా వేలు సంపాదించే వాళ్ళు తయారౌతారు. వాళ్లకీ ఒకటో రెండో సంస్థానాలు లేకపోతే జమీందారీలు ఏర్పడుతాయి. కానీ దీని వల్ల పదికోట్ల అస్పృశ్యుల స్థితి ఏమీ మారదు."

భారత చరిత్రని విభిన్న కాలాల్లో ఆర్థిక సామాజిక స్థితి గతుల్ని విశ్లేషిస్తూ వ్రాసిన 'వోల్గా నుండి గంగకు' గతం నుండి వర్తమానం (1942లో ఈ పుస్తకం రచించాడు) వరకూ వొచ్చి ఆ ప్రాతిపదికన (నేటి మన వర్తమానమైన) భవిష్యత్తులోకి దృష్టి సారించింది.

భారత ప్రజలకి సంకెలగా మారిపోయిన గతాన్ని విచ్ఛిన్నం చేసి అనాదిగా మానవుని కల సామ్యవాదాన్ని నిజం చేయగల శక్తి శ్రామికులకే ఉంది. ముఖ్యంగా  మతోన్మాదంతో చరిత్రని వక్రీకరించి ప్రచారం చేస్తున్న ఈనాడు రాహుల్ సాంకృత్యాయన్ రచనల్ని అధ్యయం చేసి ప్రతి వారు తమ చారిత్రక పరిజ్ఞానాన్ని పెంపొందించుకోవల్సిన అవసరం ఉంది.



# 15

# కుల సమస్య - రాహుల్జీ దృక్కోణం

– గౌరవ్





ప్రత్యేకంగా కుల సమస్యకి సంబంధించిన దృష్టి కోణాల్ని పరిశీలించడానికి ప్రత్యేకమైన కారణం ఉంది. ఐదేళ్ళ క్రితం రాహుల్జీ జన్మ గ్రామమైన పంథహ్ వెళ్ళినప్పుడు ఆయన మేనల్లుడు మాటల మధ్యలో రాహుల్జీ అంటే ఈనాటికీ అక్కడ గ్రామస్తులకు పెద్దగా ఇష్టం ఉండదని పేర్కొన్నారు. ఎందుకని అడగగా, ఆనాడే కాదు, ఈనాటికీ ఆ గ్రామంలో బ్రాహ్మణాధిక్యతే ఉందని చెబుతూ, ఇతరేతర ప్రాంతాలలో అత్యంత గౌరవించబడే రాహుల్జీ సొంత గడ్డపై విస్మరణకు గురవడానికి అదే ప్రధాన కారణం కావచ్చని అన్నారు.

ఆనాడు యథాలాపంగా నోట్స్‌లో రాసుకున్నానే కానీ ఆ మాటలు నా మనసులో బలంగా ముద్రించుకుపోయాయ్. కనైలీ, పంథహ్ గ్రామాలలోని రాహుల్జీ తల్లి తరపున, తండ్రి తరపున బంధువులని కలిసాను. రెండు చోట్లా చెరో లైబ్రరీని రాహుల్జీ పేరు మీద వాళ్ళు నడుపుతున్నారు. ఆ రెండు కుటుంబాలకీ సత్సంబంధాలు లేవు. అలాగే, రాహుల్జీ బంధువర్గానికి ఏకాభిప్రాయాలు కూడా లేవు.

ముఖ్యంగా రాహుల్జీ మొదట్నుంచీ భారత దేశంలో కుల వ్యవస్థ పట్ల తీవ్రమైన వ్యతిరేకత కలిగి ఉన్నాడు. ఆస్తికుడిగా ఉన్నప్పటి నుండి కూడా వర్ణాశ్రమ ధర్మాన్ని నిరసించాడు. ఇక నాస్తికుడిగా మారాక సరేసరి. జన్మతః బ్రాహ్మణుడిగా పుట్టినా ఏనాడూ ఆచార వ్యవహారాలు పాటించకపోగా జీవితాంతం వాటిని అపహాస్యం చేస్తూనే ఉన్నాడు.

భారతీయ సామాజిక చట్రంలో కుల సమస్య అత్యంత ముఖ్యమైనది. ఏప్రిల్‌లో జయంతులు జరుపుకుంటున్న మహాత్మా జోతిరావు ఫూలే, బాబాసాహెబ్ అంబేద్కర్ దృక్పథాలతో రాహుల్జీ భావాలని మదింపు వేయడం అవసరం. మహాత్మా జోతిరావు ఫూలే, బాబాసాహెబ్ అంబేద్కర్‌ల కులనిర్మూలన విధానాలని గౌరవిస్తూనే రాహుల్జీ కులసమస్య పరిష్కారానికి మార్క్సిజమే దారి చూపుతుందనే అభిప్రాయం కలిగి ఉన్నట్లు తెలుస్తుంది.

అయితే, అది శుద్ధ యాంత్రిక భౌతికవాద దృష్టితో మాత్రం కాదు. సామాజిక మార్పుని మానవీయమైన కోణంలో దర్శించే స్వతంత్ర లౌకిక విధానాల పట్ల సదాభిప్రాయం కలిగి ఉన్నాడు కనుకనే డా. బాబాసాహెబ్ అంబేద్కర్ బౌద్ధాన్ని స్వీకరించినపుడు దేశవ్యాప్తంగా ఉన్న వామపక్షాలు ఆయన చర్యని విమర్శించి, వ్యతిరేకించినా ఒక్కడుగా వెళ్ళి ఆయనకి తన మద్దతునిచ్చి ఏకంగా నవదీక్షిత బౌద్ధులనే వ్యాసం రాయగలిగాడు.

ఒక రకంగా కుల సమస్యని స్వతంత్ర పంథాలో శోధించి విశ్లేషించిన మొదటి మార్క్సిస్టు మేధావి డా. కె. బి. కృష్ణ, అలాగే బౌద్ధ దార్శనికుడు పి. లక్ష్మీ నరసు వంటి వారి కోవకే రాహుల్జీ చెందుతాడనేది నా అభిప్రాయం. ఎందుకంటే, సైద్ధాంతిక పరిశోధన కంటే దేశవ్యాప్తంగా ఆయన సముపార్జించిన అనితరసాధ్యమైన అనుభవాల సారమే ఈ దేశపు అణగారిన వర్గాల ప్రజల పక్షాన ఆయన్ని నిలిపింది. అందుకే సోషలిస్టు వ్యవస్థ కోసం జరిగే ప్రయత్నంలో క్రియాశీలకంగా భాగం అవుతూనే మానవీయ బౌద్ధ మార్గాన్ని సమానతా విధానంగా ప్రచారం చేసాడు.

ఇంకా చెప్పాలంటే రాహుల్జీ తన ప్రమాదకర యాత్రల ద్వారా ఈ దేశానికి తీసుకొని వచ్చిన అపూర్వమైన ప్రాచీన తాళపత్రాలు తదితర సారస్వత సంపదని చూసి నోరెళ్ళబెట్టి ఆయన కృషికి లభిస్తోన్న గుర్తింపుని జీర్ణించుకోలేక అసూయతో విషం చిమ్మిన అత్యధికులు బ్రాహ్మణులే. బ్రహ్మణత్వాన్ని సంపూర్ణంగా త్యజించిన రాహుల్జీని ఆ మూకలు జీవితాంతం ద్వేషంతో చూసి శత్రుత్వాన్ని పెంచుకుని ఆయనపై తోచిన ప్రచారాలు చేసారు. ఎంత కాదనుకున్నా అదాయన దారికి ఎంతో కొంత అడ్డంకిగా ఉండేదనడంలో సందేహం లేదు.

గాంధీజి హరిజనులనే పదాన్ని తీవ్రంగా నిరసించడం మొదలు అగ్ర కులాల ఆధిపత్య ధోరణులను అడుగడుగునా కడిగిపారేసిన రాహుల్జీ కుల నిర్మూలన దృక్పథానికి కట్టుబడి ఉన్నాడు. కాగా, ఈ రోజు ఆయన ఎన్నడో త్యజించిన కులాన్ని తిరిగి ఆయనకి అంటగట్టే వంకర బుద్ధిగల వక్ర భాష్యకారులు తయారయ్యారు.

అంబేద్కర్ పేరు చెప్పి గాంధీని, గాంధీ పేరు చెప్పి ఫూలేని, ఫూలే ఫొటోతో రాహుల్జీని ఇలా అందరిపై కులతత్వంతో విషం చిమ్మే ఈ మూకలది మరో విద్వేష మతానే తప్పా మరోటి కాదు. పుట్టిన కులాన్ని, పెరిగిన మతాన్ని, తిరిగిన వర్గాన్ని కాదనుకుని విశ్వనరుడిగా ఎదిగిన రాహుల్జీకి కులమతాల్ని అంటగట్టి అవమానించడం కంటే ఘోరమైన తప్పిదం మరోటి లేదు.

ఆ మాటకొస్తే గతితార్కిక చారిత్రక దృష్టితో మానవ పరిణామం మొత్తాన్ని అధ్యయనం చేసిన రాహుల్జీ సోషలిజంతోనే కులరహిత సమాజం సాధ్యమని నమ్మాడు కనుకనే చివరి వరకూ ఆ భావాలని బలపరుస్తూ వాటికే కట్టుబడి ఉన్నాడు. ఆయన జీవితంతోనూ, రచనలతోనూ ఏమాత్రం సంబంధం ఉన్నవారికైనా ఈ విషయం తేలిగ్గానే అర్థమౌతుంది.

చివరగా రాహుల్జీ, అంబేద్కర్ ల్ని పోలుస్తూ గతంలో రాసిన ప్రసంగ వ్యాసంలో ఆ ఇరువురినీ భారతదేశపు కుల నిర్మూలన ఇరుసులుగా పేర్కొన్నాను. అంతేకాదు, రాహుల్జీ, అంబేద్కర్లు ఇరువురినీ బౌద్ధం పట్ల ఆకర్షితులయ్యేలా చేసిన బౌద్ధ బిక్షువు బోధానంద కచ్చితమైన కులనిర్మూలన వాది. బాల్యంలోనే దుర్మార్గమైన వర్ణ ధర్మాలకి వ్యతిరేకంగా ధ్వజమెత్తినవాడు.

మహాత్మా జోతిరావు ఫూలే, బాబా సాహెబ్ అంబేద్కర్ల కృషిని గౌరవిస్తూనే మహా పండిత్ రాహుల్ సాంకృత్యాయన్ దృక్పథం పట్ల ఒక నిర్మాణాత్మకమైన వైఖరి కలిగి ఉండటం, ముఖ్యంగా కులతత్వం, మతోన్మాదం చెలరేగిపోతున్న సమయంలో చాలా అవసరం అనేది నా అభిప్రాయం. అందులో భాగంగా రాహుల్జీ జీవితం గురించి మరింత సుసంపన్నమైన సమగ్ర అధ్యయనాలు, పరిశోధనలు చేయడం ఎంతైనా అవసరం.



# 16

# నిత్య సత్యాన్వేషణా గరిష్ఠుడు రాహుల్ సాంకృత్యాయన్

**హిందీ మూలం : విశ్వనాథ్ మిశ్రా,** రాహుల్ ఫౌండేషన్, లక్నో
**తెలుగు : వేణుగోపాల్ వర్మ,** మానవ వికాస వేదిక, మహబూబ్ నగర్, 9908825459

కారుచీకట్లు రాజ్యమేలుతున్న కాలంలో, వ్యవస్థలు పతనమవుతూ, ప్రజల సామాజిక జీవనం పరాయీకరించబడుతున్న పరిస్థితులలో సంఘర్షించి సత్యాన్ని అన్వేషించే సాహసాన్ని, దృక్పథాన్ని బోధించే వ్యక్తిత్వాల అవసరం ఇపుడు ఎంతైనా ఉంది. మహా పండితుడు, చరిత్రకారుడు, బౌద్ధ పరిశోధకుడు, విమర్శకుడు, సాహిత్యకారుడు, బహుభాషావేత్త, మార్క్సిస్ట్ ఆలోచనాపరుడు అయిన రాహుల్ సాంకృత్యాయన్ జీవితం, కృషిని స్మరించుకోవడం వలన మళ్ళీ మార్గదర్శకత్వం లభిస్తుంది.

మనం తిరోగమనవాదులు, సనాతన సాంప్రదాయ శక్తులతో సంఘర్షించినపుడు మాత్రమే రాహుల్‌జీకి నిజమైన నివాళి ఇచ్చినవార మవుతాము. ప్రజాహితానికి, సంస్కరణాభిలాషకి దుర్భేధ్యమైన రక్షణ గోడ నిర్మించడం ద్వారా మాత్రమే మన పూర్వీకుల అభ్యుదయ పరంపరకి అర్హులమయిన వారసులం కాగలము.

రాహుల్ సాంకృత్యాయన్ గొప్ప ప్రయోగాత్మక దృష్టితో, యథాస్థితివాద వ్యతిరేక కార్యక్రమాన్ని, సామాజిక, సాంస్కృతిక రంగాలతో నిరంతరం విప్లవ భావాలను ప్రసరింపజేసాడు. ప్రజా క్షేత్రాలే ఆయన కార్యరంగం. నిరంతరం గమనం, భ్రమణం, నిత్యప్రగతే రాహుల్‌జీ యొక్క జీవితసారం, సందేశం. సమాజ ప్రగతికి ఆటంకం కలిగించే అన్ని ప్రతికూల ధోరణులను, చీల్చి చెండాడటం, ఆయన విప్లవ భావాల లక్ష్యంగా ఉండేది.

అన్ని రకాల సంకుచిత భావాలను, గతం పట్ల గల గుడ్డి వ్యామోహాన్ని, యధాస్థితివాదాన్ని, మూఢ పరంపరలను, అభివృద్ధి నిరోధక విలువలను తనకి శత్రువులుగా ప్రకటించినవాడు. హేతువాదం, విజ్ఞానాల పట్ల అపారమైన నమ్మకం, ఆసక్తి ఉన్నవాడు. చివరివరకూ ప్రజా సంఘాలతో, ఉద్యమాలతో సావాసం చేస్తూ స్ఫూర్తిపొందినవాడు. మాటలకు – చేతలకు, సిద్ధాంతానికి, ఆచరణకి మధ్య హద్దులు చెరిపేసి జీవించిన ఆదర్శవాదిగా, నిజమైన విప్లవకారుడుగా, అభ్యుదయవాదిగా జీవించిన మేధావి రాహుల్ సాంకృత్యాయన్.

చరిత్రకారుడుగా, పురాతత్వవేత్తగా, సాహిత్యకారుడుగా, దార్శనికుడిగా, మార్క్సిస్ట్ భావాల ప్రచారంగా జీవితాన్ని గడిపిన ఆయన ప్రజలకు ఎపుడూ దూరం కాలేదు. ' 'పారిపోవడం కాదు, ప్రపంచాన్ని మార్చేందుకు ప్రయత్నించాలి" అనే సూత్రాన్ని ఆకళింపు చేసుకున్న ప్రజానేతగా కూడా ఆయన సేవలందించారు. స్వతంత్ర పోరాటంలో, బీహార్ రైతు ఉద్యమాలలో ఆయన ప్రత్యక్షంగా నాయకత్వం వహించి ముందు ఉండేవారు.

రోజురోజుకు వ్యవస్థలను విచ్ఛిన్నం చేస్తూ, వెర్రిగా వేయి తలలతో బలపడుతున్న పెట్టుబడి యొక్క ఆధిపత్యాన్ని, ఫాసిస్ట్ శక్తులను ఓడించాలన్నా, ప్రజల్లో పేరుకుపోతున్న నిర్లక్ష్యం, ఆలోచనా రాహిత్యం, జఢత్వం, పెడధోరణులవల్ల సామాజిక జీవనానికి జరిగే నష్టాలను నివారించాలన్నా, అందుకు విప్లవ కార్యాచరణ చాలా బలంగా, తుఫాన్ వేగంతో ఉండాలని రాహుల్‌జీ కాంక్షించారు. సరిగ్గా అలాగే నూతన విప్లవ ప్రబోధంతో, పునరుజ్జీవన కాంక్షతో, సరికొత్త కార్యాచరణ, ప్రణాళికలతో సంసిద్ధమవుతూ ఉంటే తప్ప రాహుల్‌జీ మిషన్‌ను ముందుకు తీసుకెళ్ళడం సాధ్యం కాదు. ఇలాంటి లక్ష్యాలతో ఎవరు పనిచేసినా అది ఆయన మిషన్‌కు ప్రాసంగికతను, సార్థకతను చేకూర్చినవారవుతారు. కొత్త ఒరవడితో సామాజిక ఉద్యమాలు నిర్మించే క్రమంలో ప్రజా సంఘాలకు గానీ, సాంస్కృతిక వాదం, పిడివాదం, మత ఛాందసవాదం, నిరంకుశత్వం, ఆధిపత్య వాదాలతో శక్తిమేరకు పోరాడుతూనే తమ కనీస బాధ్యత నిర్వహిస్తున్నవారు అదే విధంగా దీర్ఘకాలిక లక్ష్యాలైన సామాజిక, సాంస్కృతిక రంగాల సమూల మార్పుకోసం

నిర్మాణాత్మకంగా వ్యవహరించాలి. ప్రగతి కాముకులైన దేశ ప్రజలందరూ ఈ విప్లవ వారసత్వాన్ని చేపట్టాలి. సంస్కరణకు వారసులుగా ముందుకు కదలాలి. రాహుల్ జీ ఈ పరిణామ క్రమానికి, పరివర్తనా ఉద్యమాలకు సంధాన కర్తగా జీవించిన ధీశాలి. ఒకపక్క సనాతనవాదులు, మత చాంధసులు మరోపక్క రాజకీయంగా ఆధిపత్యవాదులు, ఫాసిస్ట్ శక్తులు బలపడుతున్న ప్రస్తుత తరుణంలో ఒక శాస్త్రీయ జీవన విధానాన్ని, ఆలోచనా విధానాన్ని బోధించే ప్రవక్తగా, భౌతికవాద ప్రచారకుడుగా, సైన్స్ – హేతువాదాల ప్రోత్సాహకుడుగా, చరిత్ర పట్ల భౌతికవాద దృష్టిని సమర్ధించే విజ్ఞానిగా రాహుల్ సాంకృత్యాయన్ నేడు ఎంతో ప్రాముఖ్యత కలిగిన వ్యక్తి. అయితే ఆయన కాలానికంటే ఈరోజు రాహుల్ జీ మిషన్‌ను ముందుకు నడపడం కొంత ప్రమాదకరమే అయినప్పటికీ అలాంటి ప్రమాదాలను ఎదుర్కోవడం కూడా ఆయన నుండే నేర్చుకోవాలి. అపుడే మనం "విప్లవ స్ఫూర్తిని తిరిగి జాగృతం చేయగలము."

భారతదేశ చారిత్రక, సాంస్కృతిక రంగాలకు తన వాస్తవిక దృష్టితో పరిశోధించి ఎన్నో ఆధారాలను, సమాచారాన్ని అందించిన రాహుల్ సాంకృత్యాయన్‌కు చరిత్రకారుడుగా, చారిత్రక సాహిత్యకారుడుగా దక్కాల్సిన గౌరవం దక్కలేదనే చెప్పాలి. ఆయన సాహిత్యం యొక్క సమగ్ర మూల్యాంకనం జరగనే లేదు. చారిత్రక దృష్టి, గతి తార్కిక భౌతికవాద దృష్టి, లోపించిన చరిత్రకారులే ఆయనకు సముచిత ప్రాధాన్యత కలగకుండా ఆయన కృషి పట్ల తీవ్ర ఉపేక్షా భావం ప్రదర్శించారు. లేదా చాలా తక్కువగా ఆయన పాత్రను కుదించి చెప్పారు. అందుకు ఏవో కొన్ని విరుద్ధ అంశాలని, అసంగతాలని, సాకుగా చూపి వాటిని విపరీత వ్యాఖ్యానాలతో అలంకరించి ఆయన పరిశోధక కృషిని మొత్తాన్ని కాల్పనిక సాహిత్య రచయితగానే గుర్తిస్తూ, మోసగించారు. ఆయనకు ఆయన రచనలలో లెక్కలోకి రాని దోషాలకు కూడా బాగా ప్రచారాన్ని కల్పించి చెప్పడం ద్వారా కూడా చాలా అన్యాయం జరిగింది. అయినా ప్రజా సాంస్కృతిక ఉద్యమాలను, రాహుల్ సాంకృత్యాయన్ రచనా వ్యాసాంగాన్ని గుమ్మానికి అవతల నిలబెట్టడం తిరోగమనవాదులకు సాధ్యం కాలేదు.

చరిత్ర మరియు భాషల యొక్క పరిణామానికి సంబంధించి ఆయన ప్రతిపాదనలు కొన్ని ఆధునిక ప్రమాణాలకు తగ్గట్టుగా లేకపోవచ్చు. లేదా వాటితో మనకి ఏకీభావం లేకపోవచ్చు. కానీ ఆయా రంగాల్లో ఆయన లోతైన అధ్యయనం, పరిశోధన, సమాచారాన్ని సేకరించిన విషయంలో అనుసరించిన పద్ధతులు, పరిశోధక దృష్టి నిస్సందేహంగా ఆయనకు చరిత్రకారుడుగా ఒక స్థానాన్ని కట్టబెడతాయి.

బహుశా భారతదేశ చరిత్రను గతితార్కిక భౌతికవాద కోణంలో అధ్యయనం చేసిన మొదటి భారతీయ చరిత్రకారుడు రాహుల్‌జీయే కావచ్చును. ఆయన చరిత్ర రచనను ఒక ఫక్తు అకాడమిక్ కసరత్తుగా చూడకుండా, భవిష్యత్ చరిత్ర నిర్మాణానికి ఒక సాధనంగా భావించాడు. అంతేకాకుండా చరిత్ర రచనలో వలసవాదులు పాటించిన విధానాలు, పాశ్చాత్య ఇండాలజిస్ట్‌ల దృష్టికోణం, భావనలకు భిన్నంగా, ఎలాంటి ముందస్తు నిర్ధారణలకు రాకుండా, పక్షపాత రహితంగా వ్యవహరించారు. చరిత్ర రచనకు సంబంధించిన మౌళిక అంశాలను ఎక్కడా విస్మరించకుండా, భారతీయ చరిత్ర మరియు సంస్కృతుల అధ్యయనానికి ఇక్కడి జాతులు, తెగలకు సంబంధించి వివిధ ప్రజా సమూహాల మూలాలను ఆధారం చేసుకున్నారు. తన జీవిత పర్యంతం చరిత్ర అధ్యయనానికి, సామాజిక, ఆర్థిక, విశ్లేషణలు కొనసాగిస్తూనే ఉన్నారు. బూర్జువా జాతీయవాద చరిత్రకారుల కంటే భిన్నమైన చారిత్రక దృష్టితో, ప్రాచీన, మధ్యయుగాలు భారతీయ తాత్విక – సైద్ధాంతిక, చింతనా పరంపరని, సంపత్తిని, గతం యెంతో ఘనమైనదనే భావనతో కాకుండా భౌతికవాద దృష్టితో పరికించి, ప్రాచీన భారతీయ తాత్విక చింతనా వారసత్వంలో భాగంగా ఉన్న సుసంపన్నమైన భౌతికవాద భావదృష్టిని ప్రపంచానికి పరిచయం చేసిన ఘనుడు రాహుల్‌జీ. "ప్రజలే చరిత్ర నిర్మాతలు" అనే సత్యాన్ని సాహిత్య చరిత్రకు కూడా వర్తింపచేసి విజయం సాధించారు. ఆయన ఆ విధంగా హిందీ సాహిత్య చరిత్రలో ఎనిమిదో శతాబ్దం నుండి పదమూడో శతాబ్దం వరకూ గల కావ్య సాహిత్యంలో అపభ్రంశ భాషా కావ్యాలకు కూడా చోటు కల్పించారు. (ఆ అపభ్రంశ భాషల నుండే ప్రస్తుత హిందీ భాష కూడా

ఆవిర్భవించింది) ఈ కాలావధిని "సిద్దులు - సామంతుల యుగం" అని నామకరణం చేసి, అపభ్రంశ భాషా సాహిత్యాన్ని ప్రజా సాహిత్యంగా పిలిచి గౌరవించాడు. తన సుప్రసిద్ధ రచన (హిందీ కావ్య పరంపర) "హిందీ కావ్యధార" యొక్క ముందుమాటలో "కవిత్వాన్ని, భూమియొక్క ఉత్పత్తి"గా ప్రకటిస్తూ ఆ కవిత్వ కాలాన్ని అప్పటి యుగ లక్షణాలను అనుసరించి, కవిత్వ ప్రయోజనాన్ని సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, ధార్మిక నేపధ్యాలతో విశ్లేషించారు.

రాహుల్‌జీ తన చారిత్రక నవలలు, కథల ద్వారా ప్రాచీన కాలానికి చెందిన అభ్యుదయ పోకడలను, సంస్కరణా భావాల నుండి నేటితరం పాఠకులు స్ఫూర్తిని, ప్రేరణను పొందే విధంగా చిత్రించేవారు. "సింహసేనాపతి" మరియు "జయయోధేయ" వంటి చారిత్రక నవలల్లో ఆ కాలానికి సంబంధించిన ఉత్పత్తి సంబంధాలను, సామాజిక ప్రజా జీవితాలకు సంబంధించిన వివిధ పార్శ్వాలను నిశితంగా వివరిస్తూ, గతానికి చెందిన ప్రగతిశీల ప్రయత్నాలను చారిత్రక భౌతికవాద దృష్టితో వర్ణించేవారు. రాహుల్‌జీ రచనల్లో చరిత్రకు ఆపాదించిన కాల్పనికత, విమర్శనాత్మకంగానూ, మరియు వివేకపూరితంగానూ ఉంటుంది.

తన రచన "ఓల్గా నుండి గంగ వరకూ"లో వర్ణించిన చరిత్ర కథలలో గతితార్కిక భౌతికవాద దృష్టితో చరిత్రను విశ్లేషించడమే కాకుండా, ప్రాచీన కమ్యూన్ సమాజాల నుండి, ఆధునిక పెట్టుబడిదారీ యుగం వరకూ గల కాలక్రమాన్ని, సామాజిక, సాంస్కృతిక, నైతిక, రాజకీయ, రంగాల ఆధారంగా పరిచయం చేయడం చాలా అనితర సాధ్యమైన ప్రయత్నం. ఎంతో అభినందనీయమైనది కూడా కానీ రామ్ విలాస్ శర్మలాంటి కొందరు సాహిత్యకారులు ఈ కథల్లో వ్యక్తమయిన స్త్రీ-పురుష స్వేచ్ఛా సంబంధాలను అనైతికమయినవి, చరిత్ర వ్యతిరేక దృష్టితో వర్ణించబడినవని వాదించ చూస్తారు. నిజానికి ఆదిమ సమాజపు జీవన విలువలను, ఆధునిక, వర్తమాన సమాజ నైతిక నియమావళి ఆధారంగా నిర్ధారించడం వాస్తవిక దృష్టి లోపించినప్పుడే సాధ్యం.

హిందీ సాహిత్యంలో ప్రేమ్‌చంద్, భారతీయ సామాజిక, దురవస్థయొక్క పరిష్కార మార్గాలు తన ఆదర్శవాద, సంస్కరణవాద దృష్టితో అన్వేషిస్తున్న కాలంలోనే, రాహుల్ సాంకృత్యాయన్ ఇరవై రెండో శతాబ్దపు ఆదర్శ రాజ్యాన్ని (యుటోపియా) ఆవిష్కరించాడు. ఈ తరహా రచనలకు గానూ ఆయనే మార్గదర్శక రచయితగా పేరొందాడు. తన ఇరవై రెండవ శతాబ్దపు కల్పన ద్వారా సామాజిక ప్రగతికి సంబంధించి తన భావాల, ఆలోచనల దిశను, దశను స్పష్టం చేశాడు. ఆ కల్పన ఎలాంటిదో తన మాటల్లోనే చూడండి, ఇది ఎలాంటి శతాబ్దంగా ఉంటుందంటే... స్త్రీలు అధికమొత్తంలో తమ హక్కులు సాధించుకుంటారు. అభివృద్ధి వ్యతిరేక, మూఢత్వ పోషక మూలాలు నశించిపోతాయి, ధనికులు ప్రాధేయపడే రోజులు వస్తాయి. హీనమైన పనుల కోసం నిర్దేశించబడిన వృత్తులు, కులాలు అంతరించిపోతాయి. వస్తువుల యొక్క ధరలు దేశపు అవసరాలకు అనుగుణంగా నిర్దేశించబడతాయి. వ్యక్తుల నియంతృత్వపోకడలు అంతమవుతాయి. బికారులు, పూజారులు, వేశ్యలు లేని సమాజం రాబోతుంది. అది ప్రభువులు – పాలేర్లు లేని కాలంగా ఉండబోతోంది. కట్నకానుకలు, నృత్యాలు, గారడీ వేషాలు ఇక అవసరం పడవు. వీరులు – దేవతలు అక్కడ ఆరాధించబడరు. వర్ణ, కుల బేధాలు కనుమరుగవుతాయి. సరిగ్గా అదే ఇరవై రెండో శతాబ్దం" అంటారు రాహుల్‌జీ.

శతాబ్దాల పాటు సామాజిక వెనుకబాటుతనం, సంకుచితత్వం మరియు అనేక అపసవ్య ధోరణులతో కునారిల్లుతున్న భారతీయ సమాజాన్ని ప్రగతిపథంలో ముందుకు నడిపేదెలా అనే చింతనే ఆయనను కల్పనను ఆశ్రయించి చరిత్రను కథలుగా అల్లేందుకు పురికొల్పింది. కళాదృష్టికి ఆయన ఎపుడు ప్రాధాన్యత ఇవ్వలేదు. ఆయన తన సాహిత్య ప్రయోజనాలను కేవలం కళాదృష్టికి బలిపెట్టాలని చూడలేదు. తన రచనల ద్వారా ఆయన ఆశించిన లక్ష్యాలను, భావాలను, మార్పును ఏదో ఒక ఆవరణ క్రింద దాచి పెట్టాలనే ప్రయత్నమూ చేయలేదు.

ఆయన చాలా స్పష్టంగా ఇలా అంటారు. "నా నవలలు, కథలు. ఒక ప్రాపగాండాతో కూడి ఉంటాయనే అభిప్రాయం ఉన్నవారు అది

నిరూపించేందుకు వేరేగా ప్రయత్నించవలసిన అవసరం లేదు. కొన్ని ఆదర్శాల దిశగా నా పాఠకులను ప్రేరేపించడమే నా రచనల ముఖ్య ఉద్దేశ్యం. ఆ భావనలు లేకుండా నా రచనలు ఉండలేవు. మిత్రులు దాన్ని ప్రాపగాండాగా భావించినా సరే అలా రాయడం నా బలహీనత."

రాహుల్ జీ యొక్క సాహిత్యానికి చారిత్రకంగా ఉన్న ప్రాముఖ్యత, కేవలం దానిని కళాత్మక స్థాయికి అంచనా వేస్తూ నిర్దేశించబడేది కాదు. ఆయన సాహిత్యక దృష్టి అంతకు పూర్వపు సాహిత్య, భావజాల వాతావరణం నుండి ప్రభావితం అయినదని చెప్పడానికి ఋజువులు లేవు. ఎందుకంటే ఆయన కాలానికి వలసవాదుల పాలనతో ఉన్న భారతదేశ సమాజంలో యూరప్ లేదా రష్యా విప్లవ సాహిత్య ప్రభావమేదీ అప్పటి సమాజం మీద లేదు. అయినప్పటికీ సోషలిస్ట్, రియలిస్ట్ దృక్పథంతో ఆయన రచనా వ్యాసంగం అనే దిశలో నిరాటంకంగా సాగిపోయింది. సాహిత్యపు కళాత్మక పార్శ్వాన్ని అంతగా లెక్కచేయకపోయినప్పటికీ, మానవ జీవితం అందలి సంఘర్షణకు సంబంధించిన ఆంతరంగిక సౌందర్యాన్ని ఆయన వర్ణించిన తీరు అత్యద్భుతంగా ఉంటుంది. ఈ సౌందర్యశాస్త్రం అర్థం కావాలంటే, చారిత్రక నేపథ్యంతో, సమాజ పరిణామాన్ని అర్థం చేసుకోగల మరియు ప్రజాపక్షం వహించే వైజ్ఞానిక దృష్టి ఉండాలి.

హిందీకి సంబంధించి ఆత్మకథా సాహిత్యానికి, ఆయన ఆత్మకథ "నా జీవితయాత్ర" ఒక మార్గదర్శక రచనగా నిలబడుతుంది. స్పష్టమైన ఉద్దేశ్యం, వాస్తవిక దృష్టి మరియు ఆత్మావలోకానికి కావలసిన నిర్భయత్వం కలిగి సృజనాత్మక సాహిత్యంలో ఒక ప్రామాణిక రచనగా ఆయన ఆత్మకథ చోటు సంపాదించింది. ఆయన ఇతర రచనలయిన మార్క్స్, లెనిన్, స్టాలిన్, మరియు మావోల యొక్క జీవిత చరిత్రలు ఇటు చరిత్ర, అటు సాహిత్యానికి సంబంధించిన అన్ని ప్రమాణాలకు ధీటుగా నిలబడగలవు. తనకు సమకాలికులైన ఎందరో అభ్యుదయ వాదుల జీవితాలను కూడా జీవిత చరిత్రలుగా మలిచిన తీరు ప్రశంసనీయంగా ఉంది. పీడిత వర్గ విప్లవాశయాలు, సోషలిస్ట్ భావజాలం

ఇంకా అనేక చారిత్రక అంశాలను ఒక తరం మొత్తానికి పరిచయం చేసిన ఘనత ఆయన రచనలది.

రాహుల్ సాంకృత్యాయన్‌కి సంబంధించి, అన్వేషణా ప్రవృత్తి మరియు యాత్ర ప్రవృత్తి రెండూ అవిభాజ్యాలు. ఇక్కడి మత సంకుచిత వాదం మనిషి యాత్రా ప్రవృత్తిని, కొత్త ప్రదేశాలు అన్వేషించే ఆసక్తులను అణచివేసిందని చెప్పాలి. కానీ రాహుల్‌జీ దృష్టిలో ప్రపంచాన్ని చూసేది, తెలుసుకునేది, మార్చేది, నిర్మించేది యాత్రికుడే. ఆయన మాటల్లో చెప్పాలంటే "యాత్రికుల ప్రయాణం ప్రపంచమంతా సాగకపోయి ఉంటే మానవ జాతులు నిద్రాణంగా, పశువుల జీవన స్థాయిని దాటి ఎదిగేవి కావు."

భాష విషయంలో రాహుల్‌జీ అభిప్రాయాలు అంత సముచితమైనవి కావు. "ప్రజా సమూహాలే భాషల ఉత్పాదక శక్తులు" అని భావించే ఆయన ఇంగ్లీషు భాషను, దాని వలసవాద సాహిత్యాన్ని తీవ్రంగా నిరసించాడు. ఇంగ్లీష్‌ను జాతీయ భాషగా ఆయన ఎపుడూ ఆమోదించలేదు. భారతదేశానికి, జాతీయ భాషగా, మరియు సంధి భాషగా (దేశవ్యాప్త వ్యవహారిక భాషగా) ఉండబోయే భాష సమస్యను పరిష్కరించడంలో తొందరపాటును ప్రదర్శించారు. ఆయన దృష్టిలో బహుళ రాష్ట్రాలు, బహుళ భాషలు కలిగిన సోవియట్ రష్యా సమాజం, తమ జాతీయ భాషగా రష్యన్ భాషను ఎంచుకున్న మాదిరిగానే ఇక్కడి భారతీయ సమాజం హిందీకి ఆ స్థానం కట్టబెట్టి జాతీయ భాషగా వ్యవహరించాలనేది, ఆయన వాదనగా ఉండేది. అయితే సంస్కృతానికి నకలు భాషగా ఉన్న హిందీని ఇక్కడి, బహుళ భాషా సంస్కృతుల సమాజంలో పై నుండి పాలకవర్గాల నుండి ప్రజలపై రుద్దడం సమంజసం ఎలా అవుతుంది.

అయినప్పటికీ రాహుల్‌జీ భాషాపరంగా పిడివాది కాదు, భాషోన్మాదపు ఛాయలేవి ఆయనలో ఉండేవి కావు. అన్ని భారతీయ భాషలు సమున్నతంగా అభివృద్ధి చెందాలని కాంక్షించినవాడు ఆయన. అల్ప సంఖ్యాక వర్గాల యొక్క భాషా సంస్కృతులు కూడా అంతే విధిగా రక్షించబడాలనే విశాల దృక్పథం ఆయనకుండేది.

ప్రపంచపు సర్వోన్నత సంస్కృతులన్నింటి పట్ల, అవగాహన ఉన్న రాహుల్‌జీ, భారతీయ సమాజాన్ని సంస్కరణ బాట పట్టించే విధంగా ప్రేరేపించేందుకు తన రచనలలో సామాన్య వ్యవహారిక భాషను ఎక్కువగా ఉపయోగించేవారు. ఆయన నేరుగా ప్రజలతో సంభాషిస్తూ చాలా సరళంగా చేసిన రచనలు... దిమాగీ గులామ్ (మేథో బానిసత్వం), భాగోనహీ, దునియా కో బదలో (పారిపోకు, ప్రపంచాన్ని మార్చు), సామ్యవాద్ హీ క్యోం (సామ్యవాదమే ఎందుకంటే) మొ॥ సామాన్య ప్రజల నుద్దేశించి ఇచ్చిన సందేశాత్మక రచనలు. ఆ విధంగా ప్రస్తుత రాజకీయ పరిస్థితులను, అందులో రావాల్సిన మార్పులను, ప్రత్యామ్నాయాలను, ప్రజల నుండి తాను ఆశించే సామాజిక, సాంస్కృతిక చైతన్యాన్ని ఆయన నిరంతరం ప్రజలకు బోధించేవారు.

మొత్తంగా రాహుల్ సాంకృత్యాయన్ తన వ్యక్తిత్వం మరియు రచనల ద్వారా కొత్తదారులను అన్వేషించారు. కొత్త ప్రాతిపదికలకు పునాది వేసారు. విభిన్న అంశాలు, రంగాలు, నేపథ్యాలకు ప్రాధాన్యత ఇచ్చి అత్యంత ఎక్కువగా, అత్యంత వేగంగా వాడిగా, వేడిగా, భావాభినివేశంతో వ్రాయడం వలన అక్కడక్కడ కొన్ని సందర్భాల్లో పరస్పరం విరుద్ధ అంశాలో, భావాలో చోటు చేసుకోవడాన్ని సహజమైన విషయంగానే భావించాలి. తన రచనాత్మక ఉద్వేగంలో తడబాటును సమగ్రదృష్టితో అర్థం చేసుకోవాలి. చరిత్ర పట్ల ఆయన అవగాహన ప్రయోగాత్మకమైనది.

తమ నాయకులను, యజమానులను, అధిభౌతిక దృష్టితో మహిమాన్విత పరిచి దేవతలుగా, ఋషులుగా, మహాపురుషులుగా ప్రతిష్టింపచూసే చరిత్రకారులకు, విమర్శకులకు, రాహుల్‌జీ యొక్క ప్రయోగాత్మక, భౌతికవాద దృష్టికోణం మింగుడుపడదు.

అందుకే ప్రస్తుత పరిస్థితుల్లోనైనా రాహుల్ సాంకృత్యాయన్ యొక్క చారిత్రక ప్రాముఖ్యతను గుర్తించి, ఆయన జీవితాన్ని, సాహిత్యాన్ని మరోసారి ప్రజల ముందుకు తేవడం అత్యవసరంగా భావిస్తున్నాను. ఒక కొత్త భావ సాంస్కృతిక విప్లవోద్యమం కొరకు ఆయనని ఆవాహనం చేసుకోవడం నేటి

తరానికి తక్షణ కర్తవ్యం. రాహుల్‌జీ చరిత్రలో ఒక సంధికాలానికి సాక్ష్యంగా జీవించినవాడు, అప్పటి స్వాతంత్ర్యోద్యమ పరిధిని, పరిమితిని అర్థం చేసుకున్నవాడుగా, ఆనాటి బలమైన జాతీయవాద ప్రభావాన్ని, ప్రలోభాన్ని సైతం దాటి ముందుకు వెళ్ళి, శ్రామిక, పీడిత వర్గాల విముక్తికోసం ఒక సరికొత్త సామాజిక, సాంస్కృతిక విప్లవానికి నాయకత్వం వహించాడు. తుఫాన్ వేగంతో రావాల్సిన మార్పుల కోసం స్వాగతగీతాలాలపించాడు. మూస ధోరణులకు తల వంచలేదు. నవీన సామాజిక సందర్భాన్ని నవీన దృష్టితో ఆహ్వానించి, ప్రజాస్వామిక భావనలను, విమర్శనాత్మక వివేచనను ప్రతిష్ఠించినవాడు.

ఇకనైనా సమాజంలో అభివృద్ధి నిరోధకాలుగా పనిచేస్తున్న చైతన్య రాహిత్యాన్ని, అహేతుకతను విడనాడాలి. అవకాశవాద శక్తుల ఆట కట్టించాలి. అందుకే రాహుల్‌జీని స్మరించుకోవాలి. మూఢత్వాన్ని పిడివాదాన్ని బద్దలుకొట్టే సాహసం ఆయన నుండి పొందాలి. అలుపెరగని శాస్త్రీయ దృక్పథపు ప్రచార నైపుణ్యం ఆయన నుండి అందుకోవాలి. ప్రజాపక్షం వహించిన ఆయన తార్కిక బుద్ధిని తవ్వి తీసుకోవాలి. సానుకూలమైన చారిత్రక అవగాహన అలవర్చుకోవాలి. ఆచరణావాదాన్ని పెంపొందించుకోవాలి. విప్లవోద్యమం వైపు, రాబోయే పునరుజ్జీవన కాలంవైపు ఎలాంటి సంకోచాలు లేకుండా నిర్భయంగా సాగిపోయిన ఆయన అడుగుజాడల వెంట పరుగులు తీయడమే నేటి మన తక్షణ కర్తవ్యం కావాలి.



# 17

# మహా మనీషి రాహుల్‌జీ

– **వై. వేణుగోపాల్ రెడ్డి,** న్యాయవాది, హైదరాబాద్, 9441927880

రాహుల్ సాంకృత్యాయన్ మహా పండితుడు, మార్క్సిస్టు, మేధావి, స్వాతంత్ర్య సమరయోధుడు, పలుసార్లు పోరాటాలలో జైలుకెళ్ళాడు. "మానవజాతి ప్రగతివైపు సాగించిన ప్రతి అడుగూ రక్తతర్పణంతోనే సాగింది. మానవ రక్తం ఇంత ప్రవహించడానికి అన్ని మతాల ధర్మాచార్యులే కారణం, వారే బాధ్యులు. యే ఒక్క మతమూ, యే ఒక్క మతాచార్యుడూ, గర్వపడవలసింది ఏమీ లేదు." అని చారిత్రక ఆధారాలతో రుజువు చేసిన మహాపండితుడు రాహుల్జీ. తెలుగు పాఠకులకు బాగా తెలుసు, ఇప్పటి తరానికి కూడా పరిచయం చేయాలనే ఉద్దేశంతో, తెనాలికి చెందిన "ప్రజ్వలిత" సాంస్కృతిక, సాహిత్య సంస్థ అధ్యక్షుడు, అప్పట్లో ఆ సంస్థ కార్యదర్శిగా ఉన్న నేను తెనాలిలో ఒక భారీ సభకు ప్రణాళిక వేశాం. అయితే కాలం హఠాత్తుగా వేసిన కాటుకు, కరోనా దెబ్బతో మిత్రుడు సంస్థ అధ్యక్షుడు అయిన నాగళ్ళ దుర్గాప్రసాద్ శాశ్వతంగా సెలవు తీసుకుని మరణించారు. రాహుల్ సాంకృత్యాయన్ గురించి ఇప్పటి తరానికి తెలియవలసింది చాలా ఉంది. ఓల్గా నుండి గంగకు దగ్గర్నుండి ప్రాక్పశ్చిమ దర్శనాల వరకు అన్ని గ్రంథాలు మళ్ళీ ఒకసారి పునశ్చరణ చేసుకోవలసిన తరుణం. ఆయన 45 యేళ్ళు ప్రయాణంలో ఉంటూనే సాగించిన రచనా ప్రయాణాన్ని, వాటిలో ఆయన పొందుపరిచిన చారిత్రక, సాంస్కృతిక సత్యాలను మరల ఒకసారి మననం చేసుకోవాలి. మొదట ఆర్య సమాజ్ స్థాపకుడు స్వామి దయానంద సరస్వతి ఆచరణలను నమ్మిన పిదప బుద్ధిజంలోకి మారి ఆ తర్వాత మార్క్సిజంలోకి ఆయన జీవిత ప్రయాణం కొనసాగింది. ఆయన రెండు సంపుటాలుగా వెలువరించిన దర్శన్–దిగ్దర్శన్ గ్రంథాలు ప్రపంచ తాత్విక విచారాన్ని తెలుపుతుంది. లడఖ్, టిబెట్, శ్రీలంక, చైనా, ఇరాన్, సోవియట్ యూనియన్ వంటి అనేక దేశాలు తిరిగిన ఆయన యెక్కువగా భూ ప్రయాణాన్నే ఎంచుకున్నారు. టిబెట్ వంటి దేశాల నుండి అనేక సంస్కృత, పాళీ భాషల్లో ఉన్న గ్రంథాలను సేకరించాడు. కొందరి రాతల్లో ఆయన ఈ గ్రంథాల సేకరణ

కోసం, వారిని భారత్‌కు తీసికొని రావడానికి 22 గాడిదలను ఉపయోగించాడని ఉన్నది. పాట్నా మ్యూజియంలో తన సేకరణ అంతా ఒక విభాగంగా మనం చూడొచ్చు. ఆయనకు చాలా ముందుగా యౌవనంలో ప్రవేశించీ ప్రవేశించకముందే సంతోషి అను బాలికతో వివాహం అయింది. అయితే తన 40వ యేడు వరకు ఆమెను తను చూడలేదని ఆయన తన ఆత్మకథ "మేరీ జీవన్‌యాత్ర"లో రాసుకున్నారు. రాహుల్జీ, ఫూలే, అంబేద్కర్ ముగ్గురూ ఏప్రిల్ నెలలోనే జన్మించారు. కులంపై రాహుల్జీకి అనేక ప్రత్యేక అభిప్రాయాలుండేవి. "ధనికులకు కులంపై ఆసక్తి, ఆ వ్యవస్థను కొనసాగించడానికి కారణం వారికి గల ఆర్థిక ప్రయోజనాలే, అందువల్లనే సమాజంలో కులం కొనసాగించడానికి, వివక్ష విరాజిల్లడానికి కారణ మవుతుంది" అని "సామ్యవాద హీ కౌన్" అను గ్రంథంలో రాశారు. అలాగే "తుమ్హారీక్షయ, "దిమాగీ గులామీ" అను వ్యాసాల్లో ఆయన దళిత వ్యవస్థపై అది కొనసాగించే కారణాలను ద్వేషిస్తూ రాశారు.

గాంధీ దళితులను హరిజన్ అని సంబోధించడాన్ని రాహుల్జీ వ్యతిరేకించాడు "భాగో నహీ దునియాకోబద్‌లో" నాటికలో ఒక పాత్ర ఇలా అంటుంది. "గాంధీ మమ్మల్ని హరిజనులు అని పిల్చారు. అంటే మేము మానవ రూపంలోని దేవుళ్ళమేగా, కానీ ఆ దేవదేవుడు మాపై శీతకన్ను వేశాడే, మమ్మల్ని దూరంగా ఉంచాడే" ఇలా అప్పట్లో ఆయన గాంధీ దళితులను రాట్నం వడకమనడాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. కొద్ది అణాల కోసం ఆ వృత్తి స్వీకరించడం కాకుండా వారికి ప్రభుత్వ ఉద్యోగాలు కావాలన్నాడు.

"సామ్యవాది హీ క్యోం" అన్న పుస్తకంలో ఆయన దళిత సమస్యకు పరిష్కారం కమ్యూనిజమే అన్నాడు. అలా ఆయన శూన్య పండిత చర్చలు యేనాడూ చేయలేదు.

ఆ "విస్మృత యాత్రికు"ని గురించి సదా స్మరించుకుందాం. అందుకు అవకాశం కుదరనందుకు చింతిస్తూ, ఈ విధంగానైనా ఆయన గురించి లేశమాత్రంగా తెలిపే అవకాశం దొరికినందుకు సంతోషిస్తున్నాను.



రాహుల్ సాంకృత్యాయన్

# 18

# గుడిమల్లం నగ్న శివలింగంపై రాహుల్ సాంకృత్యాయన్ అసహనం

**– రాఘవ శర్మ,** సీనియర్ జర్నలిస్టు, చరిత్రకారులు, తిరుపతి, 9493226180





ఒక చేతిలో నీటికుండ... మరో చేతిలో మేకపిల్ల... కండలు తిరిగిన బలిష్టమైన శరీరంతో భుజానికి వేలాడుతున్న గండ్రగొడ్డలి.. కంఠాభరణాలు, చెవులకు కుండలాలు, ముంజేతి కంకణాలు.. ప్రశాంత వదనంతో నాసికాగ్రాన్ని చూస్తున్న విశాల నేత్రాలు.. మోకాళ్ళ వరకు దిగి, మొలచుట్టూ కట్టిన పలుచని వస్త్రం... ఉద్దేశ్యపూర్వకంగా బహిర్గతం చేసిన జననాంగం.. యక్షుడి భుజాలపై నిలబడి, భూమిలోకి అణగదొక్కుతున్న పరశురామేశ్వరుడు... నిలువెత్తు పురుషాంగాన్ని పోలిన శివలింగం ఒక విభిన్నమైన దృశ్యం!

శివలింగాన్ని ఇలా నగ్నంగా చెక్కడం పట్ల మహాపండితుడు రాహుల్ సాంకృత్యాయన్ అసహనం వ్యక్తం చేశారు. ఆ మహానుభావుడు రాసిన 'జయయౌధేయ' చారిత్రక నవలలో జయ యౌదేయ పాత్ర ద్వారా ఈ

అభిప్రాయం వ్యక్తం చేస్తారు. తిరుపతికి ఇరవై నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉన్న గుడిమల్లం శివలింగరూపం ఇది. ఇది దేశంలోనే తొట్టతొలి శైవక్షేత్రం. ఇలాంటి శివలింగం మరెక్కడా లేదు. ఈ శివలింగాన్ని క్రీస్తుపూర్వం 2, 3 శతాబ్దాలలో చెక్కి ఉండవచ్చని ఇక్కడ తవ్వకాలు జరిపిన ప్రముఖ పురాతత్వ శాస్త్రవేత్త ఇంగువ కార్తికేయ శర్మ అభిప్రాయపడ్డారు.

రాహుల్ సాంకృత్యాయన్ దేశాటనలో భాగంగా తిరుపతి ప్రాంతాన్ని 1913 ప్రాంతంలో సందర్శించారు. ఆ సమయంలోనే కాంచీపురానికి వెళుతూ, గుడిమల్లం ఆలయాన్ని కూడా సందర్శించినట్టు ఈ నవల ద్వారా స్పష్టమవుతోంది. ఈ నవల కథాంశం క్రీస్తు శకం 350–400 మధ్య కాలం నాటిది. అంటే నాల్గవ శతాబ్దం రెండవ అర్ధభాగం నాటిది. యమునా నదికి, హిమాలయాలకు మధ్య ఉండే యౌదేయ ప్రజాస్వామిక గణ రాజ్యం. విదేశీయులైన కుషాణులను దేశం నుంచి పారద్రోలడంలో యౌధేయులది ప్రధాన భూమిక. అలాంటి యౌధేయ గణాన్ని గుప్తులు నాశనం చేసి అయిదవ శతాబ్దం వచ్చేసరికి చరిత్రలో ఆ గణానికి నామరూపాలు లేకుండా చేశారు. యౌధేయుల గొప్పదనాన్ని గుప్తులకు కట్టబెట్టడంలో కాళిదాసులాంటి వారు కూడా ప్రయత్నించారు. యౌధేయ గణాధ్యక్షుడు కుమార యౌధేయ. ఆయన భార్య జయసేన, వారి కుమారుడు జయ యౌధేయ ఈ నవలలో ప్రధాన పాత్రగా తన స్వగతాన్ని చెపుతుంటాడు. వారి ముఖ్య పట్టణం అగ్రోదక (ఆగ్రా). యౌధేయ గణంపై సముద్రగుప్తుడి దాడి తరువాత ఓడిపోయిన రాజు కుమార యౌధేయ తన కుమార్తె దత్తాను సముద్రగుప్తుడికిచ్చి వివాహం చేయడంలో ఆమెను పట్టమహిషిని చేస్తారు. వారి రెండవ కుమారుడే చంద్రగుప్తుడు. తన తల్లి జయసేన మరణించడంతో, అతని అక్క దత్తా వద్దనే చంద్రగుప్తుడితో పాటు జయయౌధేయ పెరుగుతాడు.

కాంచీపుర సంస్థానానికి చెందిన సింహవర్మ, జయయౌధేయ, అతని వదినె వాసంతి కలిసి దంతపురం నుంచి బయలుదేరి రాజధాని పిష్ఠపురానికి (పిఠాపురం?) చేరుతారు. అక్కడి నుండి ద్రవిడ దేశంలోకి ప్రవేశిస్తారు.

సింహవర్మకు ద్రవిడ భాష వచ్చు. ద్రవిడ దేశంలో గుడిమల్లం శివాలయం చాలా ప్రసిద్ధమైందని జయయౌధేయ చెపుతుంటాడు. సింహవర్మ కూడా ఈ శివాలయం ప్రసిద్ధిని వింటూనే ఉంటాడు. జయయౌధేయ ఇలా చెపుతాడు "గుడిమల్లం శివాలయంలోని శిల్పకళ ప్రాశస్త్యాన్ని చూడవచ్చని గుడిమల్లం వెళ్ళాం. అక్కడ యాత్రికులు, భక్తులు అనేకులున్నారు. మేము ముగ్గురం పూలమాలలు తీసుకుని ఆలయంలోకి ప్రవేశించాం. అక్కడి భక్తులు తన్మయత్వంతో పూజార్చనలో ఉన్నారు. మరికొంతమంది కన్నార్పకుండా 'లింగం'వైపు చూస్తున్నారు. అక్కడి లింగం ఎలా ఉంది? మూడు బారల ఒక పెద్ద శిలాఫలకం. ఎవరో నిపుణులైన కళాకారుడా ఫలకం మీద తన కళను వ్యర్థం చేసుకున్నాడు. పురుషుడి మర్మావయవాన్ని ఉన్నదున్నట్టుగా చెక్కాడా ఫలకం మీద. ఈ లింగానికి ప్రక్కనే (పైన) సుందర విగ్రహం ఉంది. ఆ విగ్రహపు మర్మావయవం కూడా బహిర్గతంగా ప్రదర్శితమవుతోంది. అతి బీభత్సంగా ఉన్నాయా దృశ్యాలు. నేనక్కడ (జయయౌధేయ) ఎక్కువసేపు నిలబడలేకపోయాను. వదినె ఒక్క చూపు చూసి కళ్ళు దించుకుంది. పాంథశాలకు వచ్చాక ఇలా అన్నాను."

"మానవుడి అవివేకం మీద జాలి కలుగుతోంది" అని.

"నేను చిన్నతనం నుంచి ఈ దేవాలయాన్ని గురించి చాలా గొప్పగా విన్నాను. మా కుటుంబం శైవ కుటుంబం అని మీకు తెలుసుగా! ఈ లింగాన్ని దర్శిస్తే జన్మ తరిస్తుందని మా భావన" అన్నాడు సింహవర్మ.

"మరి ఇంకా అదే భావన ఉందా మీలో" అన్నాను.

"మరి అలాంటిది చెక్కవలసిన అవసరం ఏమొచ్చింది" అన్నది వదినె.

"ఇలాంటి విగ్రహాలను, దేవాలయాలను సామాన్య మానవులు ఎన్నటికీ నిర్మించలేరు. లక్షల దీనార్లను ఖర్చుపెట్టి ఇలాంటివి నిర్మించగలరు. ఈ బీభత్స దృశ్యం ధనికుల జీవితానికి ప్రతిబింబంలాంటిది! అబ్బ... తల్లీ దండ్రి తమ పుత్రికలను తీసుకుని ఈ లింగాన్ని చూడడానికి ఎలా వస్తారు? వచ్చినా వారి మనస్సులో ఎలాటి భావాలు కలుగుతాయి?"

'జయా నీవు ఈ మతాలకు వ్యతిరేకంగా మాట్లాడేటప్పుడు కేవలం ద్వేషం వల్ల మాట్లాడుతున్నామనుకునేవాడిని! కానీ, ఇప్పుడీ లింగాన్ని చూశాక, మతం మానవుణ్ణి ఉద్ధరించడానికి కాదు. అధోగతి పాలు చేయడానికని తెలుసుకుంటున్నాను. ఇలాంటి లింగాలనూ, విగ్రహాలను పూజించిన తరువాత కూడా బ్రహ్మణులు, శ్రేష్టులూ పశుతుల్యమైన కామాన్ని ప్రదర్శించకుండా ఉంటే, నిజంగా ఆశ్చర్యపడవలసిన విషయమౌతుంది.కానీ, ఈ సిగ్గూ ఎగ్గూ లేని కళాకారుడు ఎవడో!"

కళాకారుణ్ణని ప్రయోజనం ఏముంది? అతనికి దీన్ని చెక్కినందుకు కూలీ ఇచ్చి ఉంటారు. ఒకవేళ దీన్ని తయారు చేయలేకపోతే శిక్ష పడవచ్చు. అది కాదు గానీ, సోదరా ఇలాంటి లింగాలకు సపరివారంగా పూజ చేసేవారు బ్రహ్మచర్యాన్ని గురించీ, ఇంద్రియ నిగ్రహాన్ని గురించి చెబితే ఏమనేట్టు?"

"ఇది చాలా సిగ్గులేని విషయం. మన కళకే గొప్ప కళంకం."

'తీర్థంకరుడి నగ్న ప్రతిమల్ని నేను చూశాను. నాకు అవి అసహ్యమనిపించాయి కానీ, వాటిలో కాముకత ఇంత నగ్నంగా ప్రదర్శించబడలేదు"

అంతవరకు వాసంతి వదిన మెదలకుండా కూర్చున్నది. అసలేం మాట్లాడగలదు? కానీ, తీర్థంకరుడి విషయం వచ్చేసరికి తనూ నోరు విప్పింది.

'మరిదీ మేము (స్త్రీలము) మతం విషయంలో చాలా గుడ్డిగా మూర్ఖంగా ఉంటాము. నేను కూడా తీర్థంకరుడి నగ్న మూర్తుల్ని (విగ్రహాలను) చూడడానికి ఎప్పుడూ వెళ్తూ ఉండే దాన్ని. విగ్రహాలు పసిపిల్లవాడిలాటి సరళత్వాన్ని కలిగి ఉన్నాయి. అయినా విగ్రహాన్ని చెక్కేటపుడు శిల్పకారుడి చేయి తప్పుదారి పట్టిందనిపిస్తోంది. కాముకత్వపు సూక్ష్మ అభివ్యంజనం ఆ శిల్పంలో గోచరిస్తోంది. ఈ అనాకార శిల్పాలకు పథభ్రష్టమైన ఆ తీర్థంకరుడి శిల్పం ప్రారంభం. ఈ శిల్పం అంత్యం అనవచ్చు" అంది వదినె.

జయయౌధేయ నవలలో గుడిమల్లం నగ్న శివలింగం గురించి సంభాషణ ఇలా సాగుతుంది.

జయయౌదేయ పాత్ర ద్వారా రాహుల్ సాంకృత్యాయన్ ఈ శిల్పం పట్ల తన అభ్యంతరాన్ని వ్యక్తం చేస్తారు. రాహుల్ సాంకృత్యాయన్ 1914 ప్రాంతంలో తిరుపతి పరిసరాలను సందర్శించిన తరువాత రాసిన నవల ఇది. భారత ప్రభుత్వ శాసన పరిశోధకుడు (ఎపిగ్రఫిస్ట్) రాయ్‌బహదూర్ వి. వెంకటయ్య 1903లో ఆ ఆలయ చారిత్రక ప్రాముఖ్యతను గుర్తించారు. గోపీనాథరావు అనే పండితుడు ఈ ఆలయంలోని శివలింగం గురించి తొలిసారిగా 1914లో రాశారు. ఆ ఫలితంగానే రాహుల్ దీని గురించి జయయౌదేయలో ఇలా చర్చించి ఉండవచ్చు. పరిరక్షించవలసిన అత్యంత విలువైన జాతి సంపదగా దీన్ని 1963లో భారత పురావస్తు శాఖ ప్రకటించింది. గుడిమల్లంలోని ఆలయం గురించి అప్పటి వరకు ఉన్న అభిప్రాయాలను శాస్త్రీయంగా పరిశీలించి, నిజాలను నిగ్గు తేల్చడానికి ప్రముఖ పురాతత్వ శాస్త్రవేత్త (ఆర్కియాలజిస్ట్) ఇంగువ కార్తికేయ శర్మ 1973లో రంగంలోకి దిగారు. వ్యక్తిగతంగా వైదిక సంప్రదాయాలను విశ్వసించే ఇంగువ కార్తికేయ శర్మ సత్యాన్వేషణ కోసం ఆలయం గర్భగుడిలో కూడా తవ్వకాలు జరపడానికి వెనుకాడలేదు. తొలుత గ్రామస్తుల నుంచి తీవ్రమైన వ్యతిరేకత వ్యక్తమైంది. అభ్యంతరాలతో పాటు ఆయనను శాపనార్థాలు కూడా పెట్టారు. వాటిని ఆయన లెక్కచేయలేదు.

ఆలయానికి చుట్టూ ఎత్తైన ప్రాకారం ఉంది. ఈ ప్రాకారాన్ని పెద్ద పెద్ద రాళ్ళతో నిర్మించారు. సహజంగా ఆలయాలన్నీ తూర్పు అభిముఖంగా ఉంటాయి. ఇక్కడి మూలవిరాట్టు తూర్పు అభిముఖంగా ఉన్నప్పటికీ, ఆలయ ప్రవేశ ద్వారం మాత్రం దక్షిణం వైపు ఉంది. ఈ ఆలయ ప్రాకారానికి ప్రవేశ ద్వారం పడమర దిక్కున ఉంది. ఆలయంలోకి ప్రవేశించాక ఒక పెద్ద ఆరాధనా మండపం వస్తుంది. ఈ ఆరాధనా మండపం నుంచి గర్భగుడి ముందున్న ముఖమండపంలోకి ప్రవేశించవచ్చు. ఈ ముఖ మండపం నుంచే తూర్పు

అభిముఖంగా ఉన్న గర్భగుడిలోకి ప్రవేశించవచ్చు. ముఖమండపం కంటే గర్భగుడి పల్లంలో ఉంటుంది. గర్భగుడిలో ఎదురుగా ముదురు గోధుమ వర్ణంలో అయిదున్నర అడుగుల ఎత్తైన పురుషాంగాన్ని పోలిన నున్నటి శివలింగం కనిపిస్తుంది. ఆ శివలింగంపైన పరశురామేశ్వరుడి విగ్రహాన్ని చక్కగా చెక్కారు. విగ్రహానికి విరబోసిన వెంట్రుకలపై అడవి ఆకులతో కట్టిన తలపాగా, చప్పడి ముక్కు, నాసికాగ్రాన్ని చూస్తున్నట్టున్న చేపల్లాంటి విశాలమైన నేత్రాలు, గుబురైన కనుబొమ్మలు, లావైన పెదాలు, ఉబ్బెత్తుగా చెంపలు, చక్కని చుబుకం, చెవులకు ఘటి కుండలాలు, చేతులకు అయిదు వజ్రాలు పొదిగినట్టున్న కంకణాలు, భుజానికి, మోచేతికి మధ్య భుజకీర్తులు, మెడలో కంఠాభరణాలు ఉన్నాయి. ఒక చేతిలో వేలాడుతున్న మేకపిల్ల, మరో చేతిలో సన్నని మూతిగల సొరకాయ బుర్రలాంటి నీటి కుండ, బలమైన భుజానికి వేలాడుతున్న గండ్రగొడ్డలి. మొల నుంచి చుట్టి మోకాళ్ళ వరకు దిగిన సన్నని వస్త్రం. వస్త్రం ముడతలు కూడా స్పష్టంగా రాతిపై చక్కగా చెక్కారు. ఉద్దేశపూర్వకంగా బహిర్గతం చేసిన జననాంగం. మూడు తలలు, నాలుగు చేతులు అన్న కాల్పనిక పౌరాణిక రూపం కాదు. సౌమ్యంగా ఉన్న శివుడి తొలి రూపం ఇది. మానవ దేహానికి వాస్తవ రూపం. బ్రాహ్మణ దేవతల తొలి ఆకారం. ఇక్కడ శివుడికి మూడవ కన్ను లేదు. యజ్ఞోపవీతం కూడా లేదు. కనుక ఇది రుగ్వేదకాలం నాటి రూపం అయి వుండవచ్చు. రుగ్వేద కాలంలో యజ్ఞోపవీతం లేదు. 'సమపాదక స్థానక మూర్తి' గా నిలబడిన పురుష దేవతలకు ప్రధానమైన ఆకారం. తొలి నాటి ఆలోచనల్లో ఉన్న భగవద్రూపాన్ని చెక్కారు. యక్షుడి భుజాలపై నిర్భయంగా నిలబడి అతన్ని భూమిలోకి అణగదొక్కుతున్న పరశురామేశ్వరుడు. యక్షుడంటే భూతలంపై సార్వభౌమాధికారం ఉన్న దేవుడు. శివుడి స్వేదం నుంచే ఇతను పుట్టాడని ప్రాచీనుల నమ్మకం. యక్షుడు మోకాళ్ళపై ఉన్నాడు. శరీరం వంగిపోయి ఉంది. పరశురామేశ్వరుడు అతని భుజాలపైకెక్కి తొక్కడం వల్ల బాధతో పళ్ళు బిగించి పెట్టాడు. ముడిచిన కనుబొమ్మలు, అతని మెడలో రుద్రాక్షమాల. చేతికి కంకణాలు.

అగ్ని పర్వతం బద్దలై ఏర్పడిన లావా ఘనీభవించి శిలగా మారినప్పుడు ఆ శిల చాలా బలంగా ఉంటుంది. అలాంటి ముదురు గోధుమవర్ణపు శిలతోనే ఈ శివలింగాన్ని దానిపైన పరశురామేశ్వరుడి విగ్రహాన్ని, దాని చుట్టూ ఉన్న శిలాప్రాకారాన్ని అత్యద్భుతంగా చెక్కారు. ఈ విగ్రహం అద్దమంత నునుపుతేలి ఉంటుంది. పురాతన రచనల్లో రుద్రుడు, శివుడు దిగంబరుడే! ఈ దిగంబర రూపం రుగ్వేదంలో 'శిశ్నదేవ' 'మహానగ్న' అయి ఉండవచ్చు. బిక్షువు రూపం కూడా అయి ఉండవచ్చు. శివలింగంపైన చెక్కిన దేవత పేరు పురాతన శాసనాల్లో ఎక్కడా లేదు. క్రీస్తుశకం 1127లో విక్రమ చోళుడి కాలంలో ఆలయం గోడలపై 'మహాదేవ పరశురామేశ్వర' అని చెక్కడం వల్ల దీనికి పరశురామేశ్వరాలయంగా పేరు వచ్చింది. కళాత్మకమైన ఈ వేషధారణ ఆటవిక జీవితాన్ని తెలియజేస్తుంది. పౌరాణిక రూపంకంటే కూడా వేదకాలపు మత ప్రతీకగా ఈ విగ్రహం కనిపిస్తుంది. పొడవాటి ఈ శివలింగానికి, అంగస్తంభనకు సంబంధం లేదు. ఇందులో వ్యక్త, అవ్యక్త భావనలు మిళితమై ఉన్నాయి. ఈ నగ్నరూపం ఎన్నో సందేహాలను లేవనెత్తుతోంది.

ఈ లింగానికి కింద యోని ఆకారంలో ఉన్న పానపట్టం లేదు. దీన్ని నిలబెట్టడానికి రెండు పీఠాలను అమర్చారు. గుండ్రటి పీఠాల మధ్య పెద్ద రంధ్రం వేసి, దానిలో నిలబెట్టారు. ఈ రెండు రాతి పీఠాలు లింగం చేసిన కఠిన శిలతో కాకుండా ఇసుకరాయితో చేసినవి. వాటి కింద భాగం దీర్ఘచతురస్రాకారపు పీఠం లాగా ఉంటుంది. శివలింగం అసలు ఎత్తు అయిదున్నర అడుగులు. పైకి కనిపించేది మాత్రం అయిదు అడుగుల అరఅంగుళం. శివలింగంపైన దిగంబరంగా ఉన్న పరశురామేశ్వరుడి విగ్రహం 80 సెంటీమీటర్లుంటుంది. అతని పాదాల కింద భూమిలోకి తొక్కుతున్నట్టున్న యక్షుడి విగ్రహం కేవలం 46 సెంటీమీటర్లుంటుంది. శివలింగానికి చుట్టూ రాతితో శిలాప్రాకారం (రెయిలింగ్) ఏర్పాటు చేశారు. ఈ శివలింగాన్ని చెక్కినప్పుడే క్రీస్తుపూర్వం 2, 3 శతాబ్దాలనాడే ఈ శిలాప్రాకారాన్ని కూడా నిర్మించారు. బ్రాహ్మణీయ దేవాలయాల్లో ఇలా శిలాప్రాకారాన్ని నిర్మించడం

ఇదే ప్రథమం. లింగం చెక్కిన రాతితోనే ఈ శిలాప్రాకారాన్ని కూడ చెక్కారు. తూర్పువైపున ఉన్న శిలాప్రాకారం కొంతమేరకు దెబ్బతిని ఉంది. కొంత భాగం భూమిలోకి ఉంది. బహుశా ఈ శిలాప్రాకారం అభిషేకం చేయడానికి అయి ఉండవచ్చు. దీనిపైన పద్మవృత్తాలు చెక్కి ఉన్నాయి. ఈ లింగాన్ని ప్రతిష్టించినప్పుడు దీనికి ఆలయం లేదు. ఈ దేవతాకారం ముందు జంతుబలులిచ్చేవారు. శివుడు, రుద్రుడు సమానార్థాలు, రుద్రుడు జంతు బలులను కోరేవాడు. అతని కోపాన్ని తగ్గించడానికి ఈ విగ్రహం ముందు జంతుబలులిచ్చేవారు. క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దం నాటికి కప్పు లేకుండా ఆలయాలు నిర్మించేవారు. క్రీస్తుశకం ఒకటవ శతాబ్దం నాటికి కూడా తిరుమలలో వేంకటేశ్వరుడి విగ్రహం కప్పులేకుండా ఉంది. కనుక ఈ లింగాకారానికి కూడా తొలుత పైకప్పు కానీ, చుట్టూ ఆలయం కానీ లేదు. శాతవాహనుల కాలంలో మాత్రమే ఈ లింగానికి ఇటుకలతో ఆలయం నిర్మించారు. ఈ ఆలయ నిర్మాణం పూర్తిగా ఎలా ఉందో తెలియదు. కాకపోతే ఈ ఆలయం నిర్మించిన తొలినాళ్ళలో ఆగమశాస్త్రాలు లేవు కనుక, ఆ తరువాత ఆగమ శాస్త్ర పద్ధతి ప్రకారం పునర్నిర్మించినట్లు భావించవచ్చు.

క్రీస్తుశకం 1127లో వేసిన శాసనం ప్రకారం విక్రమచోళుడు సింహాసనాన్ని అధిష్టించిన 9 సంవత్సరాలకు ఈ ఆలయాన్ని రాతిలో పునర్నిర్మించాడు. ఈ ఆలయం నిర్మించాక మూలవిరాట్టును కానీ, దాని చుట్టూ ఉన్న శిలాప్రాకారాన్ని కానీ ఏమాత్రం మార్చలేదు. ఏనుగు వెనుక భాగంలా ఉన్నట్టు అర్ధచంద్రాకారంలో గర్భగుడిలో మూలవిరాట్టుకు వెనుక గోడ నిర్మించారు. ఆలయం అంతా చక్కగా చెక్కిన రాతితోనే నిర్మించారు. గర్భగుడిని, దాని ముందున్న ముఖ మండపాన్ని, పైకప్పునూ రాతితోనే నిర్మించారు. మహామండపాన్ని కూడా రాతితోనే నిర్మించారు. గర్భగుడిలో సున్నంతో చేసిన గచ్చును తీసేసి రాతిని పరిచారు. ఈ సమయంలో మూలవిరాట్టును కానీ, దాని చుట్టూ ఉన్న శిలాప్రాకారాన్ని గానీ ఏమాత్రం కదల్చలేదు. కాకపోతే శిలాప్రాకారాంలో ఉన్న హెచ్చుతగ్గులను సరిచేశారు.

పల్లవులు, చోళుల కాలంలో ఆలయ నిర్మాణంలో గణనీయమైన మార్పులు జరిగాయి. ఆగమ శాస్త్రానికి అనుగుణంగా ఈ ఆలయాన్ని పునర్నిర్మించారు. ఆగమశాస్త్ర ప్రకారం అభిషేకాలు క్రమం తప్పకుండా జరగడం వల్ల నీళ్ళు బైటికి పోవడానికి మూలవిరాట్టుకు వెనుక భాగంలో పడమర దిశగా శిలా ప్రాకారానికి కింద నుంచి స్నపన ద్రోణిని (సన్నని తూము) ఏర్పాటు చేశారు. ఆలయ ప్రవేశ ద్వారం వద్ద నృత్యగణపతిని చెక్కారు. గర్భగుడికి వెలుపల, ఆరాధనా మండపానికి లోపల పై భాగంలో గాలి, వెలుతురు కోసం గవాక్షాలు ఏర్పాటు చేశారు. ఆలయానికి తూర్పువైపున, నైరుతి వైపున ఉన్న ద్వారాలను గ్రానైట్ రాళ్ళతో మూసివేశారు. దక్షిణ దిశగా ద్వారాన్ని ఏర్పాటు చేశారు. గర్భగుడి పల్లంలో ఉండడం వల్ల స్వర్ణముఖి పొంగినప్పుడల్లా తూముగుండా నది నీళ్ళు ఆలయంలోకి వచ్చేవి.

దీర్ఘ చతురస్రాకారంలో ఉన్న మహామండపాన్ని కూడా రాతితో నిర్మించారు. పై కప్పు అంతా రాతితో కప్పి ఉంది. ఆలయానికి సహజంగా ఉండే ద్వారపాలకులు లేరు. ఈ ఆలయ నిర్మాణం అంతా చోళుల కాలం నాటి వాస్తు పద్ధతిననుసరించి ఉంది. గర్భగుడిపైన ఉన్న గోపురంపైన లింగాకారంలో విమానం ఉంటుంది. ఆలయం చుట్టూ ఎత్తైన ప్రాకారాన్ని చెక్కిన రాతితో నిర్మించారు. ప్రాకారంలో ప్రధాన ఆలయం చుట్టూ అనేక చిన్న చిన్న ఉపదేవతల ఆలయాలు ఉన్నాయి. స్వర్ణముఖి నది ఒడ్డున జరిపిన తవ్వకాల్లో దొరికిన వెండినాణేలు మౌర్యుల కాలం నాటివి. ఈ ఆలయ నిర్మాణానికి వాడిన ఇటుకలు శాతవాహనుల కాలం నాటివి. గుడి వద్ద దొరికిన శాసనాలను బట్టి క్రీస్తు శకం 845 నుంచి క్రీస్తు శకం 1801 వరకు; రాజా దామెర వెంటప్ప నాయుడి పాలన వరకు ఈ లింగం నిత్య పూజలందుకుంది. క్రీస్తుపూర్వం నుంచి నేటి వరకు పూజలందుకుంటున్న ఏకైక హైందవ దేవాలయం గుడిమల్లం పరశురామేశ్వరాలయం. క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దం నుంచి, క్రీస్తు శకం మూడవ శతాబ్దం వరకు ఆంధ్ర ప్రాంతంలో, ముఖ్యంగా తూర్పు ఆంధ్ర తీరప్రాంతంలో ఆంధ్రుల సాంస్కృతిక జీవితంలోకి

బౌద్ధ మతం ప్రవేశించింది.. బౌద్ధం ప్రవేశించడానికి ముందు గాని, ప్రవేశిస్తున్న సమయంలో గాని శివలింగంపైన చెక్కిన పరశురామేశ్వరుడి విగ్రహం ఉనికిలోకి వచ్చింది. సింధూ నాగరికతా కాలంలో లింగారాధన ఉన్నదని మనం కచ్చితంగా చెప్పలేకపోయినప్పటికీ, మొహెంజదారో తవ్వకాల్లో రాతితో చెక్కిన లింగం, యోని ఆకారాలు బైటపడ్డాయని సంకాలియా అనే పురాతత్వ శాస్త్రవేత్త అంటారు. మొహెంజదారో తవ్వకాల్లో బైటపడిన పశుపతికి ఈ పరమేశ్వరుడికి పోలికలున్నాయని సర్‌జాన్ మార్షల్ అనే చరిత్రకారుడు అంటారు. ఈ శివలింగం గురించిన ఎన్ని ఆలోచనలు సంఘర్షించినప్పటికీ బ్రాహ్మణ దేవతల్లో ఇది తొలినాటి రూపమనడంలో ఎటువంటి సందేహం లేదు. లింగం చుట్టూ ఉన్న శిలాప్రాకారం చుట్టూ చెక్కిన కమలం లాంటి గుర్తులు అశోకుడి ధర్మచక్రాన్ని పోలి ఉన్నాయి. ఈ రకమైన ఆనవాళ్ళు ఎక్కువగా బౌద్ధ నిర్మాణాల్లోనే కనిపిస్తాయి. సాంచి, అమరావతి, బర్హట్ వంటి బౌద్ధ చైత్యాలను ఈ దేవాలయం పోలి ఉంది. ఇలాంటి నిర్మాణాలు హైందవ దేవాలయాల్లో చాలా అరుదుగా మాత్రమే కనిపిస్తాయి.

మహాపండితుడు రాహుల్ సాంకృత్యాయన్ జయయౌధేయ రాసే నాటికి గుడిమల్లంనగ్న శివలింగం గురించిన పురావస్తు తవ్వకాలు జరగలేదు. సరైన చారిత్రక విషయాలు బైటికి రాలేదు. అందుకనే ఈ నగ్న రూపాన్ని చూసి అసహనంతో ఈ నవలలో పేర్కొన్నట్టు భావించవచ్చు.



# 19

# రాహుల్ సాంకృత్యాయన్ - సామాజిక మార్పులు
## (Rahul Sankrityayan & Social Changes)

– మూలం : **ఆర్.ఎస్. శర్మ,**

సంక్షిప్త స్వేచ్ఛానువాదం : **పి. భరత్,** గుంటూరు, 9701487740

రాహుల్ సాంకృత్యాయన్ బహుముఖ ప్రజ్ఞాశాలి. ఉర్దూ మాధ్యమం ద్వారా ఏడవ తరగతి వరకు సాధారణ విద్యను అభ్యసించారు. కానీ, అతను తనకు తానుగా పాఠశాల, కళాశాలలకు వెలుపల విద్యను పొందగలిగారు. 3 డజన్ల భాషలను నేర్చుకున్నారు. 50 సంవత్సరాల క్రియాశీల జీవితంలో 30 సంవత్సరాలకంటే తక్కువ సమయంలో 134 పుస్తకాలను రచించారు. అందులో సొంత రచనలు, అనువాదాలు, సంపాదకత్వం వహించిన రచనలు అనేకం వున్నాయి. ఆయన ఎక్కువ రచనలు హిందీలో చేశారు. విదేశాలలోని పరిశోధన సంస్థలలో చేసిన ఉపన్యాసాలలో కొన్ని మాత్రమే ఇంగ్లీషులో రాశారు. రాహుల్‌జీ జ్ఞాపకశక్తి అసాధారణమైనది. ఏదైనా రచన చేస్తున్న సమయంలో ఆ అంశానికి చెందిన పుస్తకాలు కాని, నోట్స్ కానీ వుండేవి కావు. వారి జ్ఞాపకశక్తి నుంచే రచనలు చేసేవారు. భారతదేశం, ఇతర దేశాలు తిరుగుతున్నప్పటికి ఆయన రచనలు చేయడానికి సమయాన్ని కేటాయించేవారు. 1963లో 70 సంవత్సరాల వయస్సులో ఆయన చనిపోయారు. ఆయన చనిపోవటానికి, రెండున్నర సంవత్సరాల ముందు జ్ఞాపకశక్తిని కోల్పోయారు. కొన్నిసార్లు తన భార్య కమలని కూడా గుర్తించలేకపోయారు. రాహుల్ జీ తన జ్ఞాపకశక్తిని కోల్పోక పోయినట్లయితే ఆ రెండున్నర సంవత్సరాల కాలంలో అనేక రచనలు అందించి వుండేవారు.

కొన్ని సమయాలలో రోజుకి 20 గంటలు పనిచేసేవారు. అతని చేతివ్రాత స్పష్టంగా లేనప్పటికి నిరంతరంగా రాస్తూనే ఉండేవారు. రచనలు చేసే కాలంలో ఆ రచన పూర్తి అయ్యేవరకు ఏ వార్తాపత్రికలను చదివేవారు

కాదు. రచన పూర్తి అయిన తరువాత 3, 4 రోజులలో అన్ని వార్తా పత్రికలు చదివేవారు. 28 రోజులలో మజ్జిమనికాయను హిందీలోకి అనువదించారు. సోవియట్ రష్యాపై 1000 పేజీల పుస్తకాన్ని ఒక నెలలో రాశారు. కనీసం 20 పేజీలు రాయనిదే అల్పాహారం కూడా తీసుకొనేవాడిని కానని ఆయన చెప్పేవారు. అయితే, ఈ గొప్ప రచయిత తను వ్రాసిన వాటిని తిరిగి చూడటానికి ఎప్పుడూ పట్టించుకోలేదు. తన రచనలలోని తప్పుల గురించి ఎవరైనా ఫిర్యాదు చేస్తే, ఆయన మృదువుగా సంపాదకులు వాటిని జాగ్రత్తగా సరిదిద్దుతారు అనేవారు. హిందీభాషని సుసంపన్నం చేయటానికి సాధ్యమైనంత వరకు కొత్త విషయాలపై రాయడం అవసరమని రాహుల్‌జీ భావించేవారు.

రచనలు చేయడంలో నిరంతరం హడావుడిగా వుండేవారు. మాన్ స్క్రిప్ట్‌ని మళ్ళీ ఉపయోగించడంలో కాని, సరిదిద్దడంలో కాని సమయాన్ని వృథాచేసేవారు కాదు.

రాహుల్ సాంకృత్యాయన్ ప్రపంచవ్యాప్త పర్యటనలు సుప్రసిద్ధం. టిబెట్‌కు చేసిన 4వ పర్యటనలలో అతను సాధించినవి ఎంతో ప్రసిద్ధి చెందినవి. టిబెట్ నుండి తీసుకువచ్చిన 4,500 జిలోగ్రాఫ్స్, అనేక రాత ప్రతులు పాట్నాలోని బీహార్ రీసెర్స్ సొసైటీ భద్రపరచబడినవి. అతని సేకరణలో Kansur, Tansur రచన సామాగ్రి విలువైనది. Kansur అంటే నియమానుగుణ బౌద్ధ గ్రంథాలు, Tansur అంటే ఆ గ్రంథాలపై వ్యాఖ్యానాలు. 10-12 శతాబ్దాలలో మిశ్రమ సంస్కృత భాషలో రచించిన విలువైన 80 బౌద్ధ రాత ప్రతులను ఆయన తీసుకొని వచ్చారు. ఈ బౌద్ధ రాత ప్రతులలో కొన్నింటిని అవగతం చేసుకొని కె.పి. జయస్వాల్ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్, పాట్నా వాళ్ళు ముద్రించారు. ఇవికాక, టిబెట్ భాషలో వున్న 619 రాతప్రతులు, పరిశీలిస్తే అందులో కొన్ని సంస్కృతం నుంచి అనువాదం చేయబడినవి. దురదృష్టవశాత్తు స్వాతంత్ర్యానంతరం రాహుల్‌జీకి ఎటువంటి నిధులు అందలేదు. కేవలం 6000 రూపాయలు బీహార్ రీసెర్చ్ సొసైటీ గ్రాంట్ రూపంలో యిచ్చింది. దృఢమైన హేతుబద్ధ ఆలోచన, అపరిమితమైన జ్ఞానతృష్ణ కలిగిన వ్యక్తి రాహుల్ సాంకృత్యాయన్. నిరంతరం ప్రశ్నించే తత్త్వం వలన

రాహుల్ హేతుబద్ధ ఆలోచనాపరుడుగా మారారు. ఈ ఆలోచన క్రమం ఆర్య సమాజం, బౌద్ధం, మార్క్సిజం వైపుకు దారి తీసింది. రాహుల్ మేథో ప్రక్రియ లోతైన పరిశోధనా అంశం.

రాహుల్ తూర్పు ఉత్తర ప్రదేశ్‌లోని బలమైన సనాతన సాంప్రదాయ వర్ణవ్యవస్థ కలిగిన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. 19 ఏళ్ళ వయస్సులో చాప్రా జిల్లాలో వైష్ణవ మతానికి మహంత్ అయ్యారు. కేదార్‌నాథ్ పాండే అనే పేరు నుంచి దామోదర్ దాసుగా మారారు. 27 ఏళ్ళ వయస్సులో శ్రీలంక వెళ్ళి బుద్దిస్ట్‌గా మారారు. ఈ నూతన మతం తనపై బలమైన ముద్ర వేసింది. 1940 లలో కమ్యూనిస్టు పార్టీలో చేరినప్పటికి, బుద్ధుని బోధనల ఆధారంగానే కమ్యూనిజాన్ని సమర్ధించేవారు.

రాహుల్ కేవలం మహా పండితుడే కాదు. తన చురుకైన జీవన గమనంలో నిరంతరం ఏదో ఒక ఉద్యమంలో పాల్గొనేవారు. అతను సరన్ జిల్లాలో సహాయ నిరాకరణ ఉద్యమంలో ముఖ్యమైన పాత్ర నిర్వహించాడు మరియు ఆ ఉద్యమంలో పాల్గొన్న తన సమకాలీనులపై ఒక పుస్తకాన్ని రచించాడు. అదే సమయంలో ఆర్య సమాజం ప్రచారోద్యమంలో పాల్గొని సనాతన బ్రాహ్మణ ధర్మం యొక్క దుష్కర్మలను బహిర్గతం చేశారు. సామాజిక సమానతను పెంపొందించడంలో ఆర్య సమాజపు భావాలు అసమగ్రమైనవి అని తెలుసుకొని 1930లలో బుద్దిస్ట్‌గా మారారు. 30వ దశకంలో సోషలిస్టు, మార్క్సిస్టు ఆలోచనలతో ప్రభావితుడయ్యాడు. జాతీయోద్యమంలో గాంధీ ఆలోచనలను తీవ్రంగా విమర్శించాడు. రాహుల్ తొలి ప్రచురణలలో ఒకటైన 'కమ్యూనిజం ఎందుకు' అనే పుస్తకాన్ని 1933లో హిందీలో రచించారు.

1940లో బీహార్‌లో కమ్యూనిస్టు పార్టీ స్థాపకులలో రాహుల్ ఒకరు. భూస్వాములు లాక్కొన్న భూమిని రైతులకు పునరుద్ధరించడంకోసం అమ్వారి సత్యాగ్రహంలో చురుకుగా పాల్గొన్నారు. లాఠీచార్జి చేయడంలో తలకు బలమైన గాయమైంది. 1930ల నుంచి తను మరణించే వరకు వామపక్ష ఉద్యమానికి బలమైన మద్దతుదారుడిగా వున్నారు. అయినా కమ్యూనిస్టు పార్టీ లాంగ్వేజ్ పాలసీ (భాషా విధానాన్ని) తీవ్రంగా విమర్శించారు. చరిత్ర, సాహిత్యం, మతం,

తత్త్వశాస్త్రం, యాత్రా చరిత్ర, జీవిత చరిత్రలు, నిఘంటువులు, బౌద్ధ సాహిత్యం, సామాజిక సమస్యల అధ్యయనం, రాజనీతి చరిత్ర రచనలను రాహుల్ చేసిన కృషిని విమర్శనాత్మకంగా అంచనా వేయడం కష్టం. వాస్తవానికి హిందిలో విభిన్న శైలులను ఇంతగా సుసంపన్నం చేసిన మరే ఇతర రచయిత, మేధావి గురించి నాకు తెలియదు. చరిత్రకు ఆయన చేసిన కృషి విశేషమైనది. రాహుల్ చారిత్రక రచనలు, మార్క్సిస్టు దృక్పథంతో, చారిత్రక భౌతికవాద ప్రభావంతో రచించబడినవి. గతితార్కిక భౌతికవాదంపై కూడా ఒక రచన చేశారు. ఈ రచనలో వున్న స్పష్టత తత్త్వశాస్త్ర ప్రాముఖ్యతను పెంచింది. హిందీ పాఠకులు సులభంగా ఈ రచనను అర్థం చేసుకోగలిగారు. రాహుల్ ప్రతి రచనలోను స్పష్టత వుంటుంది. భారత దేశ చరిత్రపై వున్న ఇష్టం వలన మధ్య ఆసియాపై ఆయనకి గొప్ప ఆకర్షణ కలిగింది. మధ్య ఆసియా చరిత్రను రెండు సంపుటాలుగా వ్రాశారు. అందులో రాజకీయ చరిత్ర రూపురేఖలను వివరించారు.

ప్రధాన అంశం జాతి, సామాజిక, ఆర్థిక సాంస్కృతిక చరిత్ర. రాహుల్ ప్రాచీన కాలంలో చరిత్ర గమనాన్ని వివరించడానికి అనేక నవలలు, కథా సంకలనాల్ని రచించారు. ఓల్గా సే గంగా పుస్తకంలో ఓల్గా పరివాహ ప్రాంతం, ఆర్యుల పుట్టుక గురించి, భారతదేశానికి వారి వలసల గురించి వివరించారు, మరియు మాతృస్వామ్యం నుంచి పెట్టుబడిదారీ విధానానికి మానవ సమాజ పరిణామంలోని ప్రధాన దశలను వివరించాడు. దక్షిణ రష్యాలోని ఓల్గా పరివాహక ప్రాంతంలోని విస్తారమైన గడ్డి భూముల ప్రదేశాలలో ఇండో యూరోపియన్‌లు నివశించారనే పరికల్పనను, గత 30 సంవత్సరాలుగా జరిగిన పురావస్తు త్రవ్వకాలు అపారమైన సమాచారాన్ని అందించడం విశేషం. 4000–2000 బిసి కాలానికి చెందిన చక్రాల రథాలు, పశువులు, గుర్రాలు, గొర్రెల బలి అవశేషాలు దక్షిణ రష్యాలో కనుగొనబడ్డాయి. ఇవన్నీ ఇండో–యూరోపియన్ ప్రజలలో సంబంధం కలిగి వున్నాయి. 4000–2000 బిసి కాలంలో చేసిన ఖననాలు కనుగొనబడ్డాయి. మగవారి ఖననాలను ఒక ప్రాంతంలో, స్త్రీ ఖననాలను మరొక ప్రాంతంలో చేసినట్లు గుర్తించబడింది.

ఇద్దరిని ఒకేసారి ఖననం చేసినప్పుడు మగవారిని కుడివైపు, ఆడవారిని ఎడమవైపు వుంచి ఖననం చేసినట్లు ఆధారాలు లభించాయి. ఇదే మగవారి ఆధిపత్యాన్ని సూచిస్తుంది.

1942లో పాట్నా నుంచి ప్రచురించబడిన 'మానవ సమాజం' అనే పుస్తకంలో మానవ సమాజ పరిణామ దశలను రాహుల్ వివరించారు. ఈ పుస్తకం మరియు తన ఇతర చారిత్రక లేదా చరిత్ర ఆధారిత రచనలలో రాహుల్ సమాజం యొక్క క్రమబద్ధమైన పరిణామాన్ని సంప్రదాయ మార్క్సిస్టు కోణంలో విశ్లేషించారు. మొదటి దశ – ఆదిమ కమ్యూనిజం, రెండవ దశ – బానిసత్వం, మూడవ దశ – భూస్వామ్య వ్యవస్థ, నాల్గవ దశ – పెట్టుబడిదారీ వ్యవస్థకు చివరి దశగా సోషలిజాన్ని పేర్కొంటూ సోవియట్ రష్యాని ఉదాహరణగా చూపించారు. గత 50 సంవత్సరాలుగా చరిత్ర పరిశోధనలో అనేక మార్పులు జరిగాయి. ఆ పరిశోధన ఫలితాలు అనేక నిర్దిష్ట అంశాలకు వర్తించవని కనుగొనబడింది. కాని 1940ల నాటి మార్క్సిస్ట్ చారిత్రక ఆలోచనా క్రమాన్ని పరిశీలిస్తే మానవ సమాజం ఒక మార్గదర్శకమైన పుస్తకం. హిందీకి సంబంధించినంతవరకు ఈ రకమైన పుస్తకాలలో ఇది మొదటిది.

చారిత్రక భౌతికవాద దృష్ట్యా భారతీయ సమాజ పరిణామ క్రమాన్ని అధ్యయనం చేయటం అవసరమని రాహుల్ భావించారు. ఇటీవల పరిశోధనల రీత్యా రాహుల్ పరిశోధనలు, భావాలు ఆమోదయోగ్యం కాకపోవచ్చు. కానీ రాహుల్ చూపించిన సాధారణ దిశ, నిర్దేశాలు ఈనాటికి అనుసరణీయమైనవి.

రాహుల్ ఒక అద్భుతమైన మేధావి, సామాజిక, రాజకీయ కార్యకర్త. అతను సైద్ధాంతిక అంశాలపై రచనలు చేయడమే కాకుండా, వివిధ ప్రజా ఉద్యమాలలో చురుకుగా పాల్గొని సమాజ పరివర్తన కోసం పోరాడాడు.

ఎటువంటి రాజీ లేకుండా రాహుల్ హేతువాదానికి, సోషలిజానికి పూర్తిగా అంకితమయ్యారు. 1933లో ఒక పుస్తకంలో సోషలిస్ట్ ఇండియా భావనను గూర్చి వ్రాశారు. దీనిని కొనసాగిస్తూ '22వ శతాబ్ది' అనే ఊహాజనిత నవల రాశారు. నయే భారత్ కే నయే నేత పేరుతో మరొక పుస్తకం రాశారు.

ఇందులో సహజానంద సరస్వతి, ముజఫర్ అహ్మద్, పి.సి. జ్యోతి, అజయ్ ఘోష్, కల్పనాదత్ వంటి అనేకమంది ప్రజా నాయకుల, కార్యకర్తల జీవిత చరిత్రలు ఉన్నాయి. ఈ నాయకులు సామాజిక, ఆర్థిక, న్యాయ సూత్రాల ఆధారంగా నవభారతాన్ని నిర్మిస్తారని రాహుల్ ఊహించారు.

కేవలం సమాన పంపిణీ గూర్చి మాత్రమే కాకుండా ఉత్పత్తి పెరుగుదల గురించి రాహుల్ ఆలోచించారు. 22వ శతాబ్దం పుస్తకంలో ఉత్పత్తి పెంపుదలను గూర్చి వివరించారు. తన రచనలలో సైన్స్ ప్రాముఖ్యతకు ఇదొక ఉదాహరణ. హిందీలో సైన్స్‌పై అనేక రచనలు చేశారు. ఆయన ప్రసంగాలలో, మన విద్యాలయాలలో సైన్స్‌కు ఉన్నత స్థానం కల్పించాలని కోరారు. రాహుల్ ఏనాడు, సామాన్య ప్రజల పట్ల తన స్పృహ కోల్పోలేదు. అందుకే ఆయన రచనలు ఈనాటికి ప్రజాదరణ పొందుతున్నాయి. క్షేత్రస్థాయిలో పనిచేసే సామాజిక వేత్తలకు ఆయన రచనలు ఉపయోగపడుతున్నాయి.

ప్రజలను విద్యావంతులు చేయటానికి వారికి వారి భాష ద్వారానే విద్యను అందించాలని రాహుల్ ప్రభుత్వాన్ని కోరారు. మగహి, భోజ్‌పురి, అవధి మాండలికాలలో విద్యను ప్రోత్సహించాలని అన్నారు. భోజ్‌పురి ప్రాంతంలో ఆయన భోజ్‌పురి భాషలోనే ఉపన్యాసాలు యిచ్చేవారు. భోజ్‌పురి భాషలో పుస్తకాలు రాశారు. ప్రజలు వారి మాతృభాషలో విద్యను అభ్యసించకపోతే సాంస్కృతిక పురోగతిని సాధించలేమని రాహుల్ దృఢంగా భావించారు. రాహుల్ ఇంగ్లీష్, ఇతర విదేశీ భాషలలో రచనలు చేయగలడు, కానీ అంతర్జాతీయ గుర్తింపు ప్రలోభాలను ఆయన తిరస్కరించారు.

రాహుల్ సాంకృత్యాయన్ రచనలు చాలా శక్తివంతమైనవిగా నిరూపించబడ్డాయి. పాలక సమూహాల మద్దతు లేకుండా హిందీ లేకుండా మాట్లాడే ప్రాంతాలలో ఆయన రచనలు పునర్ముద్రించబడడం, చదవటం కొనసాగుతూనే వున్నాయి. రాహుల్ 1930–50ల మధ్య కాలంలో సోషలిజం, హేతువాదం, లింగ సమానత్వం భావనలను ఉత్పాదించారో, ఆ భావనల కొనసాగింపు నేటికీ అవసరం వుంది.



# 20

# అంబేద్కర్, రాహుల్జీల బౌద్ధ దార్శనికుడు !
# బదంత్ బోధానంద మహాస్తవిర్ !!

– గౌరవ్



బిక్కు బోధానంద సాంప్రదాయ మూసలో నున్న బౌద్ధాన్ని ఉత్తర భారతంలో బహుజన శ్రమణక మార్గంలోకి మళ్ళించిన మహా పండితుడు. డా. బి. ఆర్. అంబేద్కర్, మహా పండిత్ రాహుల్ సాంకృత్యాయన్ ఇద్దరికీ ఆధునికమైన మానవీయ బౌద్ధ తాత్వికతా స్ఫూర్తిని అందజేసిన నవయుగ వైతాళికుడు. "నేను ఎవరెవరికి కృతజ్ఞుడ్ని" అనే రచనలో రాహుల్జీ బిక్కు బోధానంద్ మహాస్తవిర్ గురించి రాస్తారు. 1916 లో రాహుల్జీ లక్నోలోని ఆర్య సమాజ్ భవన్లో ఉండగా ఆయన బోధానంద గురించి తెలుసుకుని ఆయన్ని వెళ్ళి కలుసుకుంటారు. బోధానంద వ్యక్తిత్వంతో ఎంతో ప్రభావితం అవుతారు. మళ్ళీ 15 ఏళ్ళ తరువాత 1931 లో కలుసుకుంటారు. నాటి గురించి రాస్తూ, "అప్పటికి ఆయన (బోధానంద) సంపూర్ణ మహా స్థవిరుడిగా మారారు.." అంటూ, "భారతదేశంలో బౌద్ధ వెలుగు ప్రసరించడానికి కారణమైన మొదటి వ్యక్తి బోధానంద" అని పేర్కొన్నారు.

ఉత్తర భారతంలోని మిర్జాపూర్ వద్ద చునార్ పట్నంలో ఒక బెంగాలీ కుటుంబం లో 1874 లో పుట్టిన ముకుంద్ ప్రకాష్ చిన్నతనం లోనే

తల్లిదండ్రులని పోగొట్టుకున్నాడు. బంధువు ఒకామెతో బనారస్ వెళ్ళాడు. పెద్దయ్యేకొద్దీ సామాజిక వాస్తవికతను అధ్యయనం చేసాడు. క్రమంగా మతం పట్ల విముఖత కలిగింది. దుర్మార్గమైన వర్ణ వ్యవస్థని అసహ్యించుకోసాగాడు. బెనారస్ లో ఉండగానే సాధు సన్యాసులతో కల్సి తిరుగుతూ క్రమంగా వాళ్ళలో ఒకడయ్యాడు. అప్పుడే స్వామి బోధానందగా మారాడు. తర్వాత 12 ఏళ్ళ పాటు దేశం మొత్తం విస్తృతంగా పర్యటించాడు.

అప్పుడే భిన్న మతాల్ని, సంస్కృతుల్ని దగ్గరగా, లోతుగా పరిశీలించాడు. నిజమైన మతం యొక్క పరమార్థాన్ని గ్రహించాడు. బ్రహ్మ సమాజం నుండి ఆర్య సమాజం దాకా, థియోసాఫికల్ సొసైటీ నుండి క్రిస్టియానిటీ వరకూ అన్ని మార్గాల్నీ మథించాడు. 1896 లో బెనారస్ ను కరువు తాకింది. ఆ దుర్భర పరిస్థితులలో క్రైస్తవ మిషనరీలు చేసిన సేవా కార్యక్రమాలు ఆకర్షించాయి. బాధితుల పట్ల క్రైస్తవులు చూపించే ఆర్ద్రత ఆయన్ని ఎంతగానో కదిలించింది. ఆయన క్రైస్తవ మతాన్ని స్వీకరించాలని నిర్ణయించుకున్నారు.

ఐతే, సారనాథ్ బౌద్ధ క్షేత్రంలో కలిసిన శ్రీలంక బౌద్ధ భిక్షువులు ఆయన్ని కదిలించిన మానవతా సారానికి సరైన మార్గం బౌద్ధం అని సూచించి ఆయన చదవడానికి వాసలసుత్త పుస్తకం ఇచ్చారు. భారతదేశంలోనే అంతటి గొప్ప మార్గంగా బౌద్ధం విరాజిల్లిన విషయం ఆయనని ఆనందంతో అబ్బురపర్చింది. అంతే, అదాయన జీవితాన్నే మార్చేసింది. తరువాత 18 ఏళ్ళ పాటు ఆయన బౌద్ధాన్ని కూలంకషంగా అధ్యయనం చేశారు. 1914 లో అంగారక ధమ్మపాల ఆధ్వర్యంలో, బదంత్ కృపాచరణ్ మహాస్తవిర్ దీక్ష ఇవ్వగా కోల్కతాలో బౌద్ధాన్ని స్వీకరించారు.

రాహుల్జీ ప్రకారం బోధానంద జీవిత అభిలాషలు ముఖ్యంగా మూడు, అవి 1) జన్మ స్థానమైన భారతదేశంలో బౌద్ధాన్ని పునరుద్ధరించడం 2) భారతదేశంలో కులాన్ని నిర్మూలించడం 3) పుస్తకాలు చదవడం. వివిధ భాషా గ్రంథాలతో ఉన్న ఆయన గ్రంథాలయాన్ని చూస్తే తెలుస్తుంది ఆయనెంత

జ్ఞాన పిపాసో. భారతీయ బౌద్ధ సమితి మొదలుకొని నవరత్న ఉద్యమం, త్రిరత్న ఉద్యమం, హిందూ వెనకబడిన జాతుల లీగ్ వంటివి ఎన్నింటినో స్థాపించి నిర్మించడమే కాదు, క్రియాశీలకంగా పాల్గొని నడిపించాడు కూడా. బౌద్ధం పట్ల అంబేద్కర్‌కి ప్రేరణ కలిగించింది బోధానంద మహాస్తవిర్. నిజానికి, బోధానంద నుండే అంబేద్కర్ బౌద్ధ దీక్ష స్వీకరించాలని అనుకున్నారు కానీ అప్పటికే బోధానంద కాలధర్మం చెందారు. బౌద్ధ ప్రచారం కోసం రచనలు కూడా చేసిన బోధానంద ఎంతోమంది సామాజిక కార్యకర్తల్ని, బహుజన రాజకీయ నేతల్ని తయారు చేసారు. స్వయంగా బ్రాహ్మణ కుటుంబంలో పుట్టినప్పటికీ 1928 నుండి బహుజన ప్రత్యామ్నాయ ఉద్యమానికి తిరుగులేని దిక్సూచిగా మారారు. కుల వ్యవస్థను కూకటివేళ్ళతో పెకలించడానికి కట్టుబడి జీవితాంతం పోరాటం చేసినాయన, 78 వ ఏట కోల్కతాలోని చిత్తరంజన్ హాస్పటల్‌లో కేన్సర్‌తో పోరాడుతూ మరణించారు.

భారతీయ సామాజిక పరిణామాన్నీ, సాంస్కృతిక చింతననీ ప్రగతిశీలకంగా ప్రభావితం చేసిన బదంత్ బోధానంద మహాస్తవిర్ వల్ల స్ఫూర్తి పొందిన అసంఖ్యాక వ్యక్తుల సాక్షిగా ఆయన వల్ల ప్రేరణ పొందిన డా. బి. ఆర్. అంబేద్కర్, మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్‌లు తదనంతర తరాలకీ, ముఖ్యంగా బౌద్ధ దార్శనిక దృక్పథానికి అందించిన అసాధారణ స్ఫూర్తిని గుర్తించి తర్వాత తరాలకి అందించడం సామాజిక పురోగమనాన్ని ఆశించే వారందరి అవసరం. ఆయన 70 వ వర్ధంతి సందర్భంగా ఆయన స్మృతిలో ఈ చిన్న రైటప్.

(కర్టసీ : ఫార్వర్డ్ ప్రెస్ ఇంటర్నెట్ ఆర్టికల్)



# 21

# కేదార్‌నాథ్ పాండే, రాహుల్ సాంకృత్యాయన్‌గా సాధించిన విజయాలు

**– కొత్తపల్లి రవిబాబు,** ప్రజాసాహితి, విజయవాడ, 9490196890

ఆయనకు నిరుపహతి స్థలంబు అంటే ప్రశాంత వాతావరణం, రమణీ ప్రియదూతిక ఇచ్చే కర్పూర తాంబూలమూ, ఊయల మంచమూ లేకుండా ఎక్కడబడితే అక్కడా, బస్సుల్లో, రైళ్ళల్లో, ప్లాట్‌ఫారాలపై, బస్టాండులో తీరిక దొరికితే చాలు రాసేసేవారు. దాదాపు 30 భాషల్లో ప్రావీణ్యం సంపాదించిన ఆయన 150 పుస్తకాలు పైగా హిందీలో రాశారు. వాటిలో యాత్రా రచనలున్నాయి. చరిత్ర, సామాజిక శాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, టిబెటాలజీ, తత్త్వశాస్త్రం, బౌద్ధం మొదలగు విషయాలపై గ్రంధాలే గాక నవలా సాహిత్యం, స్వీయ చరిత్ర కూడా రాశారు. ఆయనే రాహుల్ సాంకృత్యాయన్, 1893 ఏప్రిల్ 9న జన్మించి 1963 ఏప్రిల్ 14న తన 70 వ యేట మరణించారు.

మనదేశంలోనూ, విదేశాలలోనూ ఆయన రచనలతో, ప్రభావితమైన వారెందరో వున్నారు. ఉదాహరణకు ప్రముఖ తెలుగు ప్రజా కళాకారుడు కాకరాల ఎక్కడ ఉపన్యసించినా రాహుల్ గురించి ప్రస్తావించని సందర్భమే వుండదు. నేపాల్‌లోని కమ్యూనిస్టు పార్టీ నాయకుడు, 2009లో ప్రధానిగా పనిచేసిన పుష్పకమాల్ దహాల్ 'ప్రచండ' తనపై రాహుల్ ప్రభావం, గోర్కి 'అమ్మ' నవల ప్రభావం వుందని ప్రకటించారు.

ఉత్తరప్రదేశ్‌లోని అజంఘడ్ జిల్లాలోని కనైలా గ్రామంలో ఒక ఛాందస బ్రాహ్మణ పేద రైతాంగ కుటుంబంలో జన్మించిన కేదార్‌నాథ్ పాండేకు బాల్యంలో పాఠశాల విద్య లభించలేదు. చేతిలో డబ్బు వుండేది కాదు. రాజకీయపరమైన మద్దతు అసలే లేదు. ఇంటినుండి పారిపోయి వారణాసిలో పేద విద్యార్థిగా సంస్కృతం నేర్చుకున్నారు. బీహార్‌లోని వైష్ణవ మఠాధిపతి

ఆదరణలో సంస్కృత గ్రంథాలు అధ్యయనం చేసి ఆ మఠానికి వారసుడిగా ఎన్నికై స్వామి దామోదర దాసుగా పేరు మార్చుకున్నారు. అయితే ఆ గ్రంథాలలో వున్న అహేతుకమైన ఆచారాలను వ్యతిరేకిస్తూ ఆర్య సమాజంలో చేరి కేదార్‌నాథ్ విద్యార్థి పేరుతో హిందీ, ఉర్దూ భాషలలో రచనలు చేశారు. 1915 జనవరిలో ఆగ్రాలోని ఆర్య ముసాఫిర్ విద్యాలయంలో చేరి దయానంద సంస్కృత బోధనలు, సంస్కృతం, అరబిక్ భాషలు నేర్చుకున్నారు.

1919లో కాంగ్రెస్ పార్టీలో చేరి ఉత్తర బీహార్‌లో సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొని వెంటవెంటనే రెండుసార్లు అరెస్టు అయ్యారు. జైలులోనే వైసవిసదీ సైన్స్ ఫిక్షన్ రచనలో 22వ శతాబ్దపు ప్రపంచాన్ని ఊహించి రాశారు.

1926లో జైలు నుండి బయటకు వచ్చి, హిమాలయ యాత్ర చేసారు. యూరోప్‌లోని ప్రాచ్య భాషా పండితులు బౌద్ధం గురించి చెప్పిన విషయాలు అర్థం చేసుకోడానికి ఫ్రెంచి, జర్మన్ భాషలు నేర్చుకున్నారు. 1930లో గాంధీ నుండి విడగొట్టుకొని కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ సంస్థాపక సభ్యునిగా కృషి చేశారు. మార్క్సిస్టు సాహిత్యం అధ్యయనం చేసి, కమ్యూనిస్టు పార్టీ ప్రణాళికను హిందీ భాషలోకి అనువదించారు. 1938 నాటికి బీహార్‌లో కమ్యూనిస్టు పార్టీని ప్రారంభించి, భారత రైతాంగ ఉద్యమ నాయకుడయ్యారు. 1940లో అఖిల భారత కిసాన్ సభ అధ్యక్షునిగా ఎన్నికై, దాని అధికార పత్రిక 'హూంకార్'కు సంపాదకత్వం వహించారు.

1944లో బెజవాడలో జరిగిన కిసాన్ సభ వార్షిక సమావేశానికి హాజరైన రాహుల్, తుమ్మపూడిలోని సంజీవదేవ్‌ను కలుసుకొని, ఇద్దరూ నందికొండకు వెళ్ళి బౌద్ధ అవశేషాలను చూచి వచ్చారు.

ఆయన 1944లోనే ఇరాన్, లెనిన్‌గ్రాడ్‌లకు వెళ్ళారు. లెనిన్‌గ్రాడ్‌లోని ప్రాచ్య భాషా విభాగంలో సంస్కృతాన్ని బోధించడానికి వారిని ఆహ్వానించారు. ఆయన నాలుగుసార్లు టిబెట్‌లోని వివిధ బౌద్ధ మఠాలకు బౌద్ధ సన్యాసి వేషంలో వెళ్ళి, అక్కడ పాళీ, సంస్కృత భాషల్లో ఉన్న 700 నుంచి 800 అమూల్యమైన బౌద్ధ గ్రంథాల వ్రాతప్రతులు, తాళపత్ర గ్రంథాలు 22 కంచర గాడిదలపై

తీసుకుని వచ్చారు. 12వ శతాబ్దంలో బౌద్ధంపై జరిగిన దాడుల సమయంలో విక్రమశిల, నలంద విశ్వవిద్యాలయాలలోని బౌద్ధులు పారిపోతూ తమతో వీటిని తీసుకుపోయారు. ఇవన్నీ బౌద్ధంలోని మాధ్యమిక వాదానికి సంబంధించిన గ్రంథాలు. టిబెట్‌లో గడిపిన 4 1/2 నెలల్లో కొన్ని గ్రంథాలకి సంబంధించిన 1400 ఫోటోలు తీశారు. ఈ టిబెట్ యాత్రలలో ఆయనకు అశ్వఘోషుడు, ధర్మకర్తి, జ్ఞానశ్రీ మిశ్రా మొదలగు వారి అపురూపమైన గ్రంథాలు దొరికాయి. నాగార్జునుని 'విగ్రహ వ్యవర్తిని' సంపాదించాడు. ప్రతికూల వాతావరణాన్ని ధిక్కరిస్తూ ఎవరెస్టు శిఖరానికి తాపునే వున్న స్ఖాఖ్య మఠానికి వెళ్లారు. దుమ్ముతో నిండిన ఆ మఠంలోని తాళపత్ర గ్రంథాలలో 'ప్రమాణ వార్తిక భాష్యం' కనబడినపుడు ఎంతో ఆనందించాడు. దీని మొదటి అధ్యాయంపై ధర్మకీర్తి వ్యాఖ్యానం కూడా ఆయనకు లభించింది. 1929–1938 మధ్య టిబెట్‌కు నాలుగుసార్లు కాశ్మీర్, లడఖ్, కార్గిల్ నుండి చేసిన యాత్రలన్నీ కాలి నడకనా, అప్పుడప్పుడు కంచర గాడిదలపై చేసినవే. ఈ యాత్రల సందర్భంగా చేసిన అధ్యయన ఫలితంగా టిబెట్ – హిందీ శబ్దకోశం (డిక్షనరీ) తయారు చేశారు.

తన 70 ఏళ్ళ జీవిత యాత్రలో 45 ఏళ్ళపాటు యాత్రలలో గడిపిన రాహుల్, "ఘుమక్కడ్ శాస్త్ర' అనే యాత్రా రచన రచించి హిందీ సాహిత్యంలో యాత్రారచనకు ఒక సాహిత్య రూపాన్నిచ్చారు. ఆయన హిందీ భాషలో యాత్రా రచనకు ఆద్యుడు, తన యాత్రలలో భాగంగా ఆయన శ్రీలంక, జపాన్, కొరియా, చైనా, మంచూరియా, టెహ్రాన్, షిరాజ్, బలూచిస్థాన్, టిబెట్ మొదలైన ప్రాంతాలను సందర్శించారు.

'ఓల్గాసే గంగా' పుస్తకంలో క్రీ.పూ. 6000 నుండి 1942 లోని క్విట్ ఇండియా ఉద్యమం వరకు చరిత్ర ఆసక్తికరమైన 20 కథలుగా మలిచి అందించారు. రష్యన్ – సంస్కృతం శబ్దకోశం రూపొందించారు. పరిపాలనలో వాడుకోడానికి అవసరమైన హిందీ పదాలకోశాన్ని తయారుచేశారు. ఖురాను సంస్కృతంలోకి అనువదించారు. ఆయన హిందీలో రచించిన 'ఓల్గా సే గంగా',

'సింహ సేనాపతి', 'దర్శన్–దిగ్దర్శన్' 'పారిపోకు! ప్రపంచాన్ని మార్చు' మొదలగు గ్రంథాలకు తెలుగు అనువాదాలు వచ్చాయి. ఇంకా 'ఘుమక్కడ్ శాస్త్ర', 'మేరీ జీవనయాత్ర', 'దిమాగీ గులామీ', 'కిన్నెర్ దేశ్‌మే', 'మానవ్ కి కహానీ,' 'కార్ల్ మార్క్స్', 'జీనే కేలియే', 'యాత్రా కే పన్నే', 'సామ్యవాద క్యోం?', 'రాష్ట్రభాష హిందీ' మొదలగు గ్రంథాలు తెలుగు అనువాదాలు చేసుకోవాల్సిన బాధ్యత మిగిలే వుంది. అపభ్రంశ భాషలో వున్న బీహార్, బెంగాల్‌లోని సిద్ధ్ బైరాగుల దోహాలు సేకరించి వాటిపై రాహుల్ వ్యాసాలు రాశారు.

**కులం గురించి రాహుల్ భావాలు:**

'ఓల్గా సే గంగా' 'దిమాగీ గులామీ', 'తుహ్మారీ క్షయా', 'సామ్యవాద్ హీ క్యోం?', 'భాగోనహీ! దునియా కో బద్‌లో!' గ్రంథాలలో రాహుల్ హిందూ సమాజంలోని నిచ్చెనమెట్ల కుల వ్యవస్థ పట్ల తన నిరసన తెలియజేశారు. శూద్రులను, ఆధ్యాత్మికంగా, తాత్త్వికంగా అణచివేతకు గురిచేసిన వ్యవస్థను దుయ్యబట్టారు. మనదేశం తరచు విదేశీ దాడులకు గురి కావడానికి కారణం కేవలం క్షత్రియులే పోరాడాలనే నిబంధన విధించడం వల్లనే అని వ్యాఖ్యానించారు. కులవ్యవస్థలో ఆర్థిక ప్రయోజనాలున్నాయన్నారు. అస్పృశ్యులను అవమానించడాన్నీ, వారికి ఆర్థిక స్వాతంత్ర్యం నిరాకరింపబడటాన్నీ ఖండించారు. వస్త్ర దుకాణాలు, రసాయన దుకాణాలు, పచారీకొట్లు, కూరగాయల షాపులు, హోటళ్ళు అస్పృశ్యులు నడపరాదనే ఆంక్షలను నిరసించారు. గాంధీ అస్పృశ్యతపై చెప్పిన విషయాలను తిరస్కరించారు. అంటరానివారి దేవాలయ ప్రవేశమనేది గాంధీ పన్నిన ఉచ్చు కనుక దానికి ప్రాముఖ్యత ఇవ్వవద్దన్నారు. 'హరిజన' పద ప్రయోగాన్ని రాహుల్ అంగీకరించలేదు. 'హరిజనుడు' అంటే 'దేవుడి మనుషులు' అని అర్థం. కాని దేవుడే వారిని పట్టించుకోవడం లేదు అని వ్యాఖ్యానించారు. గాంధీ ప్రచారం చేసిన ఖద్దరు – నూలు వడకడం కూడా రాహుల్‌కు నచ్చలేదు. హరిజనులు ఏవో కొన్ని పైసల కోసం నూలు వడకటం కాదు. వారికి ప్రభుత్వ ఉద్యోగాలు కల్పించాలన్నారు. వారు వ్యాపారాలు చేసుకునే పరిస్థితులు కల్పించాలన్నారు. వారు వ్యాపారాలు చేసుకునే పరిస్థితులు కల్పించి, ఆర్థిక స్వాతంత్ర్యం పొందేటట్టు చేయాలన్నారు. కులాల నిర్మూలనకు,

కులాధారిత వివక్ష అంతం చేయడానికి, ఆర్థిక అసమానతలు లేకుండా చేయడానికీ కమ్యూనిజమే పరిష్కారమన్నారు.

1947లో జరిగిన ఒక అభ్యుదయ రచయితల సాహిత్య సమావేశంలో ముందుగా తయారుచేసి, నిర్వాహకులకు ఇచ్చిన ప్రసంగ పాఠాన్ని ప్రక్కనబెట్టి, రాహుల్ ఆశువుగా ప్రసంగిస్తూ మైనారిటీ సంస్కృతి – జాతీయ భాష అనే అంశాలపై కమ్యూనిస్టు పార్టీ విధానాలకు వ్యతిరేకంగా మాట్లాడారు. హిందీ జాతీయ భాషగా వుండాలన్నారు. దీని కారణంగా ఆయన పార్టీ సభ్యత్వం రద్దయింది. అయినా పార్టీకి ఆయన దూరం కాలేదు. 1953–4 లలో మరల సభ్యత్వాన్ని పొందారు.

**వివాహ జీవితం:**

రాహుల్ బాల్యంలోనే ఒక వివాహం జరిగింది. ఆ తరువాత మరల వివాహ ప్రస్తావన రాగానే ఇంటి నుండి పారిపోయి వారణాసి చేరి సంస్కృతం నేర్చుకొని, అక్కడ ఒక మఠానికి పీఠాధిపతి అయ్యారు. సోవియట్ రష్యాలో తనకు సహకరించిన మంగోలియన్ విదుషీమణి లోలా (Ellena Narvetovna Kozeroskaya)ను వివాహం చేసుకోగా వారికొక కుమారుడు ఇగోర్ జన్మించాడు. స్టాలిన్ విధానాలు నచ్చని రాహుల్ ఇండియాకు తిరిగి వచ్చే సందర్భంలో అప్పుడు అమలులో వున్న నిబంధనల వల్ల భార్యను, కొడుకునూ అక్కడే వదలి వచ్చేశారు. ఇండియాలో నేపాలీ రచయిత్రి, హిందీ పండిట్, అనువాదకురాలు అయిన కమలను వివాహమాడారు. ఆమె ఆగ్రా విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ సాధించారు. వాల్మీకి రామాయణాన్ని నేపాలీలోకి అనువదించారు. వీరికి ఇద్దరు కుమారులు జయంత్, జేతా, కూతురు జయ. జేటా డార్జిలింగ్‌లోని లోరీటా కళాశాల హిందీ శాఖాధిపతిగా పనిచేశారు. కమల 2009 అక్టోబర్ 26 న తన 89 ఏట మరణించారు. రాహుల్ 1963 ఏప్రిల్ 14 న డార్జిలింగ్‌లో తన 70 యేట మరణించారు.

**రాహుల్ ప్రాసంగికత:**

మనిషి తన జీవితంలో ఒక లక్ష్యాన్ని నిర్దేశించుకుని, దాని సాధనకై నిరంతర కృషి చేయాలని రాహుల్ జీవితం మనకు నేర్పుతుంది. జ్ఞాన పిపాస వుండటమే కాదు – లోతైన అధ్యయనం అవసరమని తెలుసుకుంటాం. సమయాన్ని సక్రమంగా వినియోగించుకోవడం ద్వారా అద్భుతమైన ఫలితాలను పొందగలమని రాహుల్ నేర్పుతున్నారు.

అన్నిటికన్నా ముఖ్యం. సామాన్య ప్రజల హిందీ భాషలో రాహుల్, చిన్న చిన్న వాక్యాలలో కొన్ని వేల పుటలు రచించారు. ప్రజల భాషకు పట్టం గట్టారు. ప్రజా రచయితలు తమ రచనలను ప్రజలకు తేలిగ్గా అర్థమయ్యే భాషలో లోతైన భావాలను, సిద్ధాంతాలను తెలియచేయాల్సిన బాధ్యతను రాహుల్ రచనలు మనకు గుర్తు చేస్తుంటాయి.



# 22

## భాషా సమస్య

**మూలం : రాహుల్ సాంకృత్యాయన్, తెలుగు : కొత్తపల్లి రవిబాబు**

భాషా సమస్యపై ఒక నిర్ణయం తీసుకోడానికి ముందు ఆ భాష మాట్లాడే ప్రజలను సంప్రదించాలన్న సూచన పాటించకపోవడం వల్ల ఆ సమస్య సంక్లిష్టత పెరుగుతోంది. భాషా సమస్యకు సంబంధించిన ప్రధాన అంశాలు ఈ క్రింద చూడండి.

1. మనది బహుభాషల, బహు జాతుల దేశం.

2. ఒక ప్రాంతంలో అత్యధికుల మాతృభాషే, పరిపాలనా భాషగా, బోధనా మాధ్యమంగానూ వుండాలి. బెంగాల్‌లో బెంగాలీ, ఒరిస్సాలో ఒరియా, ఆంధ్రాలో తెలుగు... వుండాలి. ఈ జాతీయ భాషలు వారి వారి ప్రాంతాలలో శ్రేష్టమైనవి. ఈ విషయంపై ప్రజల అభిప్రాయం కూడా అలానే వుంటుంది. తమ భాషను శ్రేష్టమైనదిగా అంగీకరించాలనీ, రాష్ట్రాలు కూడా భాష ఆధారంగా విభజింపబడాలని ప్రజలు గట్టిగా కోరతారు.

3. మనది బహుభాషల దేశం గనుక, అందరినీ కలిపి ఒక భాష – ఒకే ఫెడరల్ భాష – రోజువారీ సంభాషణ కోసం, విదేశీ సంబంధాల కోసం, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సమాచార మార్పిడి కోసం కావాలి. అటువంటి భాష మనకు లేకపోతే, ఇంగ్లీషును మనం ఎప్పటికీ వదిలించుకోలేము. ఇంగ్లీషును అంగీకరించడమంటే ప్రజలను విభజించి వుండచడమే అవుతుంది.

4. దేశంలో అత్యధిక ప్రజలకు పరిచయం వున్న భాషే ఫెడరల్ భాషగా వుండగలదు. ఆ భాష వివిధ ప్రాంతీయ భాషల్లోని పద సంపద కలిగి వుండాలి.

5. అటువంటి భాష హిందీ ఒక్కటే. దానిని బోధనా మాధ్యమంగా దేశంలోని సగభాగం అంగీకరించింది. అంతేగాక అది ఎప్పటినుండో సంస్కృతం నుంచి అవసరమైన పదసంపదను తనలో కలుపుకుంది కనుక

అది ఇతర భాషా ప్రాంతాల వారికి తేలికగా అర్థం అవుతుంది. ఈ విషయంలో హిందీకి ఉర్దూ పూర్తిగా వ్యతిరేకం – ఎందుకంటే ఉర్దూ భాష అరబిక్ భాష నుండి తన పద సంపదను పెంచుకుంది. కనుక ఉర్దూను ఫెడరల్ లేక యూనియన్ భాషగా అంగీకరిస్తే ఇతర ప్రాంతీయ భాషల వారికి ఎన్నో ఇక్కట్లను సృష్టిస్తుంది.

6. అయితే, వివిధ ప్రాంతీయ లేక రాష్ట్రీయ భాషల వారి ప్రతినిధుల అంగీకారంతోనే హిందీ కాని మరే ఇతర భాష కానీ ఫెడరల్ లేక యూనియన్ భాషగా గుర్తించవలసి వుంటుంది.

7. 'హిందీ ప్రాంతం' అనేది ఈ క్రింది 11 ప్రాంతాలుగా విభజింపబడి వుంది :– (1) బీహార్, (2) ఉత్తరప్రదేశ్, (3) మధ్యప్రదేశ్, (4) మధ్య భారత్, (5) రాజస్థాన్, (6) వింధ్య ప్రదేశ్, (7) పంజాబ్, (8) పెప్సు, (9) హిమాచల ప్రదేశ్, (10) అజ్మీర్, (11) భోపాల్. ఈ విభజనను భాషా ప్రయుక్త భాగాలుగా ఈ క్రింది విధంగా మార్చడానికి వ్యతిరేకత ఎందుకో నాకర్థం కాదు. (1) హర్యానా, (2) రాజస్థాన్, (3) మాల్వా, (4) బుందేల్ ఖండ్, (5) వ్రజ, (6) కురు, (7) హిమాచల్, (8) అవధ్, (9) భోజ్‌పూర్ (కాశీ – మల్లా), (10) మిథిల (11) మగధ. ప్రస్తుతం ఈ 11 రాష్ట్రాల పరిపాలనకవసరమైన ఆర్థిక వనరుల గురించి సమస్య లేనప్పుడు, వీటిని భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా మార్చినపుడు ఆర్థిక సమస్యనెందుకు లేవనెత్తుతున్నారు? ప్రజల భాషలు ఉపయోగించడం ద్వారా విద్యావ్యాప్తి, అక్షరాస్యతా వ్యాప్తిలో అతి తక్కువ సమయంలో విజయం సాధించవచ్చు. అదీగాక ప్రజల భాషకు తగిన స్థానం ఇవ్వకపోతే స్థానిక స్వపరిపాలనా సంస్థలలో (పురపాలక సంస్థ, కార్పొరేషన్లు, జిల్లా బోర్డులు) పనిచేసేవారి సహకారం మీకు లభించదు.

8. ఈనాటి ప్రజాస్వామిక యుగంలో ప్రజల భాషను ఎంతోకాలం నిర్లక్ష్యం చేయగూడదు. అంతిమంగా మనం లొంగిపోవాల్సిందే.

9. హిందీ ప్రాంతాల్లో వున్న వ్రజ, రాజస్థానీ, అవధి, మైథిలి భాషలు సాహిత్య భాషలుగా ఎప్పటినుండో వున్నాయి. మిగిలిన భాషల విషయంలో

కూడా, లిఖిత సాహిత్యం లేదన్న కారణంతో, వాటిని మాండలీకాలుగా పరిగణించలేము. ఎందుకంటే ఆ భాషలు కూడా అన్ని రకాల భావోద్రేకాలను ప్రకటించగల సామర్థ్యం కలవే గాక ఇప్పుడు ఆ భాషల్లో కూడా సాహిత్య సృష్టి ప్రారంభమైంది.

10. ప్రతి బాలుడూ, బాలికా తన భాషలోనే విద్యార్జన చేసే హక్కు కలిగి వుండాలి. మొత్తం దేశవ్యాప్తంగా కనీస సంఖ్యలో వున్న విద్యార్థులకు వారివారి మాతృ భాషల్లో విద్యాభ్యాసానికి అనువుగా ప్రత్యేక పాఠశాలలు ఏర్పాటు చేయాలి.

11. ఈ సూత్రం ప్రకారం, ఉర్దూ మాట్లాడేవారికి ఉర్దూ మాధ్యమం ద్వారా విద్య పొందే హక్కు వుండాలి. ఏ చిన్న ప్రాంతంలోనైనా సరే, అత్యధిక ప్రజల భాష ఉర్దూ ఐతే ఆ ప్రాంతంలో రాజ్యభాషగా వుండాలి. కాని "హిందీ ప్రాంతం' వర్గీకరింపబడిన భాషా ప్రాంతంలో, మెజారిటీ ప్రజలు ఉర్దూను తమ భాషగా చెప్పుకునేవారికి ఒక ప్రాంతం వుండదు. కనుక ఉర్దూకు అధికార భాషగా గుర్తించడమనేది అత్యధిక ప్రజల కోర్కెకు వ్యతిరేకంగా వుంటుంది. దీని ఫలితంగా ఉర్దూ సమర్థకులు అవాంఛనీయమైన పరిణామాలు ఎదుర్కొంటారు. మతతత్వవాదులకు ప్రయోజనకరంగా వుండే అనవసరమైన అసూయ ద్వేషాలు సృష్టింపబడతాయి.

ఉర్దూ సమర్థకులు అరబిక్ లిపి పట్ల ఆకర్షణ నుంచి బయటపడి దేవనాగరి లిపిని అంగీకరిస్తే అత్యధిక సంఖ్యలో ప్రజలు ఆ భాషను చదవగల్గుతారు. మధ్య యుగాల కాలంలో సాంస్కృతికంగా ప్రజలను విడగొట్టే ఆనాటి పాలకుల విధానం వల్ల ఉర్దూ భాష (అరబిక్, పర్షియన్ భాషలతో మిశ్రమమైన హిందీ) జన్మించింది. ఈనాడు మన దేశంలో గానీ, ఇతర దేశాలలో కానీ సాంస్కృతిక ఐక్యత అంగీకారమైన లక్ష్యం. దేవనాగరి లిపిని అంగీకరించడం ద్వారా ఆ లక్ష్యంవైపు ఒక అడుగు ముందుకు వేసినట్లవుతుంది.

**(సుధీప్రధాన్ సంపాదకుడుగా ప్రచురించిన Marxist cultural movement in India- మూడవ సంపుటి – పుటలు 220–222 నుండి)**



# 23

# నిత్య సత్య పరిశోధకుడు, గొప్ప పండితుడు, మహా రచయిత - రాహుల్జీ

– **డా॥ మలయశ్రీ,** శతాధిక గ్రంథకర్త–కవి,
బౌద్ధ – భౌతికవాద రచయిత, కరీంనగర్, సెల్ : 9866546220

నాకు రాహుల్జీ రచనలంటే ఎంతో ఇష్టం. ఆయన బహుగ్రంథకర్త. ఆయన పుస్తకాలలో నేను మొట్టమొదట చదివినది. 'ఘుమక్కడ్ శాస్త్ర' తెలుగు అనువాదం 'లోక సంచారి'. అది చదివితే, దేశాటన వల్ల విజ్ఞానం ఎంతగా పెరుగుతుందో తెలుస్తుంది. కేవలం తమ సంసారం సంపాదన కోసం, నూతిలోని కప్పలుగా బతికే వారికి దేశాటన విలువ ఏం తెల్సు? ఈ పుస్తకం చిన్నదే అయినా విలువలో మిన్నది. ఇది ఆయన అనుభవసార సంగ్రహ రచన.

"ఋగ్వేద ఆర్యులు, "వోల్గా నుంచి గంగా తీరం" వీరి అపార పాండిత్యానికి, సునిశిత పరిశీలనకు నిదర్శనంగా నిలిచిన వచన గ్రంధాలు. "దివోదాసు", "సింహసేనాపతి", "జయౌధేయ" నవలలు మనల మరో పూర్వ ప్రపంచానికి చరిత్రారంభ కాలానికి తీసుకు వెళ్తవి. "దర్శన్–దిగ్దర్శన్" ప్రపంచ మతాల లోతుల పరిశీలించి వివరించిన తాత్విక ఉద్గ్రంధం. "22వ శతాబ్ది" పుస్తకంలో రాహుల్జీ ఈ ప్రపంచంలో వర్ణ వర్గ – కుల మత భేదాలు లేని విశ్వైక ప్రభుత్వాన్ని ఊహించి ప్రతిపాదించి బలపరచుట, అపూర్వం – ఆశ్చర్యం, ఉదాత్త ఆశయం, బౌద్ధంపై వీరి రచనలు అనేకం. 30 భాషలు తెలిసిన పండితుడు. ఆయన నాలుగు భాషల్లో రచనలు చేసినా మాతృభాష హిందీలోనే అధికం.

రాహుల్జీ మొదటిపేరు కేదార్నాథ్ పాండే. ఉత్తరప్రదేశ్లోని ఒక సంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి, విద్య నార్జించాడు. మొదట ఆర్య సమాజవాది. బహుగ్రంథ పఠనతో మనస్సు మారి ఆ తర్వాత బౌద్ధాన్ని

అభిమానించి తన నామాన్ని సైతం మార్చుకొని బౌద్ధుడైనాడు. (రాహులుడు యశోధరా సిద్ధార్థ దశలోనే భిక్షాపాత్ర స్వీకరించి బౌద్ధ సంఘంలో నిష్ఠగా జీవించిన వినయశీలి. తల్లిదండ్రులకంటె ముందే నిర్వాణం చెందాడు. అతని సన్యాసి జీవిత విశేషాలు ఏవీ తెలియవు – లేవు. ఈ రాహుల్జీ గొప్ప విద్యావేత్త – బౌద్ధ సాహిత్య పరిశోధక సృష్టికర్త – పునరుజ్జీవన ప్రదాత. ఆ రాహులుని వినయం, త్యాగం, స్థిర నిర్ణయం, సాధు జీవనం, మన రాహుల్‌జీని ఎంతగా ఆకట్టుకున్నాయో– అందుకే ఆ పేరును తనదిగా చేసుకున్నారు!)

బౌద్ధ ధర్మాసక్తితో దేశాటన కావిస్తూ రాహుల్జీ టిబెట్టు చీనాలను దాటి, రష్యాచేరి, అక్కడ ఒక విశ్వవిద్యాలయంలో బౌద్ధాచార్యుడై రాణించుట విశేషం. టిబెట్టు నుండి నాలుగుసార్లు వందల (వేలు?!) భూర్జలీపత్ర బౌద్ధ గ్రంథాలను మన దేశానికి తెచ్చి చదివి చర్చించి సంస్కరించి అనువదించి ప్రచురించిన మహనీయ బౌద్ధ మేధావి రాహుల్ సాంకృత్యాయన్. ఆయన ఆజానుబాహుడు – స్ఫురద్రూపి! సంజీవదేవ్ గారి ఒకానొక వ్యాసంలో వీరి రూపవర్ణన చదివినట్లు గుర్తు. అందమైన వాళ్ళు అధిక జనాదరణ పొందగలరు. అధిక జనాల ఆకర్షించి సులభంగా మోసపుచ్చగలరు. తాముకూడా చెడిపోయే అవకాశాలు ఎక్కువ. అందానికి తోడు విద్య, వీరత్వం తోడైతే ఇక చెప్పే పని లేదు. నీతిపరుల విషయం వేరు. రాహుల్జీ నైతిక నిష్ఠా గరిష్ఠుడు. తన పాండిత్యం, పరిశోధన, గ్రంధ రచన, ధనార్జన కోసం అని రాహుల్జీ ఏనాడూ అనుకోలేదు. ధర్మ జిజ్ఞాసతో సత్యశోధన, సమాజ హితం అభ్యున్నతి కోసం అతని రచనలు బోధన ముందుకు సాగినై.

రాహుల్జీ రచించిన "రుగ్వేద ఆర్యులు" గ్రంథంలోని ఆరంభ పంక్తులు చూడండి.

"రెండేండ్ల నాడు నేను యిలాంటి పుస్తకాన్ని వ్రాస్తానని ఎవరైనా అంటే, నాకు నమ్మకం ఉండేది కాదు. నిజంగా ఇలాంటి పుస్తకం మన భాషలో కాని, ఇతర భాషల్లోనే కాని లేనందునే వ్రాయవలసి వచ్చింది. రుగ్వేదం నుండి మనకు లిఖిత సామగ్రి ప్రారంభమవుతుంది. దేవుడు అబద్దం. కాని,

అనేక దేవుళ్ళు కళలకు ఆధారాలైనందున వారు మనకు అమూల్యంలూ ఆదరపాత్రులూ అవుతున్నారు. ఇట్లే వేదం దేవుని సృష్టి కాదు, దివ్య పురుషుల వాణి కాదు. కాని, అది మన సంస్కృతికి విజ్ఞానానికి చరిత్రకు కాణాచి. అందుచేత అది మనకు సర్వోత్కృష్టమైన అమూల్య నిధి. దీన్ని రచించినవారు తరతరాల వరకు కంఠస్థం చేసి అతి జాగ్రత్తగా కాపాడినవారు మన హృదయ పూర్వక కృతజ్ఞతలకు పాత్రులు."

ఇంకా – మనం దాన్ని వైజ్ఞానిక దృష్టితో పరిశీలించాలి తప్ప, ఆధ్యాత్మిక తత్వాన్ని, రహస్యాన్ని తెలుసుకుంటామని కాదు – అన్నారు. అది నాటి వారల ఆలోచనల సమాహారం. ఈ రుగ్వేదం తామ్రయుగం మనకు ఇచ్చిన నిధి – అనీ అన్నారు. ఇతర మహా రచయితలకు రాహుల్జీకి ఉన్న తేడా ఇది. ఇతర గొప్ప కవులు – రచయితలు ఎవరెన్ని నీతులు చెప్పినా అది వైద విధేయతతోనే కదా. కాని, సాంకృత్యాయన్ చదివింది రాసింది అంతా ధర్మజిజ్ఞాస సత్యశోధనతోనే, సమాజ హితం కోసమే.

రాహుల్జీ రష్యా నుంచి భారతదేశానికి వచ్చి ఇక్కడ క్రియాశీల రాజకీయాల్లో పాల్గొన్నారు. తాను మార్క్సిస్టుగా మారినా బౌద్ధాన్ని మరచిపోలేదు. జైలుశిక్షలను అనుభవించాడు. కారాగారాల్లో ఉన్న కష్టకాలంలోనూ అనేక గ్రంథాలు చదివాడు – రాశాడు. పఠన – రచన ఆయన నిత్యకృత్యాలు. చరిత్ర, బౌద్ధం, మార్క్సిజం, వ్యక్తి స్వేచ్ఛ ఆయన నమ్మిన సిద్ధాంతాలు. జీవిత కాలమంతా (1893–1963) అందుకే శ్రమించాడు. డి.డి. కోశాంబికి చరిత్ర పరిశోధన – రచనలో రాహుల్జీ మార్గదర్శి అనవచ్చు.

నా పుస్తకాల రచనల్లో రాహుల్జీ ప్రస్తావన 2 సార్లు వచ్చింది.

1) అశ్వఘోషుని 'వజ్రసూచి' (సంస్కృతం) అనువాదం నాది. విశాఖ 'నాస్తిక యుగం' మాసపత్రికలో నా 'సత్యసూక్తం' లోని నా "మానవ గీత" శ్లోకాలు చూసి టి. రవిచంద్ మిళింద పబ్లిషర్ గుంటూరు లేఖల ద్వారా నాతో పరిచయం పెంచుకొని, 'వజ్రసూచిని' నా చేత అనువాదం చేయించి పుస్తకంగా ప్రచురించుట జరిగింది 1997. అది "కుల వర్ణ విభేదాల ఖండన, 37 సూత్రాల విలువైన పుస్తకం. విశ్వమానవ సమానత్వ సందేశం.

వజ్రసూచి అనువాదం కాలంలో మాకు రాహుల్జీ ప్రస్తావన వచ్చింది. ఎందుకంటే అతని ప్రముఖ గ్రంథం "వోల్గా నుంచి గంగాతీరం"లోని 19 కథల్లో 11వ కథ "ప్రభ" అశ్వఘోషుని ప్రేయసి. అతని తల్లి సువర్ణాక్షి (ఆ పేరును పట్టి చూస్తే, హిందూ పురాణాల్లోని "హిరణ్యాక్ష" పదం సృష్టింపబడవచ్చు. అనాత్మ నిరీశ్వర బౌద్ధ జైనాల ప్రభావంతోనే వైదికమతం మారి, పురాణ గాథల విగ్రహారాధనల హిందూ మతం అయ్యింది కదా!) కుల వర్ణ నిబంధనల కారణంగా అశ్వఘోషునికి ప్రభతో పెళ్ళి కాలేదు. అమె గ్రీకు యువతి. అతడు వైదిక బ్రాహ్మణుడు. తన అనుభవం కారణంగానే అప్పుడు అతడు కుల ఖండన గ్రంథం వజ్రసూచిని రచించి యుండవచ్చు. ప్రభ కథలో ఈ పుస్తకం పేరు 'వజ్రచ్ఛేది', వివాహం విఫలమైన తర్వాత బౌద్ధ సాధుగా మారి – బుద్ధ చరిత్ర, సౌందర్య నందం మహాకావ్యాలను, శారీ పుత్ర ప్రకరణం నాటకాన్ని రచించిన సంస్కృత మహాకవి అశ్వఘోషుడు.

2) నవదీక్షిత బౌద్ధులు – మిళింద ప్రచురణ. 2002. ఈ పుస్తకం రాహుల్ సాంకృత్యాయన్ హిందీ రచనకు నా (డా॥ మలయశ్రీ) తెలుగు సేత. విషయం – డా॥ బి.ఆర్. అంబేద్కర్ నాలుగైదు లక్షల అభిమాన అనుయాయులతో 14 అక్టోబర్ 1956 "విజయ దశమి" రోజున బౌద్ధ ధర్మ స్వీకారం చేసిన సందర్భంగా రాహుల్జీ ప్రశంస. బౌద్ధుడుగా మారిన తర్వాత అంబేద్కర్ జీవించినది కేవలం రెండు మాసాలే – ఒకనెలా 23 రోజులు. ఆయన 6 డిసెంబర్ 1956 న కీర్తి శేషులు. విశ్రాంతి కోసం అంబేద్కర్ నేపాల్లో ఉన్నపుడు నవంబర్లో రాహుల్జీ అంబేద్కర్ను కల్సి ముచ్చటించిన విషయం ఈ పుస్తకం. ఇది వారి రెండవ కలయిక. మొదటిసారి అంబేద్కర్ కేంద్ర ప్రభుత్వ న్యాయశాఖ మంత్రిగా ఉన్నపుడు రాహుల్ ఢిల్లీలో ఆయనను కల్సి పలు విషయాలు మాట్లాడినారట. ప్రముఖ దళిత నేత, భారత రాజ్యాంగ గ్రంథ నిర్మాత అంబేద్కర్ బౌద్ధ స్వీకారాన్ని భారత కమ్యూనిస్టులు, హిందువులు విమర్శిస్తే, ప్రముఖ మార్క్సిస్టు, బౌద్ధ మహా రచయిత రాహుల్జీ సమర్థించుట విశేషం. నేపాల్లో అంబేద్కర్ను రాహుల్జీ కల్సి మాట్లాడింది 1956 నవంబర్ 3వ వారంలో అనవచ్చు. ఎందుకంటే, ఆయన బౌద్ధ ధర్మదీక్ష 14 అక్టోబర్ 56. ఆ తర్వాత అనారోగ్యం వల్ల నేపాల్లో ఉన్నారు. 6 డిసెంబర్ 56

నిర్వాణం. 20 నవంబర్ 1956 నాడు నేపాల్ ఖాట్మాండులో ప్రపంచ బౌద్ధ ప్రతినిధుల మహాసభ జరిగింది. రాజా మహేంద్ర, భంతేజీ సత్యమణి వేదికపై ఉండగా, బి.ఆర్. అంబేద్కర్ ప్రసంగిస్తున్న ఫోటో ఒకటి ఈ మధ్య 'బుద్ధభూమి' మాసపత్రిక డిసెంబర్ – 2021 కవర్ 3వ పుటలో కనిపించింది. ఆనాటి అంబేద్కర్ ప్రసంగం "బుద్ధ అండ్ కార్ల్ మార్క్స్", ఆ సభకు రాహుల్జీ తప్పక వచ్చి ఉంటాడు. అంటే, ఆ సభకు ఒక రోజు ముందో వెనుకో నవంబరు 19 లేదా 21 తేదీన రాహుల్జీ అంబేద్కర్‌ను కల్సి మాట్లాడి ఉంటాడు. ఈ 'నవదీక్షిత బౌద్ధ్' వ్యాసాన్ని మాత్రం అంబేద్కర్ మృతి (6 డి 56) తర్వాత 1957 జనవరిలో కరపత్రంగా ముద్రించి పంచాడు.

ఈ వ్యాసం 'వజ్రాదపి కఠోరాణి' అనే శీర్షిక 2 పుటల పీఠికతో ఆరంభమైంది. ఆ శీర్షిక భవభూతి మహాకవి రచించిన "ఉత్తర రామ చరితమ్" సంస్కృత నాటక శ్లోకపాదం. ఆ తర్వాత "నవదీక్షిత బౌద్ధులు" వ్యాసం (20 పుటలు) బౌద్ధం గొప్పతనం, దీనికి ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ఖ్యాతి, భారతదేశంలో బౌద్ధానికి ఉన్న స్థానం. మనం బౌద్ధాన్ని ఆదరించి కాపాడుకోవలసిన బాధ్యతను గుర్తు చేస్తుంది. అంబేద్కర్ గారి నాగపూర్ బౌద్ధ ధర్మ స్వీకారం చాలా మంచి నిర్ణయం. అది బౌద్ధానికి జన్మభూమిలో పునరుజ్జీవనం అని ఎంతగానో మెచ్చుకున్నాడు. మరోమాట – ధర్మ స్వీకారం వల్ల నైతిక జీవనం అలవడుతుంది తప్ప, దళిత హిందువు ఆర్థిక పరిస్థితి మారదు కాబట్టి, నవదీక్షిత బౌద్ధులకు ప్రభుత్వం రిజర్వేషన్ హక్కులు ఆపివేస్తే న్యాయం కాదన్నాడు.

ఈ వ్యాసంలో మతమూఢ విశ్వాసాల ఖండన సందర్భంలో ఒకచోట 6వ, శతాబ్ది బౌద్ధ రచయిత 'ధర్మకీర్తి' వార్తిక శ్లోకాన్ని ఆయన ఉదహరించాడు. అది ప్రతి వ్యక్తీ చదివి ఆచరించతగింది. అది ఇది. మీరూ చదవండి.

శ్లో॥ **వేదప్రామాణ్యం, కస్యచిత్ కర్తృవాద,**
**స్నానే ధర్మేచ్ఛా, జాతి వాదావలేపః।**
**సంతాపారమ్భ పాపహానాయ చేతి,**
**ధ్వస్త ప్రజ్ఞానాం పంచలింగాని జాడ్యే॥**

(వేద ప్రామాణ్యం, సృష్టికర్త భావన, పుణ్య స్నానాలు, వర్ణభేదం, పాప నివారణ ప్రాయశ్చిత్తాలు – ఇవి అయిదు అవివేకుల మూర్ఖపు చేతలు)

అదీ ఆయన క్రమ పరిణామ వికాసం!

ఈ 'నవదీక్షిత బౌద్ధులు' మా తెలుగు పుస్తకం గురించి 'వార్త' దినపత్రిక (తేది. 25–1–1998) ఎబికె ప్రసాద్‌గారి ప్రశంసాత్మక సంపాదకీయం వచ్చింది. 'విజయ విహారం' పత్రిక కూడా మెచ్చుకుంది.

ఇక్కడ ఒక్కమాట – ఈ మా "నవదీక్షిత బౌద్ధులు" పుస్తకం అచ్చులో ఉన్న సమయంలోనే 'జనసాహితి – ప్రజా సాహితి' ఎడిటర్ కొత్తపల్లి రవిబాబు తెనాలిలో 28–4–2002 తేదీన 'రాహుల్ సాంకృత్యాయన్ జీవితం – సాహిత్యం'పై సెమినార్ పెట్టి వక్తగా నన్ను ఆహ్వానించారు. వెళ్ళిన. ఆనాటి నా ప్రసంగ శీర్షిక – నాకు నచ్చిన రాహుల్జీ. ఆ కరపత్రం ఇప్పటికీ నా వద్ద ఉంది.

ఆనాటి సభలో అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి, డా॥ ఎన్. అంజయ్య, దివికుమార్ మొ॥ రచయితల ఎందరినో కల్సుకున్న. రాహుల్జీ పుస్తకాల్ని అనువదించి ప్రచురించిన ఆలూరు భుజంగరావు, ఇటీవలే కాలధర్మం చెందిన ఆయన భార్య లలితమ్మ గారలతో మాట్లాడి వారికి కొన్ని నా పుస్తకాలిచ్చిన.

మరో విశేషం – ఆ సభకు రాహుల్జీ బంధువు (అన్నగారి మనుమడు) అనిల్ కుమార్ పాండే విశిష్ట అతిథి. విరామ సమయంలో నేను ప్రత్యేకంగా వారిని కలిసి మాట్లాడిన. తాతయ్యగారిని గురించి వినటం, ఆయన రచనలు చదవటం తప్ప ఈయన రాహుల్జీని చూడలేదట. నేను అడిగిన ఒకే ఒక ముఖ్య ప్రశ్న – రాహుల్జీకి (కేదార్‌నాథ్ పాండే) వివాహమైనా భార్యను వదలి సన్యాసి అయ్యిండు కదా. ఆమె జీవితం ఏమయ్యింది? అని. ఆమె పుట్టింటికి పోక జీవితాంతం అత్తవారింటిలోనే ఉండి ఈ పిల్లల ఆలనాపాలనా చూసిందట.

రాహుల్జీ చివరి కాలంలో సేవ చేసిన కమల అతని మూడవ భార్య. రెండవ భార్య రష్యా యువతి. ప్రొఫెసర్. చార్లీ చాప్లిన్ జీవిత చరిత్ర (డా॥ వాసిరెట్టి భాస్కరరావు వరంగల్ గారి రచన) చదివిన. చాప్లిన్‌కు నలుగురు భార్యలట. మొదటి ముగ్గురితో విడాకులే. ఏమిటో కొందరు ప్రముఖ వ్యక్తుల జీవితాలు, స్వభావాలు,– వింత మలుపులతో, విచిత్రంగా ఉంటున్నవి.

రాహుల్ సాంకృత్యాయన్ అపార పాండిత్యం, అపూర్వ పరిశోధన. అపురూప గ్రంథాల రచన. అంతా సమాజహితం కోసం. అందుకే రాహుల్జీ సాహిత్యంపై నాకు అభిమానం.

*సెలవిప్పటికి, స్నేహమెప్పటికీ!*



# 24

# మనం మరిచిన మహామేధావి మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్

**– సంగిరెడ్డి హనుమంతరెడ్డి,** ప్రోగ్రెసివ్ ఫోరం, గుంటూరు, 9490204545

రాహుల్ సాంకృత్యాయన్ అనేక రంగాల్లో విస్తృత విశేష కృషిచేశారు. ప్రభావశీల తోడ్పాటును అందించారు. అయినా చరిత్రకారులు, తత్వవేత్తలు, రచయితలు, రాజకీయ కార్యకర్తలు ఆయనను మందకొడిగానే స్మరించుకుంటున్నారు. నేటి తరం విద్యావేత్తలకు, విద్యార్థులకు రాహుల్ సాంకృత్యాయన్ ఎవరో తెలియదు.

రాహుల్ సాంకృత్యాయన్ కులవంతి దేవి, గోవర్ధన్ పాండే దంపతులకు, తన అమ్మమ్మ గారి ఇంట, ఉత్తర ప్రదేశ్ ఆజమ్ ఘర్ జిల్లా పాండహ గ్రామంలో సనాతన సరయుపరిణ (భూమిహార్) బ్రాహ్మణ కుటుంబంలో 1893 ఏప్రిల్ 9 న జన్మించారు. తల్లిదండ్రులు ఆయనకు పెట్టిన పేరు కేదార్ నాథ్ పాండే. రాహుల్ చిన్న వయసులోనే తల్లిని కోల్పోయారు. 1898లో తాతగారి ఊరిలో ఉన్న ఒకే ఒక పాఠశాల మదర్సాలో ప్రాథమిక విద్యను అభ్యసించారు. ఉర్దూ నేర్చుకున్నారు. ఆయన సహాధ్యాయులు అందరూ ముస్లింలే. అటు తర్వాత ఇంటివద్దే అనేక భాషలను అభ్యసించారు. తర్వాతి కాలంలో ఫోటోగ్రఫీ కూడా నేర్చుకున్నారు.

తన బాల్య జీవితం గురించి తనకు ఏమీ తెలియని అతి చిన్న వయసులో రాహుల్‌కు సంతోషితో పెళ్లి జరిగింది. తన స్వీయ చరిత్ర 'నా జీవన యాత్ర' ప్రకారం రాహుల్ తన 40 ఏళ్ల వయసు లో ఒకే ఒకసారి ఆమెను చూశారు. లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంలో బౌద్ధాన్ని బోధించమని సోవియట్ యూనియన్ రాహుల్‌ను రెండవసారి ఆహ్వానించింది. ఆ కాలంలో మంగోలియన్ పండితురాలు లోలా (ఎలెనా నర్వర్తోవ్న కోజెరోవ్స్కయ)తో పరిచయమైంది. ఆమెకు ఫ్రెంచ్, ఆంగ్లం, రష్యన్ మాట్లాడటం, సంస్కృతంలో రాయడం తెలుసు.

టిబెటన్–సంస్కృతం నిఘంటువు రచనలో ఆమె రాహుల్‌కు సాయపడ్డారు. వీరి అనుబంధం పెళ్ళికి దారితీసింది. ఈ దంపతులకు కొడుకు ఇగోర్ రాహులోవిచ్ జన్మించాడు. తనకు కేటాయించిన బోధన కార్యక్రమం ముగియగానే రాహుల్ ఇండియాకు రావలసి వచ్చింది. అయితే భార్య లోలా, కొడుకు రాహులోవిచ్‌లు ఇండియా రావడానికి రష్యా ప్రభుత్వం అనుమతించలేదు. తర్వాతి జీవితంలో నేపాలీ మహిళ హిందీ, నేపాలీ భాషలలో రచయిత, సంపాదకురాలు, పండితురాలు, అనువాదకురాలు డాక్టర్ కమల పెరియార్ (సాంకృత్యాయన్)ను రాహుల్ వివాహం చేసుకున్నారు. కమల పశ్చిమ బెంగాల్ కలింపాంగ్ పట్టణంలో 1920 ఆగస్టు 15న జన్మించారు. ఆమె హిందీ, నేపాలీ భాషలలో 13 పుస్తకాలు రచించారు. 500 లకు పైగా ఇతర రచనలు చేశారు. హిందీ, నేపాలీ సాహిత్యంలో అనేక ప్రాంతీయ, జాతీయ పురస్కారాలు పొందారు. డార్జిలింగ్ లోరెటొ కళాశాలలో హిందీ విభాగ అధిపతిగా పని చేశారు. డార్జిలింగ్‌లో 09.10.2009న మరణించారు. కమల, రాహుల్ సాంకృత్యాయన్‌లకు కొడుకులు జయంత్, జేత, కూతురు జయ (పాఠక్) జన్మించారు. జేత ఉత్తర బెంగాల్ యూనివర్సిటీలో ఆర్థికశాస్త్ర ఆచార్యులు. జయంత్ పూణే లో ఆటొమోటివ్ డిజైనర్.

రాహుల్ చిన్న వయసులోనే స్పష్టంగా తెలియని కారణాలతో ఇల్లు వదిలి వెళ్లిపోయారు. సన్యాసులు, భిక్షువులతో కలిసిపోయారు. కలకత్తాలో పొగాకు కొట్టులో సహాయకునిగా పనిచేశారు. సాధువుల సాంగత్యంలో గంజా తాగేవారు. గాంధీని పెట్టుబడిదారుల ప్రతినిధి అని విమర్శించేవారు. గాంధీ హత్య తర్వాత తన అభిప్రాయం మార్చుకున్నారు. గంజా మానేశారు. అప్పుడప్పుడు మాంసాహారం తినేవారు. కుంభమేళాలో పెద్ద సాధువుల ఘోరమైన కొట్లాటలు చూసి విసుగెత్తిపోయారు. జంతుబలులకు వ్యతిరేకంగా సమావేశం ఏర్పాటు చేసినందుకు సనాతన పూజారులు రాహుల్‌ను చితకబాదారు. గృహస్తులను మోసం చేసిన కపట సాధువులపై రాహుల్

వ్యాసాలు రాశారు. గంజాయి తాగే పూజారులు, యోగినుల మధ్య లైంగిక వ్యవహారాలను ఎగతాళి చేశారు. 18 వ ఏట వారాణసిలో చక్రపాణి బ్రహ్మాచారి మఠంలో చేరారు. 19 వ ఏట సన్యాసి రామ్ అవతార్ శర్మ పరిచయంలో అనేక అంశాల్లో అనుభవం గడించారు. 1915 లో ఆగ్రాలో ఆర్చ్ ముసాఫిర్ స్కూల్‌లో చేరారు. ఆ సంస్థ ప్రచురించే పత్రిక ముసాఫిర్‌లోను హిందీ పత్రిక భాస్కర్‌లోనూ అనేక వ్యాసాలు రాశారు. తర్వాతి రోజులలో రాహుల్ సాంకృత్యాయన్ స్వామి దయానంద సరస్వతి స్థాపించిన వైదిక పిడివాద ఆర్య సమాజ్‌ను అనుసరించారు. హిందు సన్యాసి బాబా రామ్ ఉదార్‌దాస్ పేరును తన పేరుగా మార్చుకున్నారు. తర్వాత శ్రీలంకలో బౌద్ధ దీక్ష తీసుకున్నారు. బుద్ధిజం రాహుల్ జీవితాన్ని మార్చింది. దేవునిపై నమ్మకం కోల్పోయినా పునర్జన్మను నమ్మేవారు. గౌతముని కుమారుని పేరు రాహుల్‌కు తన గోత్రం సాంకృత్యను జోడించి రాహుల్ సాంకృత్యాయన్‌గా పేరు మార్చుకున్నారు.

విశాలమైన నుదురు, ఎద, భుజాలతో ఆరడుగుల నిండైన విగ్రహం రాహుల్‌ది. ఆయన స్వాతంత్ర సమరయోధుడు. రచయిత. బహుళ శాస్త్రజ్ఞుడు. బహుభాషా కోవిదుడు. అయినా ప్రధానంగా హిందీలో రచనలు చేశారు. బౌద్ధ సన్యాసి జీవితం తర్వాత రాహుల్ మార్క్సిస్టు సోషలిజాన్ని అనుసరించారు. ఉదారవాద మానవవాదిగా, రాజీలేని సనాతన సంప్రదాయ వ్యతిరేకిగా మారారు. రాహుల్ హిందీ భాషా ప్రేమికులు. “నేను నా పేరు, రూపురేఖలను, ఆహారపు అలవాట్లను, సంప్రదాయాలను మార్చుకున్నాను. కాని హిందీ పట్ల అభిప్రాయాలను మార్చుకోలేదు.” అనేవారు. రాహుల్ ఖురాన్‌ను అరబ్బీ నుండి సంస్కృతంలోకి అనువదించారు. రాహుల్‌కు లాంఛనప్రాయ విద్య చాలా తక్కువ. ఐనా ఆయన పాండిత్యం, విషయ పరిజ్ఞానం, బోధనా పటిమను గమనించిన లెనిన్ గ్రాడ్ విశ్వవిద్యాలయం రాహుల్‌ను 1937–38లలో, తిరిగి 1947–48లలో చరిత్ర అధ్యయన ఆచార్యులుగా నియమించుకుంది. రష్యాలోని అతి పురాతనమైన, విశాలమైన ఈ ప్రభుత్వ పరిశోధన

విశ్వవిద్యాలయం సెయింట్ పీటర్స్ బర్గ్ నగరంలో ఉంది. ప్రజా సంబంధ, ప్రజావసర పరిజ్ఞానాన్ని గుర్తించడంలో నాటి సోవియట్ యూనియన్ పేరుగాంచింది.

విస్తృతంగా ప్రపంచ పర్యటన చేసిన భారతీయ పండితులలో రాహుల్ ప్రముఖులు. 45 ఏళ్ల పాటు ప్రపంచాన్ని పర్యటించారు. ఈయనను భారతీయ పర్యాటక పితామహుడు అంటారు. సాంకృత్యాయన్ చాలా దేశాలు పర్యటించారు. అనేక పర్యాటక గ్రంథాలు రచించారు. తన పర్యాటక అనుభవాలను ప్రామాణికంగా వివరించారు. దర్శించిన ప్రదేశాల ప్రాంతీయ, చారిత్రక, సాహిత్య అంశాలను వివేచనతో, జ్ఞానయుక్తంగా పొందుపరిచారు. పర్యటన చరిత్రకు సాహిత్య రూపం కల్పించటంలో కీలక పాత్ర పోషించారు. రాహుల్ 11 ఏళ్ల పాటు భారత దేశమంతా తిరిగారు. లడక్, కిన్నౌర్, కశ్మీర్ ప్రాంతాలలో, నేపాల్, టిబెట్, శ్రీలంక, ఇరాన్, చైనా, పూర్వ సోవియట్ యూనియన్‌లలో పర్యటించారు. బిహార్‌లోని సారన్ జిల్లా పర్సాగఢ్ గ్రామంలో చాలా సంవత్సరాలు గడిపారు. ఆ గ్రామ ప్రవేశ ద్వారానికి రాహుల్ ద్వారం అని పేరుపెట్టారు. ఆయన ప్రయాణాలన్నీ భూమార్గాల్లోనే సాగాయి. కొన్ని దేశాలలో రహస్య రూపాలలో తిరిగారు. టిబెట్‌లో బౌద్ధ సన్యాసిగా పలు మార్లు ప్రవేశించి, విక్రమశిల, నలంద విశ్వవిద్యాలయాల గ్రంథాలయాల నుండి పట్టుకెళ్ళిన విలువైన చిత్రలేఖనాలు, పాళి, సంస్కృత భాషలలో వ్రాతప్రతులను మళ్ళీ తీసుకొచ్చారు. 12వ శతాబ్దంలో అటు తర్వాత టిబెట్‌కు పారిపోయిన బౌద్ధ సన్యాసులు ఈ చిత్రలేఖనాలు, వ్రాత ప్రతులను తీసుకెళ్లారు. వీటిని 22 కంచర గాడిదలపై రాహుల్ ఇండియా తెచ్చారట. ఆయన గౌరవార్థం పట్నా మ్యూజియంలో, ఈ వస్తువులతో, ఒక ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటు చేశారు.

రాహుల్ సామాజిక సంస్కర్త, బహుభాషా కోవిదుడు. 30 భాషల్లో, అనేక మాండలీకాలలో ప్రావీణ్యం కలవారు. 12 భాషలలో రాయగల సామర్థ్యం ఉంది. అరబిక్, పార్సీ, తమిళ్, కన్నడం లాంటి దక్షిణ భారత భాషలు, టిబెటన్, సింహలీస్, రష్యన్, ఫ్రెంచ్ వంటి విదేశీ భాషల పాండిత్యం ఆశ్చర్యకరం. రాహుల్ భారతీయ శాస్త్రజ్ఞుడు, పురావస్తు శాస్త్రవేత్త. ప్రాచీన శాసనాల అధ్యయనం, శిలాశాసనాల పరిశోధన, లిపిశాస్త్రాల్లో ప్రావీణ్యతలు కలవాడు. మార్క్సిస్టు సిద్ధాంతవేత్త, సృజనశీల రచయిత. 20 ఏళ్లకే అనేక రచనలు చేశారు. జీవితపు చివరి రెండేళ్ళు మతిమరుపుతో బాధపడ్డా, అనేక అంశాల్లో 150 పైగా గ్రంథాలు రాశారు. వాటిల్లో సామాజిక శాస్త్రం, చరిత్ర, తత్వశాస్త్రం, బుద్ధిజం, టిబెటాలజి, నిఘంటువులు, వ్యాకరణం, సంపాదకత్వం, జానపద సాహిత్యం, విజ్ఞానశాస్త్రాలు, నాటకాలు, రాజకీయాలు, ప్రచార కరపత్రాలు, అనువాదాలు ఉన్నాయి. ఆయన చాల రచనలు ముద్రణకు నోచుకోలేదు. రాహుల్ ప్రఖ్యాత హిందీ రచనలలో వోల్గా నుండి గంగా (ప్రయాణం) వరకు ఒకటి. ఇది కాల్పనిక చారిత్రక గ్రంథం. ఇందులో యూరేసియా పచ్చిక బయళ్ళ నుండి రష్యాలో వోల్గానది పరీవాహక ప్రాంతం మధ్య, దక్షిణ ఆసియాలలోని హిందుకుష్ పర్వత శ్రేణులు, హిమాలయ పర్వత ప్రాంతాలు, భారత ఉపఖండంలో ఇండొ గంగానది మైదానాల మీదుగా ఆర్యుల వలసలను వివరించే 20 సంక్షిప్త కథలు ఉన్నాయి. ఈ కథలు క్రీ.పూ.6000 సంవత్సరంలో మొదలయి క్రీ.శ. 1942 తో ముగుస్తాయి. 1942లో గాంధీ ఆంగ్లేయులను దేశం వదిలి పొమ్మని క్విట్ ఇండియా ఉ ద్యమం మొదలు పెట్టారు. ఈ గ్రంథం ఆంగ్లంతో సహా అనేక భారతీయ భాషల్లోకి అనువదించబడింది. ఇప్పటికీ ఇది అధిక సంఖ్యలో అమ్ముడు పోతోంది. రాహుల్ రచించిన 'మధ్య ఆసియా చరిత్ర' పుస్తకానికి 1958లో కేంద్ర సాహిత్య అకాడెమి పురస్కారం లభించింది. 1963లో భారత ప్రభుత్వం

రాహుల్‌ను పద్మభూషణ్ పురస్కారంతో సత్కరించింది. ఆయనకు లోతయిన పాండిత్యం ఉన్నా సామాన్యులకు కూడా అర్థమయ్యే సాధారణ హిందీలోనే గాక సంస్కృతం, పాళీ భోజపురి భాషలలో తన రచనలు సాగించారు. రాహుల్ హిందీలో 10 నవలలు, 4 లఘు కథలు, 3 సంపుటాల్లో స్వీయ చరిత్ర, 17 జీవిత చరిత్రలు, 10 ఇతర పుస్తకాలు రచించారు. వాటిలో సింహ సేనాపతి, నా జీవన యాత్ర, కార్ల్ మార్క్స్, లెనిన్, స్టాలిన్, మావో సె టుంగ్, మహామానవ బుద్ధ, అక్బర్, ఋగ్వేద ఆర్యులు, దర్శన్ దిగ్దర్శన్, మానవ సమాజ్ ప్రధానమయినవి. 'దర్శన్ దిగ్దర్శన్' రెండు సంపుటాలలో ప్రపంచ తాత్విక చరిత్రను క్రోడీకరించారు. భోజపురిలో 4 నాటకాలు రచించారు. ఇవి గాక టిబెట్ కు సంబంధించిన 7 పుస్తకాలు రాశారు.

"ఏదీ స్థిరం కాదు. ప్రతిదీ క్షణికమే. (సబ్బం కనికం)" అన్న బుద్ధుని బోధన, "ఏదీ చివరిది కాదు. ఏ మనిషీ సంపూర్ణుడు కాదు. సత్య గుత్తాధిపత్యాన్ని నమ్మను. చేయవలసింది చేస్తాను. భావితరం దాన్ని మెరుగుపరుచుకోనీ." అన్న లెనిన్ వ్యాఖ్యానాలు రాహుల్ పై తీవ్ర ప్రభావం చూపాయి. 13.04.1919 న పంజాబ్ అమృత్‌సర్ జలియన్‌వాలాబాగ్ నరమేధంతో చలించిపోయారు. వలసవాద వ్యతిరేక రాజకీయాల్లో క్రియాశీలంగా పాల్గొన్నారు. బ్రిటిష్ వ్యతిరేక రచనలు చేసినందుకు, ఉపన్యాసాలు ఇచ్చినందుకు 3 ఏళ్ల జైలు శిక్ష అనుభవించారు. 1922 ఫిబ్రవరి 13 నుండి ఆగస్టు 9 దాకా బక్సర్ జైల్లో, 1923–24 లలో హజారిబాగ్ జైల్లో రాజకీయ ఖైదీగా గడిపారు. 1921–27 ల మధ్య రాజకీయాల్లో క్రియాశీలక పాత్ర పోషించారు. సహాయ నిరాకరణ ఉద్యమంలో ఉపన్యాసాలు చేశారు. గాంధీని గాంధీ బాబా గా పేర్కొని సనాతనవాదుల దురలవాట్లను ఖండించారు. రాహుల్ మంచి వక్త. ఆయన ఉపన్యాసం ప్రజల భాషలో గంగా ప్రవాహంలా సాగేది. 1935 లో సోవియట్ రష్యా తొలి పర్యటన తర్వాత సామ్యవాదిగా, మార్క్సిస్టుగా

మారారు. పునర్జన్మ, మరణానంతర జీవితం మొదలగు భావాలను తిరస్కరించారు. కిసాన్ సభ, జాతీయ కాంగ్రెస్‌లలో రాజకీయ క్రియాశీల కార్యకర్తగా పనిచేశారు. 19.10.1939లో కమ్యూనిస్టు పార్టీ సభ్యునిగా చేరారు. బాంబే లో హిందీ సాహిత్య సమ్మేళన్‌లో ఆయన అధ్యక్ష ఉపన్యాసానికి కినుక వహించిన పార్టీ రాహుల్ కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వాన్ని 1948 జనవరిలో రద్దుచేసింది. మేధావుల స్వతంత్ర భావాలకు విలువనివ్వకపోవడం మామూలే. రాహుల్ విజయాలలాగే ఆయన వ్యక్తిత్వం కూడా చిరస్మరణీయం, ఆకర్షణీయం. కుల వ్యవస్థపై విప్లవకర భావాలు కలిగి ఉండేవారు. గాంధీగారి హరిజనుల ఆలయ ప్రవేశ పిలుపు ఒక ఉచ్చు అన్నారు. హరిజన పేరునే ఎద్దేవా చేశారు. వారు దేవుని మనుషులైతే దేవుడు వారిని గుడ్డి కన్నుతో కూడా ఎందుకు చూడలేదన్నారు. హరిజనులకు నూలు వడకడంలో శిక్షణ ప్రయోజనం కలిగించదని, దానికి బదులుగా వారికి ప్రభుత్వ ఉద్యోగాలు ఇవ్వాలని వాదించారు.

రాహుల్ సాంకృత్యాయన్ శ్రీలంక విశ్వవిద్యాలయంలో బోధన వృత్తిని అంగీకరించారు. అక్కడ తీవ్ర అనారోగ్యం పాలయ్యారు. మధుమేహం, అధిక రక్తపోటు, గుండెపోటు బారిన పడ్డారు. జ్ఞాపకశక్తి కోల్పోయారు. 14.04.1963న 70 ఏళ్ల వయసులో, డార్జిలింగ్‌లో తుది శ్వాస వదిలారు. రాహుల్ సాంకృత్యాయన్ వ్యక్తిగతంగా సేకరించిన వస్తువులను, సమాచార గ్రంథాలను, చిత్రలేఖనాలను దేశవ్యాపిత విశ్వవిద్యాలయాలు, ప్రదర్శనశాలల్లో భద్రపరిచారు. ఆయన్ను మనం సర్వదా స్మరించుకోవాలి. ఆయన రచనలను అధ్యయనం చేయాలి. పరిశోధించాలి. సమాజ ప్రయోజనానికి అనువర్తించాలి. రాహుల్ తాత్వికత నేటి సమాజానికి అత్యవసర ఆవశ్యకం. విద్యావేత్తలు, విద్యార్థులకు రాహుల్ గురించి తెలియజేయాలి.



# 25

# బౌద్ధం-మార్క్సిజాలను సమ్మేళనం చేసిన మహోన్నత మానవుడు రాహుల్ సాంకృత్యాయన్

– **బెందాళం కృష్ణారావు,** రచయిత, జర్నలిస్టు, శ్రీకాకుళం, 7306434888

రాహుల్ సాంకృత్యాయన్ (1893 ఏప్రిల్ 9 – 1963 ఏప్రిల్ 14) హిందీ యాత్రాసాహిత్య పితామహుడిగా సుప్రసిద్ధులు. ఆయన బహుభాషావేత్త, బహుముఖ ప్రజ్ఞాశాలి, వైవిధ్యభరితమైన జీవితాన్ని జీవించారు. రాహుల్ సాంకృత్యాయన్ లోకసంచారిగా పేరుపొందారు. తన జీవితంలో 45 సంవత్సరాల పాటు యాత్రలలోనే గడిపారు. లోతైన తాత్త్విక చింతన కలిగిన సాంక ృత్యాయన్ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించి బౌద్ధ భిక్షువుగా మారి అనంతరం మార్క్సిస్ట్ సోషలిస్టుగా పరివర్తన చెందారు. సాంకృత్యాయన్ భారత జాతీయోద్యమంలో కూడా కృషిచేశారు. జాతీయోద్యమానికి అనుకూలంగా, బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా రచనలు, ప్రసంగాలు చేసినందుకు 3 సంవత్సరాల కారాగార శిక్షను అనుభవించారు. విస్తృతమైన అభిరుచులు, లోతైన చింతన, విపరీతమైన సంచార జీవనం వెరసి అపురూపమైన సాహిత్యాన్ని రచించారాయన. 1940వ దశకం ప్రారంభంలో ఆయన పూర్తిగా భౌతికవాద భావాలను స్వీకరించి, కమ్యూనిస్ట్ పార్టీలో సభ్యునిగా చేరి, జీవితాంతం కమ్యూనిస్ట్‌గా ఉన్నారు. అఖిల భారత కిసాన్ సభ అధ్యక్షునిగా ఆయన అనేక రైతు పోరాటాలకు నాయకత్వం వహించారు. బీహార్‌లో ఓ రైతు ఉద్యమంలో జరిగిన లాఠీఛార్జిలో ఆయనకు తలపై బలమైన దెబ్బ తగిలిగింది. రాహుల్జీ ఏక సంథాగ్రాహి అని, ఆయన టిబెట్ భాషనుండి సంస్కృతానికి అత్యంత వేగంగా అనువాదం చెయ్యగలిగేవారనీ ఆయనతో వ్యక్తిగతంగా పరిచయం ఉన్నవారు వివరించారు. ఆయన చేసిన రచనలలో, అనువాదాలలో చాలా భాగం ఇప్పటికీ ప్రచురణ కాలేదు. పురాతన బౌద్ధ గ్రంథాలను వెలికితీసి, వాటిని అనువాదం చేసి, ప్రపంచానికి తెలియ

పరచటంలో రాహుల్జీ అపారమైన కృషిని బౌద్ధులు ఎంతో విలువైనదిగా గుర్తించారు. ఒక్క భారతదేశంలోనే కాక యావత్ ప్రపంచ చరిత్రలోనే అంత ప్రతిభాశీలి, స్వయంకృషితో మహాపండితుడైన వ్యక్తి మరొకరులేరని అనేకులు వ్యాఖ్యానించారు. ఆయన రచనాశైలి సరళంగానూ, సామాన్య పాఠకులకు తాను చెప్పదలచుకున్నది సుళువుగా అర్థం అయ్యేటట్లుగానూ ఉంటుంది.

## బాల్యం

బ్రిటిష్ పాలనలో, యునై టెడ్ ప్రావిన్సెస్ (యూపీ) రాష్ట్రంలోని అజామ్‌గఢ్ జిల్లాలో 1893 ఏప్రిల్ 9లో సనాతన ధర్మాన్ని పాటించే బ్రాహ్మణ కుటుంబంలో కేదార్‌నాథ్ పాండే జన్మించారు. బౌద్ధాన్ని తనలో ఇంకించుకున్న వాడుగా తర్వాత తన పేరును రాహుల్ సాంకృత్యాయన్‌గా మార్చుకున్నారు. ప్రాథమిక విద్య ఉర్దూ మాధ్యమంలో చదివారు. చిన్న తనంలోనే తల్లిదండ్రులు మరణించటంతో అమ్మమ్మ, తాతల వద్ద పెరిగారు. తన 11వ ఏట ఒక ఫకీరు పాడిన గేయాన్ని విని, తన మొత్తం జీవితాన్ని ఒక కొత్తదారిలో నడిపానని ఆయన తన ఆత్మకథలో రాసుకున్నారు. తన అమ్మమ్మకు మాంసం వాసన పడదనీ, ఆ కారణంచేత తాను, తన తాతగారు పెరటిలో మాంసం వండుకుని తినేవారమనీ తన ఆత్మకథలో వివరించారు. నేడు హిందూత్వ వాదులు హిందూమతం, హిందూ సంస్కృతి మాంసభక్షణకు విరుద్ధమని చేసే ప్రచారం మోసపూరితమైనదని 120 ఏళ్లక్రితం ఒక సనాతన బ్రాహ్మణ కుటుంబంలో మాంస భక్షణ చేసేవారనీ మనకు ఆయన ఆత్మకథ ద్వారా అర్థం అవుతుంది.

**దునియాకి సైర్ కర్ కాఫిర్**
**జిందగానీ ఫిర్ కహా**
**జిందగీ గర్ కుచ్ రహీతో**
**నౌజవానీ ఫిర్ కహా**

(ప్రపంచ పర్యటన చేయరా, మూర్ఖుడా,
జీవితం ఒకేసారి లభిస్తుంది. ఆ జీవితంలో, యవ్వనం అతి చిన్నది)

ఆ గేయం విన్న తరువాత తన రెండు కాళ్లూ ఎప్పుడూ ఒకచోట నిలుపలేదంటారు ఆయన. కాశీ విద్యాపీఠ్‌లో సంస్కృతం నేర్చుకున్నారు.

ఆర్యసమాజంలో చేరి హిందూమత వ్యాప్తికి కొన్నాళ్లు కృషి చేశాడు. ఆ సమయంలోనే చక్కటి ఉపన్యాసాలు ఇవ్వటం, కొత్త విషయాలు తెలుసుకోవటానికి గ్రంథాలు చదవటం ప్రారంభించారు. తొమ్మిదేళ్లప్పుడే ప్రపంచం ఏమిటో చూడాలని ఇంట్లోంచి పారిపోయారు సాంకృత్యాయన్. 8వ తరగతితోనే అతని చదువు ఆగిపోయింది. వేలాది కిలోమీటర్లు కాలినడకన చుట్టివచ్చారు. మూడు బౌద్ధ వేదాలనూ జీర్ణించుకుని త్రిపిటకాచార్య అయ్యారు. టిబెట్, శ్రీలంక, ఇరాన్, చైనా, అప్పటి సోవియట్ రష్యా. ఎక్కడ తిరిగితే అక్కడి భాష నేర్చుకున్నారు. అరబిక్, భోజ్‌పురి, ఫ్రెంచ్, హిందీ, కన్నడం, మైథిలి, నేపాలీ, పాళీ, పర్షియన్, రష్యన్, రాజస్థానీ, సింహళీస్, తమిళం, ఉర్దూ లాంటి ముప్పైకి పైగా భాషలు, అందులోని యాసలు కూడా ఆయనకు తెలుసు. ఎక్కడా అధికారికంగా చదువుకోకపోయినా విశ్వవిద్యాలయాల్లో బోధించే స్థాయికి ఎదిగారు. అందుకే ఆయన్ని మహాపండిత్ అనేవారు.

## యాత్రా జీవనం

ఆయన నిత్యసంచారిగా తన జీవితంలో సగానికి పైగా కాలాన్ని ఇంటికి సుదూరమైన ప్రాంతాలను సందర్శిస్తూ గడిపారు. ఆయన భ్రమణకాంక్ష భారతదేశంలోని లడఖ్, కిన్నౌర్, కాశ్మీర్ వంటి వైవిధ్యభరితమైన ప్రాంతాలకు, విదేశాలైన నేపాల్, టిబెట్, శ్రీలంక, ఇరాన్, చైనా, ఆనాటి సోవియట్ రష్యా వంటి ప్రాంతాలకు తీసుకువెళ్ళింది. ఎన్నో ఏళ్ళపాటు బీహార్ రాష్ట్రానికి చెందిన శరణ్ జిల్లాలోని పర్స గఢ్ గ్రామంలో గడిపారు. దానికి గుర్తుగా ఆ గ్రామంలో ఏర్పాటు చేసిన గ్రామ ద్వారానికి రాహుల్ గేట్ అని పేరుపెట్టారు. ప్రయాణించేప్పుడు వీలున్నంత వరకూ ఉపరితల రవాణాపైనే ఆధారపడ్డారు. ఆయన పలు ప్రదేశాల గురించి తెలుసుకునే జిజ్ఞాసతో ప్రయాణించారు. పదమూడో శతాబ్దంలో నలంద, విక్రమశిల విశ్వవిద్యాలయాలను భక్తియార్ ఖిల్జీ ధ్వంసం చేసినప్పుడు బౌద్ధ భిక్షువులు పవిత్రమైన గ్రంథాలతో పారిపోయారనీ, ఆ విలువైన సంస్కృత పుస్తకాల్ని టిబెట్‌లోని ఆరామాల్లో భద్రపరిచివుంచారనీ ప్రచారంలో ఉంది. అయితే, ఆరు వందల ఏళ్ళుగా వాటిల్లో ఏముందో చూసినవారు లేరు. సాంకృత్యాయన్ వాటికోసం అన్వేషిస్తూ, దారి

కూడా సరిగాలేని కొండల్లో నడుస్తూ, కాశ్మీర్, లడఖ్, కార్గిల్ మీదుగా టిబెట్ వెళ్లారు. అక్కడ పుస్తకాలైతే లభించాయి గానీ అవి సంస్కృతంలో లేవు. అన్నీ భోటి భాషలో ఉన్నాయి. రాహుల్జీ కంచర గాడిదల మీద వాటిని తరలించుకొచ్చారు. ఆ గ్రంథాలన్నీ పాట్నా మ్యూజియంలో ఉన్నాయిప్పుడు. మరో మూడుసార్లు టిబెట్ వెళ్లారు. టిబెటన్ నేర్చుకున్నారు. నేర్చుకోవడమే కాదు దాని వ్యాకరణ పుస్తకాలు రాశారు. టిబెటన్–హిందీ నిఘంటువు కూర్చారు. నాటి సోవియట్ యూనియన్‌లోని అనేక రిపబ్లిక్కులలో ఆయన విస్తృతంగా పర్యటించి, సంస్కృతం, పాళీ భాషలో లిఖించబడిన అనేక శాసనాలను, రాతి ఫలకాలనూ కనుగొన్నారు. భారతదేశంలోనూ, నేపాల్, హిమాలయ సానువులలోనూ, టిబెట్‌లోనే కాకుండా ఆయన మంగోలియా, ఆఫ్ఘనిస్తాన్ మీదిగా అనేక దేశాలలో విస్తృతంగా పర్యటించారు.

## రచనలు

రాహుల్జీ 20 ఏళ్ల ప్రాయం నుంచే ప్రారంభించి సోషియాలజీ, మతం, తత్వం, భాష, సైన్సు మీద చరమదశ వరకు 134 పుస్తకాలు రాశారు. బౌద్ధం మీద లెక్కలేనన్ని పరిశోధనలు చేసిన గొప్ప పరిశోధకుడు. చరిత్ర తత్వశాస్త్రం, జీవిత చరిత్ర కళలు, ఖగోళ శాస్త్రం, ఆరోగ్యం, భూగోళ శాస్త్రం, మొదలైనవన్నీ చదివి జీర్ణం చేసుకొన్నారు. అనేక దేశాలు పర్యటించారు. ఇరాన్, ఇరాక్, రష్యా, యూరప్, చైనా, జపాన్, శ్రీ లంకా మొదలైన దేశాలను రాహుల్ సందర్శించారు. అయితే అతనికి అత్యంత పేరు తెచ్చిన యాత్రలు మాత్రం టిబెట్ యాత్రలు. టిబెట్‌కు నాలుగు సార్లు వెళ్ళారు. అందుకే ఆయన్ను సంచార చక్రవర్తి అనీ, దేశ దిమ్మరుల ఆచార్యుడనీ, అంటారు. 1929లో నేపాల్ వెళ్ళారు. చేతిలో పాస్‌పోర్ట్ లేదు. తనకున్న పరిచయాలతో వెంటనే దాన్ని పొందారు. 16000 టిబెటన్ పదాలు సేకరించారు. అతని కోరిక ఒక్కటే, బౌద్ధ గ్రంథాలను సంస్కృతంలోకి అనువాదం చేయించటం. దొరికిన పుస్తకాలన్నిటినీ సేకరించారు. తన దగ్గరున్న పుస్తకాలు వస్తువులు వారికి కానుకలుగా అందజేశారు. అరుదైన కాన్జూర్, టాన్జూర్, గ్రంథాలను కొన్నారు.

130 వర్ణ చిత్రాలు, 1600 కు పైగా వ్రాత ప్రతులు సేకరించి వాటిని 18 కంచర గాడిదలపై, 39 రోజులు ప్రయాణం చేసి డార్జిలింగ్ దగ్గరున్న కలింపాంగ్ చేరారు.

యాత్రికుడు హుయాన్ త్సాంగ్ తర్వాత ఇంత భారీగా సేకరించిన వారెవరు లేరని చరిత్రకారుల అంచనా. వీటినన్నిటినీ శ్రీలంక, పాట్నా, మ్యూజియంలలో భద్రపరిచారు. అమ్మమని ఎంతోమంది బ్రతిమిలాడినా ససేమిరా అన్నారు. అవసరమైతే ఫోటోలు తీయించి ఉచితంగా అందజేశారు. అంత నిక్కచ్చైన మనిషి. కలకత్తాలోని మహా బోధి సొసైటీ, లండన్ బుద్ధిష్ట్ సొసైటీ ఆయన ఆసక్తి గమనించి ఆయన్ను వారి ఖర్చులను భరించి యూరప్ దేశాల్లో రాహుల్జీని బౌద్ధ మత వ్యాప్తి కోసం పంపించాయి. తన సహచరుడుగా కౌసల్యాయన్‌ను తోడు తీసుకొని వెళ్ళారు.

టిబెట్ యాత్రను గురించి “టిబెట్ లో 15 నెలలు” పుస్తకం రాశారు. దీన్ని యాత్రా సాహిత్యంలో గొప్పది అంటారంతా. 1934, 36, 38 లో కూడా టిబెట్ యాత్ర చేశారు. అరుదైన బౌద్ధ గ్రంథాలను సేకరించి తెచ్చారు. ఆయన భాషా సాహిత్య సేవలకు అభినందించి, ఒరిస్సా బీహార్ రిసెర్చ్ సొసైటీలు రాహుల్జీని ఘనంగా సన్మానించాయి. ఆయన టిబెట్ నుంచి తెచ్చిన పుస్తకాలలో మాఘుడు రాసిన శిశు పాల వధ కావ్యంపై భావదత్తుడు రాసిన టీకా, బుద్ధ శ్రీ జ్ఞాన్ రాసిన “ప్రజ్ఞా దీపావళి” ఉన్నాయి. శతసహస్ర గ్రంథాలను సేకరించి తెచ్చారు. 38 కట్టలుగా వున్న సంస్కృత గ్రంథాలు, ధర్మకీర్తి రాసిన పుస్తకాలు, ప్రమాణ వార్షిక సేకరించారు. 8000 శ్లోకాలున్న అనంగుడు రాసిన “యోగాచారభూమి” చంద్ర వ్యాకరణం, తర్క రహస్యం, మొదలైన అపూర్వ గ్రంధ సేకరణ చేశారు సాంకృత్యాయన్. తన అన్ని యాత్రలపైనా విపులమైన సమాచారాలతో పుస్తకాలు రాశారు.

ఆయన రాసిన ప్రసిద్ధ గ్రంథం ఓల్గా సే గంగలో క్రీస్తు పూర్వం ఆరువేల సంవత్సరాల నుంచి క్రీస్తు శకం 1942 వరకు ఇండో యూరోపియన్ మానవ

సమాజ వికాసాన్ని ఇరవై కథల ద్వారా చిత్రీకరించారు. 1943లో వోల్గా సే గంగా (తెలుగు అనువాదం, 'వోల్గా నుండి గంగ వరకు') అనే గ్రంథంలో ఆయన 8000 సంవత్సరాల కాలంలో, వోల్గా నదీ తీరం నుండి తరలివచ్చిన ఆర్య జాతి చరిత్రను 20 కథల రూపంలో 1942 స్వాతంత్ర్యోద్యమం వరకూ చక్కటి, ఆసక్తికరమైన భాషలో వివరించాడు. మానవ సమాజం, ముఖ్యంగా ఆర్య జాతి పరిణామాన్ని ఆయన గొలుసుకట్టు చరిత్ర కథల రూపంలో రాశారు. ఈ విధంగా భారతదేశంలో ఆర్యులు ఏవిధంగా స్థిరపడ్డారో, సంస్కృత భాష అభివృద్ధి, వేద, పురాణాల గ్రంథస్థం మొదలైన విషయాలు చరిత్ర తెలియని సామాన్య పాఠకులకు కూడా అర్థమయ్యే రీతిలో ఆయన వివరించారు. కమ్యూనిస్టులకు అది తప్పనిసరిగా చదువవలసిన గ్రంథం. 'వోల్గా నుండి గంగ వరకు' గ్రంథం, గోర్కీ రాసిన 'అమ్మ' కమ్యూనిస్టులు సాధారణంగా చదివే తొలిగ్రంథాలు. రాహుల్జీ రచించిన ఇతర గ్రంథాలలో విస్మృత యాత్రికుడు (తన జీవిత గాథ), జయ యౌధేయ (పర్షియా, ఆఫ్ఘనిస్తాన్, నేటి పాకిస్తాన్ ప్రాంతాల్లో క్రీ.పూ. 1000 కాలంలో ఆర్యుల జీవన విధానం), రుగ్వేద ఆర్యులు – రుగ్వేదాన్ని భౌతికవాద దృక్పథంతో విశ్లేషించిన అత్యంత విలువైన గ్రంథం ఇది. తన గ్రంథం 'రుగ్వేద ఆర్యులు'లో ఆర్యులు ఇంద్రుని ప్రార్థిస్తూ, 'ఓ ఇంద్రా, నీ కోసం కాల్చిన లేగ దూడ మాంసాన్ని, సురనూ సిద్ధం చేశాము. నీవు ఆరగించిన తరువాత ఇక్కడ ఉన్న బ్రాహ్మణులు ఆరగిస్తారు' అని అర్థం వచ్చే శ్లోకాన్ని వివరించారు. దివోదాసు గ్రంథం ఆర్యుల, ఇతర అనార్య జాతుల జీవన విధానాన్ని వివరిస్తుంది. ఆర్యులకు, స్థానికంగా ఎప్పటినుండో భారతదేశంలో నివసిస్తోన్న అనార్యులకూ మధ్యన జరిగిన యుద్ధాలూ, అనార్యుల ఓటమి, కులవ్యవస్థ నిర్మాణం, అనార్యులకు ఆనాటి సమాజంలో నిమ్న కులాలుగా స్థానం ఇచ్చి, వారి శ్రమను దోచుకునే విధానం ఏ విధంగా ప్రారంభం అయిందో ఆయన చక్కగా పూసగుచ్చినట్లు ఈ గ్రంథంలో వివరించారు. భారతీయ భాషలలో సందర్శనా గ్రంథాలకు ఆద్యుడు రాహుల్జీ. ఆయన స్వయంకృషితో, కఠోర శ్రమతో, అమితమైన

పట్టుదలతో అపార విజ్ఞానాన్ని పొంది, సరళమైన భాషలో సామాన్య ప్రజలకు విశదం అయ్యేటట్లుగా మొత్తం 134 పుస్తకాలను రచించాడు. సోవియట్ యూనియన్‌లోని లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయం ఆయనను 1937లో ఆహ్వానించి గౌరవ ప్రొఫెసర్‌గా నియమించింది. అచట రెండేళ్లు పనిచేసి, తిరిగి 1947-48లో ఆ పదవిలో కొనసాగాడు. ఆయనలోని అపార విజ్ఞాన సంపదను గుర్తించి, ఆయనను మహాపండితగా అందరూ సంబోధించేవారు. దాదాపుగా అన్ని భారతీయ భాషలనూ అయన ఆకళింపు చేసుకున్నారు. హిందీ, సంస్కృతం, టిబెట్ భాష, ప్రాకృతం, పర్షియన్, ఫ్రెంచ్, రష్యన్, చెక్, చైనీస్, పోలిష్, సింహళ, పాళీ, భోజ్‌పురీ, రాజస్థానీ, గుజరాతీ, తమిళం, కన్నడ ఆదిగా అనేక భాషలలో ఆయన పాండిత్యం గడించారు. 1958లో సాహిత్య అకాడమీ పురస్కారం, 1963లో పద్మభూషణ్ బిరుదులు లభించాయి.

## వ్యక్తిగత జీవితం

ఆయనకు బాల్యంలో వివాహం జరిగినా, నిత్య సంచారి అయిన తాను తన భార్యను చాలాఏళ్ల తరువాత ఒకసారి చూశానని తన ఆత్మకథలో రాసుకున్నారు. ఆయన లెనిన్ గ్రాడ్ విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్నప్పుడు ఒక మంగోలియన్ స్త్రీని వివాహం చేసుకున్నారు. అయితే ఆయన భారత దేశానికి తిరిగి వచ్చేటప్పుడు ఆమెను భారతదేశంలో స్థిరపడటానికి సోవియట్ ప్రభుత్వం ఒప్పుకోకపోవటంతో వారు విడిపోయారు. ఆ తరువాతి కాలంలో ఆయన కమల అనే భారతీయ స్త్రీని వివాహమాడి డార్జిలింగ్‌లో స్థిరపడ్డారు.

1963 ఏప్రిల్ 14లో శ్రీలంకలో ఆచార్యుడుగా పనిచేస్తూ, ఆయన అంతిమ శ్వాస విడిచారు. రిఫరెన్సు పుస్తకాలు కూడా కంఠోపాఠంగా ఉంచుకున్న ఈ మహావిజ్ఞాని చివరిరోజుల్లో తన పేరేమిటో తనే చెప్పుకోలేని మతి మరుపులోకి జారిపోయారు. ఆయన స్మృతి చిహ్నం డార్జిలింగ్ నగరంలో ఉంది.



# ముగింపు

దేశవ్యాప్తంగా పెరిగిపోతున్న జడ పరిస్థితులకి భిన్నంగా జవసత్వాలు గల సమసమాజాన్ని నిర్మించుకోవడమే ఏ వ్యవస్థకయినా నిజమయిన సంస్కరణ. దోపిడీ, పీడనలకి వ్యతిరేకంగా ఒక ఉత్తమ మానవ సమాజం కోసం జరిగే ఉన్నత ప్రయత్నం ఆ ఉద్ధరణాభిలాష. అది ఊరికే జరిగేది కాదు, ఊసుపోక చేసేదీ కాదు. శతాబ్దాలుగా జరుగుతూ వస్తున్న నిరంతర పురోగామి ప్రవంతిలో అదో భాగం. తరతరాలుగా పెరుగుతూ పోతున్న పునర్వికాశపు చైతన్యంలో అదో విభాగం.

రాహుల్జీ గురించిన సమావేశమూ, ఆయన జీవితమూ, కృషికి సంబంధించిన ఈ సంకలనమూ ఈరోజు తలపెట్టినవి కాదు, సునాయాసంగా పూర్తయినవీ కాదు. వీటి వెనుక వ్యక్తిగా నా ఒక్కడి కృషి కంటే, వారి శక్తికి మించి మద్దతిచ్చిన అనేకమంది మిత్రుల సంకల్పదీక్ష ఉన్నది. దానికి దన్నుగా నిల్చిన విస్తృతమయిన ఆలోచన బలమూ, ఆచరణా సమారోహమూ ఉంది. అదే ఏ సాంఘిక పరిణామానికైనా అవసరమయిన మార్గం.

ఢిల్లీలో ఉంటూ రాహుల్జీ జీవితం కోసం కనీసం చిన్న డాక్యుమెంటరీయో, షార్ట్ ఫిల్మో తీద్దామని ప్రయత్నిస్తున్న మోహిత్ అనే యువకుడి నుండి యూ.పి.లో ప్రస్తుతం రాహుల్జీ అవసరం ఎప్పటికంటే చాలావుందని మధనపడే మిత్రుడు గౌతం వరకూ ఎన్నో యత్నాలు. పరిధులు, పరిమితులూ ఎలాగూ ఉంటాయి. కాని వాటికన్నా ప్రాపంచిక దృక్పథం ప్రధానమని నా అభిప్రాయం. అదే ప్రపంచాన్ని అర్థం చేసుకోడానికీ, మార్చడానికీ పనికొచ్చే పనిముట్టు.

మానవీయ సారంతో కూడిన సంస్కృతికి మానవ రూపం రాహుల్జీ. మనిషి ఎలా జీవించాలో సోదాహరణంగా నిరూపించినవాడు. మార్పుని ఎలా ఆహ్వానించాలో మట్టితో మమేకమై చూపించినవాడు. అస్తిత్వాన్ని ఎలా

ఆస్వాదించాలో అందరికీ ఆసువుగా నేర్పించినవాడు. నిజంగానే ప్రతితరాన్నీ తన ప్రజ్ఞతో అబ్బురపరిచే అద్వితీయ వ్యక్తిత్వం రాహుల్జీది. బహుముఖ పాశ్వాలు గల ఆయన కృషిని కాపాడుకోవడం మనందరి ఉమ్మడి స్వప్నం కావాలి.

అలాంటి సమిష్టి స్వప్నాలే ఆరోగ్యకరమయిన సమాజ నిర్మాణానికి హేతుబద్ధ సోపానాలు. అవిశ్రాంతంగా ప్రజ్వరిల్లే ఆలోచనా తరంగాల్ని ఆశయ సాధనాలుగా మలిచే క్రియాశీలక కార్యరంగాలు. అవే ఏనాటికయినా మనిషిని ఒక మహోన్నతమయిన మానవుడిగా తీర్చిదిద్దే అహోరాత్రుల అన్వేషణా గవాక్షాలు. అలాంటి అద్భుతమయిన, అందమయిన ఒక రంగురంగుల సమాజాన్ని, భిన్నత్వంతోనూ – బహుళత్వంతోనూ కలిపి ఆలింగనం చేసుకోవడమే మానవ జీవితాన్ని సార్థకం చేస్తుంది.

అలా తన జీవితాన్ని అర్థవంతం చేసుకున్న మహావ్యక్తి మహా పండిత్ రాహుల్ సాంకృత్యాయన్. అనేక భిన్నాభిప్రాయాలు, ఎన్నో పరిమితులు ఉన్నప్పటికీ ఆయన గురించి ఇప్పటికిలా చిన్న ప్రయత్నం చేయడం జరుగుతోంది. ఇంతకుమించిన మంచి ప్రయత్నాలు భవిష్యత్తులో మరిన్ని జరగాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ ఈ కార్యక్రమంలో ప్రత్యక్షంగా – పరోక్షంగా సహకరించిన ఎందరో మిత్రుల్నీ, అమిత్రుల్నీ, అభిమానుల్నీ, శ్రేయోభిలాషుల్నీ గుర్తుచేసుకుని వారికి పేరుపేరునా ధన్యవాదాలు చెబుతూ, కృతినిలా ముగిస్తున్నాను.



# ఇతర ప్రచురణలు

1. ప్రజాస్వామ్య పతనం
2. అరాజకత్వం అంటే ఏమిటి?
3. సాంఘిక తత్వం - వైప్లవ మార్గం
4. ఒక నాస్తికుడి నామా
5. ప్రజాస్వామ్య ప్రస్థానం
6. అస్థిత్వం–అరాజకత్వం
7. మద్యంపై యుద్ధం
8. మతానికి మరణశాసనం–మనిషికి పునరుజ్జీవనం
9. కరపత్రాల కథా కమామీషు (కరపత్రాల సంపుటి)
10. తత్వ విచారణ–తర్క వివేచన
11. కులానికో సవాలు
12. ప్రకృతి–శాస్త్రం–సమాజం
13. హేతువాద దృక్పథం–విధానపర కర్తవ్యం
14. కలాలు కరపత్రాలు
15. పార్టీరహిత ప్రజాస్వామ్యం సాధ్యమా?
16. శిధిలాక్షరం (కవితా సంపుటి)
17. వ్యవస్థలు - వ్యసనాలు
18. ప్రజా ఉద్యమాల ప్రాతిపదిక
19. తరగతి గది తత్వశాస్త్రం
20. అభివ్యక్తి
21. సాఫల్య జీవులు (ప్రసంగ వ్యాసాలు)
22. భారతదేశ పతనానికి ప్రధాన కారణం : కులం
23. మహామానవవాద తత్వవేత్త : ఎమ్.ఎన్. రాయ్

## ఇంటర్వ్యూలు - పరిచయాలు

24. ధిక్కార స్వరాలు (భావోద్యమకారుల ఇంటర్వ్యూలు)
25. విస్తృత స్వరాలు (కొందరు గాంధేయవాదుల ఇంటర్వ్యూలు)
26. సద్ధమ్మ స్వరాలు (కొందరు బౌద్ధోద్యమకారుల ఇంటర్వ్యూలు)
27. ధీరోదాత్తులు (కొద్దిమంది సామాజిక కార్యకర్తల పరిచయాలు)
28. మరువలేని మనుషులు–మరుపురాని జ్ఞాపకాలు
29. ప్రకృతి శాశ్వత ప్రగతి (సుందర్లాల్ బహుగుణ ఇంటర్వ్యూ)
30. రాజీలేని ధిక్కార పతాకాలు (కొద్దిమంది సామ్యవాదుల పరిచయాలు)

## సంపాదకత్వం - సంకలనాలు

31. మద్యపానమా? మానవత్వమా? (మద్యం గూర్చి మహిళల వ్యాసాలు)
32. మానవతకు భరోస (మ.వ్య.ప్ర.స. అర్ధ దశాబ్ద్యుత్సవ సావనీర్)
33. సహృదీయం (సహృదయ మిత్రమండలి 15 సం॥రాల సావనీర్)
34. పేదల కలలు (అనువాద కథా సంకలనం)
35. సంస్కృతి (సంక్షోభాలు–సంవాదాలు)
36. ప్రత్యామ్నాయ సినిమాలు (దృక్పథాలు–దృక్కోణాలు)
37. మానవీయ ఆసరా స్వరం : మద్యపాన వ్యతిరేకోద్యమం
38. భారతదేశ ప్రజలమైన మేము... (70 సం॥రాల రాజ్యాంగంపై వ్యాసాలు)
39. చదువు అంటే ఏమిటి? చదువులెందుకు? (విద్యపై విభిన్న భావాలు)
40. ప్రజలు – కళలు (ప్రత్యామ్నాయ ప్రజాకళాతత్వ వ్యాస సంకలనం)
41. ఆంధ్రరాష్ట్ర సాంఘిక సంస్కర్తలు... (పి.హెచ్. గుప్తా, పునర్ముద్రణ–వ్యాసం)
42. భారతదేశంలో వందేళ్ళ కమ్యూనిజం (విధానాలు–వైఖరులు)
43. నవభారత యువ దిక్సూచి.. భగత్సింగ్ (90వ వర్ధంతి ప్రత్యేక వ్యాస సంకలనం)
44. కుల నిర్మూలన కోసం: అభిప్రాయాలు–ఆలోచనలు (కుల నిర్మూలనకి 85 సం॥లు)
45. పరాయీకరణ (పరిణామాలు – పర్యవసానాలు)
46. శ్రమైక జీవన సంస్కృతి (ప్రత్యామ్నాయ సంస్కృతిపై ప్రముఖుల ప్రసంగాలు)

## అనువాదాలు

47. పురుషుడు–స్త్రీ (చలం ఏకైక ఆంగ్ల వ్యాసం తెలుగులో)
48. సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా... (లోక్‌నాయక్ జె.పి. వ్యాసం)
49. శాస్త్రీయ హేతువాద సామ్యవాది: వివేకానంద (దత్తప్రసాద్ దభోల్కర్ రచన)
50. సాలీడు–ఈగ (విలియం లిబ్నిక్ కథ తెలుగులో)
51. నంది మూపురం (డి.డి. కౌశాంబి పిల్లల కోసం రాసిన ఏకైక కథ)
52. ఎక్కడ మనసు నిర్భయంగా ఉంటుందో... (ఠాగోర్ కవితా విశ్లేషణ)
53. చారిత్రక మహోద్యమం–చంపారన్ సత్యాగ్రహం (శతవార్షికోత్సవ ప్రచురణ)
54. స్వేచ్ఛ–సాంస్కృతిక ఆవశ్యకత (ఎమ్మెన్ రాయ్ రచన)
55. మన విద్యా సమస్య (లాలా లజపతిరాయ్ వ్యాసం)
56. జీవితానికి అర్థం ఏమిటి? (ఆచార్య నరేంద్రదేవ్, లోహియా రచనలు)
57. అభివృద్ధి – ఆదివాసులు – హింస (హిమాంశు కుమార్ రచన)
58. మనిషి–మార్జాలం (కానర్డ్ లోర్నెంజ్ కథ)
59. సినిమా కార్యకర్తల కరదీపిక (చల్తీ తస్వీరే ప్రచురణ)
60. నేను–ప్రజలు–ప్రపంచం (పిఠాపురం యువరాజా ఆత్మకథ)
61. భారతదేశంలో బౌద్ధ పతనం (అంబేద్కర్, రాహుల్జీల రచన)
62. అనారోగ్యాన్ని పండగ చేసుకుందాం... (తమిళ తాత్వికుడు నమ్మళ్వార్ రచన అనువాదం)
63. భారతదేశ విముక్తి మార్గం – బౌద్ధం (అంబేద్కర్ 5 బౌద్ధ ప్రసంగాలు)